64135

# నెస్టమ్® బేబీ సిరియల్ – రైస్

## మీ పాపాయి యొక్క ఆదర్శప్రాయమైన తొలి ఘన ఆహారం

### వాడి చూడండి!

స్టమ్ బేబీ సిరియల్‌ని పాలలో కలిపినప్పుడు
డి న్నానికి గల తేలిగ్గా జీర్ణమయ్యే గుణం,
రిపూర్ణ పోషకాహారపు మంచితనం
జేస్తుంది. 4 నెలలు వయసు వచ్చాకా
యి ఆహారంలో మీరు ఘన పదార్ధాలు
పెట్టేటప్పుడు, నెస్టమ్‌తో
భించండి. బియ్యంతో తయారు
బడిన నెస్టమ్, తేలిగ్గా జీర్ణయం
య్యేందుకు ప్రత్యేకంగా రూపొందించబడింది.
కాదు, నెస్టమ్, ఇనుము, విటమిన్‌లతో
ంత బల వర్ధకం చేయబడింది.



నెస్టమ్‌ని తయారు చేయడం ఎంతో సులువు
దీనిని ముందుగా కాచిన వెచ్చటి పాలల్లో
కలపండి అంతే, పాపాయికి తినిపించేందుకు
ఆహారం తయారు!

నెస్టమ్ పాలు లేకుండా అందుబాటులో ఉన్న
ఒకే ఒక సిరియల్. మీరు మీ పాపాయి
ఆహారంలో వివిధ రుచులు తెచ్చేందుకు
ముందుగా ఉడికించి యింట్లోనే తయారు చేసిన
మెత్తటి గుజ్జుగా చేసిన కూర ముక్కలు, పప్పు,
పండ్లు నెస్టమ్‌లో కలపండి.




కేవలం
రూ 9/-* కే
డబ్బాలో
200 గ్రా.
సంచీ

* స్థానిక పన్నులతో సహా




**ఉచితం!**
నెస్టమ్ రెసిపి బుక్ లెట్
ఈ చిరునామాకు వ్రాయండి
నెస్టమ్
పోస్ట్ బాక్స్ నెం. 6016
న్యూ ఢిల్లీ 110 008




ప్రస్తుతం ఒక్క ఆంధ్ర ప్రదేశ్ లోనే దొరుకుతోంది.

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమ ధర్మపథములకెల్లన్!

ఎడిటోరియల్ అడ్వయిజర్: శివలెంక రాధాకృష్ణ    ఎడిటర్: వీరాజీ

విజయవాడ
1-9-1989

ముద్రాపకుడు, ప్రచురణకర్త : శివలెంక నాగేశ్వరరావు

శక సం. 1911
భాద్రపద మాసం 10 వ తేదీ

# కాశ్మీర్‌లో "అంధకారం" యింకా ఎన్నాళ్లు?

ఆగస్టు *14*న కొంతమంది-భారత్ భూభాగంలో అంతర్లీనమై పోయిన-"జమ్మూ-కాశ్మీర్" రాష్ట్రంలో పాకిస్తాన్ జెండా ఎగురవేసి, బాణాసంచాలు కాల్చి-సంబరాలు చేశారు-ఆ మర్నాడు మరి కొంతమంది దుండగులు భారత జాతీయ పతాకాన్ని ఎగురవేసి సంబరాలు చేసుకోవడానికి ప్రజలకి-అదే-దుండగులు అవకాశం యివ్వలేదు. "చీకటి రోజు"గా దీన్ని పరిగణించాలని - బంద్‌లతో బాంబుల ప్రేలుళ్లతో- ప్రజలని బలవంతం చేశారు! అదే సమయంలో భారత రాష్ట్రపతి 'శాంతి సూక్తులు' ప్రవచిస్తున్నారు. దేశ ప్రధానమంత్రి ప్రతిపక్షాలలో దేశద్రోహులున్నారని ఎర్రకోట బురుజుమీద నిలబడి ఆవేదన వెలిబుచ్చుతున్నారు. కాశ్మీర్‌లో ఉన్నది కాంగ్రెసు పార్టీతో కలసి అక్కడే పుట్టి అక్కడే పరిఢవిల్లిన నేషనల్ కాన్ఫరెన్స్ స్థాపించిన ప్రభుత్వం. దాని గవర్నర్ దేశానికి మొన్న మొన్నటిదాకా సైన్యాధిపతిగా వున్న జెనరల్ కె. వి. కృష్ణారావు, కాని ఆ గవర్నమెంటు ఈ ఆగడాలను యింత పిసరు అరికట్టలేక పోయింది.

కాశ్మీర్ భారతదేశం పటంలో చూస్తే నెత్తిమీద పెట్టుకున్న మరేష్మ కుచ్చుల టోపీలాగ వుంటుంది, కాని అనుభవంలో అది తలమీద మానని 'పుండు' మాదిరి దేశానికి స్వాతంత్ర్యం వచ్చినది మొదలుగా వుంటున్నది! అక్కడి అశాంతిని-దేశ ద్రోహ ఉద్యమాల్ని గడచిన నలభై సంవత్సరాల కాలంలోనూ కేంద్రంలో వున్న గవర్నమెంటు-రాజకీయ దృష్టిలోను, అక్కడ తనకి ప్రాబల్యంవున్న రాష్ట్ర ప్రభుత్వాన్ని స్థాపించాలన్న పంతంతోను చూస్తూ వస్తున్నదేగాని "కీల"రిగి వాతపెట్టే మాదిరి "చర్య"లకి, ఆదిన-నెహ్రూజీ గాని అటు తర్వాత, స్థిమితంగా దేశాన్ని చాలా కాలం పరిపాలించిన నెహ్రూ తనయ శ్రీమతి యిందిరాగాంధీ కాని పూనుకోలేదు. ఇవాళ అది మన యువప్రధానమంత్రికి తలకు మించిన భారమైపోయింది! కాశ్మీర్‌లోవున్న ప్రజలంతా అరవై డెభై లక్షలమందికి మించి లేరు!-చరిత్ర నొక్కసారి ఒక క్షణమాత్రం వీక్షించినచాలు-కరిన వాస్తవాలెన్నో కాశ్మీర్ గురించి మనకి భయంకర "భూత" సత్యాల్లాగా గోచరిస్తాయి! *1947* ఆగస్టు *14*న పాకిస్తాన్‌లో అక్కడ జెండాలు ఎగురవేసి 'జిన్నా'కి జేజేలు చెబుతున్నప్పుడు-కాశ్మీర్‌లో ఆ సంబరాలు కాని ఆ సంబరాల ప్రతిధ్వనులు కాని లేవు. అదేరోజు అర్ధరాత్రి భారతావనిలో త్రివర్ణ పతాకం ఎగురవేస్తూ జనావళి మహాత్మాగాంధీకి జేజేలు చెబుతూ, చేసుకుంటున్న సంబరాల్లోకూడా కాశ్మీర్‌లోయ పాలుపంచుకోలేదు. అటు పాకిస్తాన్‌లోనో ఇటు భారతదేశంలోనో చేరిపోయి, అయా దేశాల్లో అంతర్భాగం అవటానికి కాశ్మీర్ రాజ్యం లేదా సంస్థానం అంగీకరించలేదు.

మనం యే పేరుతో పిల్చినా- అక్కడి రాచరికపు వ్యవస్థ తటస్థంగా వుండి ఆలోచించటానికి వ్యవధి కోరింది. పాకిస్తాన్ ప్రతిపాదనకి అంగీకరించినట్టే అంగీకరించి- యుద్ధం మొదలెట్టింది. భారత దేశం సంస్థానాల విలీనోద్యమంలో భాగంగా అప్పటికే కాశ్మీర్ మహారాజాతో చర్చలు కొనసాగిస్తూనే- పాకిస్తాన్ దాడిని ఎదుర్కొన్నది. కాశ్మీర్ మహారాజా అక్టోబర్ *26, 1947*లో తాను "ఇండియాలో చేరిపోతానని" అంగీకరించే వేళకే *78,114* చదరపు కిలోమీటర్‌లు పాకిస్తాన్ "కబ్జా" లోకి వెళ్లిపోయింది. ఈ భారత్ పాక్‌ల పోరు "ఐక్యరాజ్యసమితి"కి ఎక్కింతర్వాత *1949* జనవరిలో "యుద్ధ విరమణరేఖ" ప్రాతిపదికగా అంతమయింది. అంతమయింది అనకూడదు. ఆగింది అనడమే చారిత్రక సత్యం. అటు తర్వాత *1965*లో యుద్ధం-*1966*లో తాష్కెంట్‌లో వీరలాల్ బహూదూర్‌శాస్త్రీజీ సాధించిన ఒప్పందం- దరిమిలా *1971*లో జరిగిన మరో యుద్ధం- *1972*లో యిప్పటి పాక్ ప్రధామంత్రి బేనజీర్ తండ్రి జుల్ఫికార్ ఆలీభుట్టోతో "సిమ్లా ఒప్పందం" జరిగాక శాంతించాయి. ఇవీ కఠోర చారిత్రక సత్యాలు! భారత్ పాకిస్తాన్‌ల మధ్య ఘోర యుద్ధాల మధ్య నలిగి పోతున్న సామాన్య కాశ్మీర్ ప్రజానీకానికి యీ యిక్కట్లతోపాటు యిటీవల సనాతన ముస్లింవాదుల ఒత్తిడి-వారి ఆగడాలవల్ల దైనందిన జీవనంలో అలవిమాలిన కష్టాలు ఎదురైనాయి.

ఆ మాటకొస్తే *1957* జనవరి *26* దాకా "ప్రత్యేక ప్రతిపత్తిని" యీ రాష్ట్రానికి కలిగిస్తూ రూపొందించబడ్డ రాజ్యాంగం అక్కడ లేనేలేదు- అంతే కాకుండా *1961*లో తనంతటతాను శ్రీ కరణ్‌సింగ్ రాజరికపు హోదా బిరుదు వదులుకొనే దాకా రాజరికపు మర్యాదలు కూడా కొనసాగాయి.

*1957* తరువాతనైనా కాశ్మీర్‌లోని సామాన్య ప్రజానీకం వారి సంస్కృతి మతం సంప్రదాయాలు, అలవాట్లు యిష్టానిష్టాలు పట్టించుకునే నాథుడు లేడు. ఎంతసేపు అధికారం కోసం రాజకీయాల కుమ్ములాటలు, షూటింగ్‌లకోసం సినిమా కంపెనీల దండయాత్రలు-యుద్ధ విరమణరేఖ వెంబడి ఘర్షణలు-యివి చాలక యిప్పుడు సనాతనవాదుల దారుణమారణ ఆగడాలు-వీటికితోడు పాకిస్తాన్ నుంచి దొంగప్రవేశం చేస్తున్నట్లుగా చెప్పబడుతున్న సాయుధ విద్రోహశక్తుల మారణహోమాలు యిదీ నేటి కాశ్మీర్ "భూతలస్వర్గ" దుస్థితి! బంగ్లాదేశం నుంచి ప్రజలు అక్రమంగా రాకుండా సరిహద్దు వెంబడే 'కంచె' వేయాలనుకున్న భారత ప్రభుత్వం కాశ్మీర్ సరిహద్దులలో-విద్రోహ సాయుధ మురాలు రాకుండా అడ్డుపడే ప్రయత్నాలు యింతకాలంగా ఏమి చేసిందో మనకి తెలియదు. అసలు చేసిందా? అని. చేస్తే మొన్నటి *14, 15* నాటి సంఘటనలకి జవాబుదారీ ఎవరిది?

చరిత్ర యావత్తు పరిగణనలోకి తీసుకుని కాశ్మీర్‌లోని నైసర్గిక, భౌగోళిక సాంస్కృతిక ప్రాతిపదికమీద యీ "విద్రోహకాండ"కు మూలమెక్కడ వుందో తెల్సుకోవలసిన బృహత్ ప్రయత్నం యిప్పుడు అవసరం. దీనికి గవర్నమెంటుకి తమ తమ 'పార్టీల' సంగతి ప్రక్కనపెట్టి అందరూ తోడ్పడి తీరాలి. మరో మార్గంలేదు! ఇది రాజకీయ పార్టీల దేశభక్తికి అగ్నిపరీక్ష లాంటిది! ●

64135

విడిప్రతి వెల రు. 4-00

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

సంపుటము 82 స్థాపితం 1908 బొంబాయి : 1914 మద్రాసు సంచిక 2

వ్యవస్థాపకులు దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు

(1938-1972 సంపాదకులు) శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక ప్రెస్, గాంధీనగరం, విజయవాడ-3, ఫోన్‌లు: 75667, 61247, 61248.

## వీక్లీ పోస్ట్

### శుక్రవారం

వారంలో ఎన్ని రోజులుంటే మనకేమి టికానీ శుక్రవారానికి మాత్రం ఓ ప్రత్యేకత ఉంది. ఆ రోజు నవ వధువులా అలంకరించు కొని క్రొత్త కొత్త అందాలు సంతరించుకొని మా ముందుకు వయ్యారంగా నడుచుకుంటూ వచ్చి మా ముంగిట్లో నిలుస్తుంది "ఆంధ్రస చిత్ర వారపత్రిక".

కొత్త పెళ్లికూతురు కోసం ఎదురుచూసే కొత్త పెళ్లికొడుకులా 'ఆంధ్రసచిత్ర వారపత్రిక' కోసం ఎదురు చూస్తాను ప్రతివారం.

-అనపర్తి రాంబాబు, తుని

### విందు

సామాజిక దృక్పథంతో "లేటెస్ట్"గా వెల్వడుతున్న ఈ తరం 'బెస్ట్' వీక్లీ 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక' అనుటలో అనుమానం అన్ నెససరీ! మేలిమి సాహిత్యాన్ని అందిం చడంలో "ఫస్ట్" స్థానాన్ని ఆక్రమించిన మీ (మా) పత్రిక సాహితీ ప్రియులందరికి ప్రతి వారం పసందైన "ఫీస్ట్"! లేజీ మైండ్ లను అలర్ట్ గావిస్తున్న "టిట్ ఫర్ టాట్" ప్రతి పాఠకుడు "మస్ట్"గా చదవదగ్గ "మోస్ట్", యూజ్‌ఫుల్ ఫీచర్- స్థూలంగా చెప్పాలంటే "వేస్ట్" అనే సమస్యే లేకుండా ప్రతి 'ప్రతి' లోని ప్రతి పేజీని "ఇంట్రస్ట్"గా రూపొం దిస్తున్న మీకు థాంక్స్ !!

-వి. శ్రీధరాచార్యజోషి, అయిజ (మం)

### దాదాగిరీ

18-8-89 పత్రికలో ఎడిటోరియల్ ఎంతో చక్కగా ఉంది. ప్రతీ అక్షరం ఒక అమూల్యం. పేట పేటలో 'దాదాగిరీ' జమాయిస్తూ ఛోటాలు ఎగుర వేస్తున్న జాతీయ జెండా మనది. ఇది అక్షరాలా ప్రతీ పేటలోనూ జరుగుతున్న సత్యం. రాను రాను జాతీయ పతాకం ఎగుర వేయడానికి కూడా బద్ధకాలు పెరిగిపోతున్నాయి అంటే అతిశయోక్తి కాదు.

—ఐ. సత్యనారాయణ (శ్రీకాకుళం)

(74 వ పేజీ చూడండి)

## చదవండి పత్రిక!

## ఈ వారం ప్రత్యేకం:-






ముఖచిత్రం:
ఉంగరంలోనే వుంది రహస్యం
అంటున్న రాధ
(శ్రీ బాలాజీ ఫిలిమ్స్ చిత్రం)

పై వారం:
'సాహిత్యహంతకోపాఖ్యానం'
(పూర్తి హాస్య నవలిక)

# "బోఫోర్సు" కాదు "కాశ్మీర్" చూడండి!




దేశంలో కొంత కాలం ఒక్కో వేలం వెర్రి ప్రారంభమవుతుంది! 'బోఫోర్సు తుపాకుల ప్రహసనం ప్రజల సహనాన్ని పరీక్షిస్తున్నది. సైన్యాల "నీతి" ప్రజల నీతి దిగజారిపోలేదు యింతవరకు దేశంలో యీ "ఫోర్సు" మీద, కాని పిడుగుకి బియ్యానికి ఒకటే మంత్రం అన్నట్లుగా రాజీవ్ గాంధీ-ఎన్.టి.ఆర్., వి.పి. సింగ్ లు యిదే ఆట ఆడుతున్నారు. "బోరు కొడుతోంది" అన్నాడో రాజకీయ పక్షీంద్రుడు కూడా. దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన రోజు ప్రజలకి సందేశం "యివ్వవయ్యా మహానుభావా?" అంటే ఒకరిమీద ఒకరు బురదజల్లుకున్నారు! రాష్ట్ర ముఖ్యమంత్రిగా రాష్ట్ర ప్రగతి రాష్ట్ర వాంఛలు- దేశ స్వాతంత్ర్య సంగ్రామంలో అసువులు బాసిన వీర ఆంధ్రులు వీరి సంగతి "గళమెత్తి" పాడవలసిన మన ముఖ్యమంత్రి ఎన్.టి.ఆర్. దేశస్థాయి ప్రధాన ప్రతిపక్ష నాయకుడు మాట్లాడుతున్నట్లు సైనికుల గురించి బోలెడు బెంగపెట్టేసుకోడం ఎందుకు?- పోనీ యుద్ధమా? పోరాటమా? ఏం జరుగుతున్నది? శ్రీలంకలో శాంతి సేనలు ఎల్.టి.టి.ఇ. మీద ఈ బోఫోర్సు గన్స్ ప్రేలిస్తే అవి తుస్సుమన్నాయా? సందర్భ శుద్ధితో నాలుగు మంచి మాటలు అనకుండా- సైనికులప్రాణమాన రక్షణకంకణం ధరించడం వల్ల ఎన్.టి.ఆర్.కి అదనంగా వొరిగేది ఏమీ లేదు! ఎర్రకోట మీద నుంచి "అందరూ, దేశ ద్రోహులు" అంటూ ప్రధాని పదవిలో ఉన్న శ్రీ రాజీవ్ గాంధీ నోరు పారేసుకున్నట్లే వుంది యిది!

పోనీ హైద్రాబాద్ కేంద్రం నుంచి ఆ ముఖ్యమంత్రి సందేశం ఆ రాష్ట్ర వాసులు చూస్తారు వింటారు. ఇదంతా తీరికగా కూర్చొని సైన్యాలు వింటారా? అని అనుకొని, టి.వి. వారు ఆ వేరాలు వదిలేసినా పోయేది! (అఫ్కోర్సు అనక వాళ్ళ ఉద్యోగాలేమైపోయేవో) చీటికిమాటికే బజారు కెక్కుతున్నారు పెద్దలు- నలభై యేండ్ల కాలంలో మును పెన్నడూ లేనంతగా "కక్షలు" రాజీవ్ గాంధీ వర్గానికి ఫ్రంటు వర్గానికి పెరిగిపోతున్నాయి. ఇది దేశానికి క్షేమకరం కాదు. తొలగించిన వేరాలు సహా- ముఖ్యమంత్రి సందేశం అంతా అన్ని పత్రికలు వేశాయి! యింకా వర్రీ ఏమిటి? అక్షరాలు రాని వారికి- పత్రికలు చదవలేనివారికి- రేపు చైతన్యరథం వుందిగా. అది ఎక్కి- బోఫోర్సు తుపాకులు నాటుతుపాకులు అంటూ చెప్పగల ఛాన్సు ఎన్.టి.ఆర్.కి 'సదా' వున్నదిగదా!- వి.పి. సింగ్ గారు ఎన్.టి.ఆర్. గారు. శ్రీ రాజీవ్ జీ వగైరా నాయకులందరూ ఒక్కసారి దేశాగ్ర భాగాన భూతలస్వర్గంగా ఒకనాడు వాసికెక్కిన కాశ్మీరం యిప్పుడు భూతల నరకంగా మారిపోయిన వైనం చూడాలి. ప్రజలలో చేతన అవసరం అక్కడ వున్నది. ఆగస్టు 15న ఎర్రకోట మీద నుంచి ప్రధానమంత్రి- రాష్ట్ర రాజధానులనుంచి ముఖ్యమంత్రులు- గొంతు చించుకుని దేశానికి తాము చేసిన సేవలు- యితరులు చేసిన ద్రోహాలు యేకరువు పెడుతున్నప్పుడు అక్కడ కొన్ని యిండ్ల మీద పాకిస్తానీ జెండాలు రెపరెపలాడుతూ ఎగిరాయి. కొన్ని వర్గాలు "బ్లాక్ డే"గా యిండిపెండెన్సు డేని తీసిపారేశారు! అక్కడ దేశ విభజన సమయంలో రగిలిన చిచ్చు యివాళ కూడా ఎగసనదోయబడుతున్నది.



**ఏరంతా యీది వొడ్డున మునిగినట్లే యిపోతుందనే భయంతో గవర్నమెంటు రాజ్యాంగ సవరణ బిల్లులని వోటింగు దశకి తేకుండాసేపార్లమెంటును నిరవధికంగా వాయిదా వేయడంతో- ప్రతిపక్షాలకి ఒక వంక సంతోషం మరొకవైపు దుఃఖం కూడా వచ్చి వుండాలి!**

అయితే మొట్టమొదటిసారి రాజ్యసభలో యిరుపక్షాల సభ్యులు కూడా "కాశ్మీర్"ను "ఫోకస్" చేసి- యింకా ఈ దేశంలో దేశమంటే ఆందోళన బ్రతికే అవకాశాలున్నాయి అనిపించారు.

అక్కడ కొన్ని "దుష్టశక్తులు" పని చేస్తున్నాయి అని కాంగ్రెసు పార్టీ ధరమపాల్ గొప్పగా చెప్పనక్కరలేదు. ఆ సంగతి అందరికీ తెల్సు- ఆ వేర్పాటు వాదాన్ని ఎట్లా అణచి వేస్తారు? మీరింత కాలం తీసుకున్న చర్యలేమిటి?- పంజాబ్ లోను, కాశ్మీర్ లోను కూడా పాకిస్తాన్ లో శిక్షణ పొందిన విద్రోహులు వచ్చి చేరుతూ వుంటే- మనం మన సైన్యం మన వేగులవారు- కాశ్మీర్ లో వున్న నేషనల్ కాన్ఫరెన్సు, కాంగ్రెసుల మిశ్రమ ప్రభుత్వం ఏం చేస్తున్నట్లు?-

రేపు తమ హయాం వస్తే గిస్తే కూడా కాశ్మీర్ కు ప్రత్యేక రాజ్యాంగ ప్రతిపత్తి నిస్తామంటూ చెప్పిన వి.పి. సింగ్ గారేం మాట్లాడడేం? దేశ సరిహద్దుల వెంబడి "అంచుల"కు నిప్పంటుకున్నట్లు అరాజకం రాజుతూ వుంటే ఎందుకొచ్చిన ఊకదంపుడు దేశభక్తి ఉపన్యాసాలు?- కాశ్మీర్ ని పంజాబ్ ని పరిష్కరించడానికి రాజకీయ పక్షాలు తమ తమ ప్రణాళికల్ని తయారుచేసి పెట్టవలసిన తరుణమిది! "జెండా వూంఛా రహే హమారా!" అన్న మాటలు ఆ రెండు రాష్ట్రాలలో వ్రేళ్ళూనుకుపోయిన వేర్పాటు వర్గాలకు నమూనా!

భయానా చెప్పగల నైతికస్థాయి గుండె నిబ్బరం మన నాయకులకి కావాలి! లేకపోతే వేరిశాస్త్రిగారేంచేస్తాడు? ఈ రెండు రాష్ట్రాలలో ఎన్నికలు జరగవుగాక జరుగవు.

★ ★ ★



## దేశభక్తి లేని "చాయ్‌వాలా"?!

**తె**ల్లారితే "యిండిపెండెన్సు డే" అనగా మద్రాసు నుంచి హావురాకి విజయవాడ మీదుగా వెళ్తూ వున్న కోరమండల్ ఎక్స్‌ప్రెస్సు రైలు పెట్టెలో మంటలు లేచేయి. రెండు భోగీలు దగ్ధమైనాయి. ప్రయాణీకులు కాళ్లూ చేతులు విరగ్గొట్టుకున్నారు. వారి విలువైన సామాన్లు చిందరవందరై కొన్ని కాలిపోయాయి. మరికొన్ని పోయాయి! రైలుబండీలో విద్రోహులు, విదేశీ కుట్రదారులు, ప్రేలుడు పదార్థాలు, తీవ్రవాదుల ఏజెంట్‌లూ ఎవ్వరూ లేరుట!! ఓ "టీ కుర్రాడు" భోగీలో ప్రయాణం చేస్తున్న ప్రయాణీకుల "ఖుషీ" కోసం కిరసనాయిలు స్టవ్ ముట్టించి యింత ప్రమాదానికికారణమయ్యాడుట. పాపం అధికారులు మాత్రం యింకా ప్రేలుడు "నిపుణు లు" విదేశీ మార్కు బాంబులు పెట్టి వుండగా అవి ప్రేలి ఈ ప్రమాదం జరిగిందేమోనన్న అనుమానంతో అధికారికంగా దర్యాప్తు చేస్తుండగా- అందరికీ తెలిసిన- పోలీసులకి టి.సి.లకి- రేల్వే ఉద్యోగులకీఅందరికి తెలిసిన "చాయ్ బోయ్" కోసం "గాలింపు" జరుగుతున్నదట (యిది 17న రాస్తున్నప్పటి స్థితియిది)- ఇలాంటి ఘోరాలు జరగటం మన దేశంలో కొత్త కాదు. విమానాల మీదనైతే- ప్రతీ ప్రయాణం ఒక గండమే- కాని రైల్లో అయితే "సేఫ్" అనుకొనే వారికి దారిదోపిడీలు, దొంగతనాలు అగ్నిప్రమాదాలు, పట్టాలు తప్పడాలు వంతెనలు "బుడుంగు"' మనడాలు లాంటి గండాలు కొల్లలు! కోరమండల్ రెలు బండీ సూపర్‌ఫాస్ట్ ట్రయినుకాబోలు దానికిసర్-ఛార్జీవసూలుచేస్తారు. దానిలో రైల్వే వారి టీ వాలాలు టిఫిన్ వాలాలు- "సమోసాలు" చాయ్‌గరమ్‌లు "కాఫీకోల్డులు" పట్టుకు తిరుగుతారు. ఓ పెట్టెలో నుంచి మరో పెట్టెలోకి దారి కూడా వుంటుంది అని విన్నాము- మరి యీ చాయ్‌వాలా కౌన్‌హై? ఈ కౌన్ కిస్కాగాడ్ని గాడీకే అందర్ ఆనే దియా కౌన్‌హై?- వీళ్లని ముందు పట్టుకున్నారా? వంద రూపాయిలు "తెల్ల" ధనం అందినా ఒక్క అర్ధరూపాయి- "వక్కపొడి" పొట్లానికి తప్ప మరెందుకూ చెల్లని అర్ధరూపాయి "నల్ల" ధనంగా అందితే చాలు. జన్మతరించిందిఅనుకునేవింతమనస్తత్వం వల్లనే ఈ అజాగ్రత్తలు, అవి నీతులు, ఆకస్మిక ప్రమాదాలు జరుగుతాయి. సూపర్‌ఫాస్ట్ రైలు బండ్లలో ప్రయాణీకుల "సేవ" (యింత మాట వాడవచ్చా?) చేయటానికి బోలెడు జీతాలు అందుకుంటున్న "కర్మ ఛారులు" వుంటారు కాని ప్రయాణీకుల "కర్మ" మరో రకంగా వుంటుంది! హైదరాబాద్, గొల్కొండ, క్రిష్ణా, కోణార్క్ లాంటి దిల్‌ఖుషీ రైలు బండ్లలో పగటి పూటైతే ఓ బిచ్చగాడు (అనోచ్చా? ఈ మాట) మన కాళ్ళు తీసి ప్రక్కన పెట్టి సామాన్లు త్రోసి అవతలకి నెట్టి "భోగీ," అంతా (అయ్యో పాపం!) నున్నగా వూడ్చేస్తాడు. ఆనక చెయ్యి జాపుతాడు! "ఇష్టమైతే ఓ అర్ధో, రూపాయో, యివ్వండి లేదా కీప్ క్వయిట్" అని ప్రక్క వాణ్ని హీనపరిచి మరీ మన లాంటి పిరికి పందలం వాడికి డబ్బులు యిస్తాం- యీ విధంగా వసూలు చేసే వీడు ఎవడు? రాత్రిపూట స్లీపర్ కోచ్‌లో ఫస్టుక్లాసు కారిడార్‌లో మూటముల్లె పెట్టుకుని ప్రయాణం చేస్తున్నవారి మీద రైల్వే అంటెండెంట్‌కి పోలీసులకి, టి.సి.లకి భూతదయ మాత్రమేనా?వుంటుంది?- కొత్త జోళ్ళు తొడుక్కుని రైల్లో పై బెర్తు మీద కెక్కుతూ క్రింద వాటిని, వదిలిన "ఫూల్" మర్నాడు ప్రొద్దున్నే ఉత్త కాళ్ళతో యింటికి వెళ్తాడే? యీ టిక్కెట్టు కొన్న పెద్దమనిషిని ఫూల్ చేయడానికి "గజదొంగలు" రారు- అదుగో భోగీలో నిప్పులకు కారణమైన దిక్కుమాలిన కుర్రాళ్లలాంటి వారే వస్తారు. వాళ్లని రైలు యజమానులు అయిన రైల్వే ఉద్యోగులు ఎందుకు రానిస్తారు?- యీ ప్రశ్నకి జవాబు అందరికి తెల్సు- తెలిసినా నిజం చెపితే గుండె వెయ్యి ముక్కలై ఛస్తారన్న- భారత మాత శాపం వుంది కనుక- "ప్లీజ్ కీప్ క్వయిట్' అంటారంతా!

17-8-89.



మండి పోతోంది కడుపు. తరతరాలుగా వచ్చిన రోగమే అది. అలవాటే ఆనందరావుకు. బీద కుటుంబాల్లో ఆకలి గాకపోతే ఆంబోతు తరుము కొస్తుందా మరి!అయినా కొన్నాళ్ళ నుంచీ తీవ్రంగా ఆలోచిస్తున్నాడు- వాళ్ళ వంశస్థులిలా ఆకలి పాలవడానికి చేసిన పాపా లేమిటో, వాటికి ప్రాయశ్చిత్త మెల్లా చేయడమో – వగైరా... వగైరా...

ఆశలున్నా అందుబాటులో లేవు గనక, గొప్ప చదువులేమీ చదవలేకపోయాడతను. కానీ బ్రహ్మాండమైన పట్టుదలా, పైకి రావాలనే వుబలాటంతో తపించి పోతున్నాడీ మధ్య. తిమ్మిని బ్రహ్మి చేసి తీరాలి. "మనసుంటే మహేశ్వరుడైనా లొంగుతాడ"ని వాళ్ళమ్మ ఎప్పుడూ అంటుంటే వింటూడేవాడు. తనలో మగ్గుతున్న ఆదర్శాలెన్నెన్నో! ఈ మాయదారి ప్రపంచాన్ని మంచి దోవకు తీసుకు రావాలని వువిళ్ళూరుతుంటాడు. నల్ల మార్కెట్లూ, నల్ల మందు నిషా- దోపిడీలూ, దొంగతనాలూ- హత్యలూ, అత్యాచారాలూ- వొకటొకటే సమాజాన్ని దిగమింగుతూ వెన్నంటుకొచ్చినప్పుడల్లా తనే గనక ముఖ్యమంత్రవుతే, యీ భ్రష్టుల్నందర్నీ గుంపులు గుంపులుగా నడిరోడ్డున వురి తీయించేవాడే కదా!

అయితే....

దరిద్రుడి కోపం దమ్మిడీ విలువ చేయదా యిరి! కనక ముందు తను కష్టపడి డబ్బు సంపాదించాలి.

# ఆసక్తి

## వళ్ళారి విజయరాఘవరావు



సొంత ఆకలినంతం చేస్తేనే ఇతరుల ఇక్కట్లను తర్కించుకోవచ్చు. దేనికైనా చేతిలో బలం కావాలి. బలముంటే బలగం తనెంతట తానే చేరుకుంటుంది, బెల్లం కోసం చీమల్లాగా!

విచిత్రమైన వుపాయం తట్టిం దానందరావుకు! ఈమధ్య గుంటూరులో ఎక్కడ చూసినా "మాజిక్ షో" లే! "ఇంద్రజాల మహేంద్రజాలం"తో జనం మీద జాలం వేసి జేబులు నింపుకుంటున్నారు తన పాత మిత్రులు కొందరు. మాంత్రికులకు మంచి మంచి బిరుదులు కూడా లభిస్తున్నా యీ మధ్య. అందుకోసం అట్టే డిప్లొమాలూ, డిగ్రీలూ కూడా అవసరం లేదేమో.... ఎందుకో మహామోజు పడుతున్నాడల్లా చేసి చూడాలని! అవస్థపడి నేర్చుకుంటే నాలుగు రాళ్ళు సంపాయించడానికది మంత్ర దండంలా పని చెయ్యొచ్చు!

ప్రస్తుతానికదే రాజమార్గంలా కనిపించిందతనికి. ఇంకేం.... కాళ్ళకు బలపాలు కట్టుకుని కాని వూళ్ళన్నీ తిరుగుతూ, తనకు నచ్చిన గురువును సాధించాడొకనాడు! 'అంటే.... వరసాగ్గా వోనాల్గేళ్ళు వుస్తాద్ మహ్మమ్మద్ రషీద్ ఖాన్‌సాబ్ దగ్గర శిష్యత్వం చేశాడానందరావ్! కులమత భేదాల్లేకుండా గురువు గారు పెట్టింది తిని చెప్పింది చేసేవాడు. గారడీ గమ్మత్తులు చేస్తూ వూరురూ తిరుగుతూ, దార్నబోయే పిల్లల్నూ పెద్దల్నూ మంత్ర ముగ్ధుల్ని చేస్తూ, కష్టించినా, కాలం కమ్మగానే గడిచి పోతోందిప్పుడు. ఏమైనా సరే– తన సొంత తడాఖా జనానికి చూపించే రోజులు రాకపోతాయా మరి! ఘన మనోబలంతో, ధైర్యంతో, ఘుడియలూ, విఘుడియలూ మింగేస్తున్నా డానందరావు. తన ధేయాన్ని సాధించి తీరాలిక....

ఆ రోజూ వచ్చింది.

వుస్తాదుగారన్నారు "అబ్బాయ్! సెబాష్! నువ్వూ నా లాంటి శిష్యుల్ని దగ్గరకు తీసుకుని నేర్పి, నాపేరు నిలపాలోయ్! ఇన్నాళ్ళు నేర్పింది చాలు. ఇక నీ దారి నువ్వు చూసుకో. అప్పుడప్పుడు జ్ఞాపకముంటే గురువుగారికి, మంత్ర శుద్ధి కోసం నాల్గు రూకలు మణియార్డర్ జేస్తుండేం! అంటే. ఖుదాహాఫీజ్!"

ఆనందరావుకు దీపావళి పండుగలా వుందాక్షణం! తన కాళ్ళ మీద తాను నిలవగలిగాడు... గవ్వున జంక్షన్‌లో నుంచిని గారడీ 'షో' చేస్తే, గుప్పున వర్షంలా కురుస్తున్నయ్– రూపాయలూ, అణాలూ!

"కోష్మే ఫతే" అని వూర్కే అన్నారా మరి!!

★ ★ ★ ★ ★

బ్రహ్మాండమైన ఇల్లు. అసలా పేటలో ఇళ్ళన్నీ బ్రహ్మాండంగానే వున్నాయి మరి శ్రీమంతుల ఇలాకా గనక. రాజకీయ వేత్తలూ, కంట్రాక్టర్లూ ఎగ్జిక్యూటివ్‌లూ, సంఘ సేవకులూ, మత గురువులూ, మంత్రుల స్నేహితులూ, హోదా వారీగా వీధులు పంచుకుని ఇళ్ళు కట్టుకున్న 'శాంతిపుర' మది! రోజూ రోడ్డుకో హత్య జరిగినా, వూళ్ళో పదింట వొకతైనా యువతి బలాత్కారం పాలైనా, మతం పేరుతో మందిర్‌లోనో, మసీదులోనో మనుషులు తలలు పగలగొట్టుకుంటున్నా, 'శాంతిపురం'లో శాంతి భద్రతలు మాత్రం బాగానే వున్నయంటూ పేపరు వాళ్ళు రాస్తూనే వున్నారు మరి! మంత్రుల మంచి తనముంటే మరేం కావాలి కనక!

తీరా 'శాంతిపురం' వాసి – వొకడో, ఆరో– నేరస్థుడని ఋజువైతే, మర్నాడు 'ఫొటో'తో సహా క్షమాపణలు కూడా అచ్చేస్తారు" తప్పు వారిది కాదనీ, తప్పదాగిన మల్లయ్యదో, పుల్లయ్యదో ననీ"... హిందీలో వొక సామెత ప్రసిద్ధిలేండి.

"అమీర్ కీ బీబీ సబ్ కీ భాభీ– గరీబ్‌కీ బీబీ సబ్‌కీ జోరూ!" అంటే "ధనవంతుల ధర్మ పత్నులందరికీ వదినగార్లే! అయితే బీద వాళ్ళ భార్యలూళ్ళో వాళ్ళందరికీ గూడా పెళ్ళాలే!" ఇదీ లోకం పోకడ!

ఇంతకూ చెప్పొచ్చే దేమిటంటే 'శాంతిపురం'లో ఆ బ్రహ్మండమైన యిల్లు పేరెన్నికైన కంట్రాక్టర్ పుణ్యమూర్తి గారిది. ఇపుడు వాళ్ళబ్బాయి వివాహ మహోత్సవం ధూమ్' 'ధామ్'గా జరగబోతోంది.

అసలు గమ్మత్తు మరొకటి!

ఈ పేటలో ధనవంతుల కుటుంబాల్లో పెళ్ళిళ్ళూ, పేరంటాలూ, మరే కథాకమామిషీ జరిగినా "ఆనందరావ్ మాజిక్‌షో" వుండి తీరాల్సిందే ఈ మధ్య! రానురాను అదో ప్రిస్టేజీ వ్యాపారంలా తయారయింది! ఆనందరావదృష్టం చూసుకోండెలా తిరిగిందో! అతని కన్ని వేళ్ళూ నేతిలోనే మరి!

పుణ్యమూర్తి గారి పెద్దబ్బాయి పెళ్ళయితే మరి, మహేంద్ర జాలికుడు ఆనందరావ్ గారి "ఆల్ నైట్ షో" లేకుండా ఆ ఘనకార్య మెలా గట్టెక్కుతుంది చెప్పండి! పైగా పెళ్ళికూతురూ, పెళ్ళికొడుకూ– ఇద్దరూ ఆనందరావ్ గారి ఫాన్‌లే యిప్పుడు!వాళ్ళాయన మాజిక్ షో లంటే చెవు కోసుకుంటారట!....

★ ★ ★ ★ ★

పెళ్ళి శోభనమై, మర్నాడు యువదంపతులు 'హనీమూన్'కు వెళ్ళాలనుకుంటున్నారు. ఆ రోజు 'ఆనందరావ్ నైట్' కోసం ఏర్పాట్లన్నీ జరిగాయి. పొరుగూళ్ళో వరదల దృశ్యాలను విమానంలో దర్శించడానికి పోయిన ముఖ్యమంత్రిగారూ, గవర్నర్‌గారూ మినహాయించుకుని 'శాంతిపురం' శివార్లలో చెప్పుకోదగ్గ గొప్ప వాళ్ళంతా, పెళ్ళి వింత లయిన తర్వాత 'ఆనందరావ్ నైట్'కు హాజరయ్యారు. 'జాజ్' 'పాప్', 'రాక్', 'బీట్'– అన్నీ సరిగీతాలతో సహా 'ప్రేక్ష'కులను మంత్ర ముగ్ధులను చేస్తూ మొదలైంది మహేంద్రజాలం. ప్రేక్షకుల్లోంచి పెద్ద పెద్ద హేమా హేమీలను పేరెత్తి పిలిచి 'ట్రిక్కు'లను, పుంఖాను పుంఖాలుగా చకితులయ్యేట్టు స్వయం వాళ్ళ చేతుల్తోనే చేయిస్తున్నాడానంద రావ్! మంత్రి గారి మనవడి చేతిలో వంద రూపాయల నోటు బెట్టి "ఛూ మాయమంకాళీ" అనే సరికి దిడీల్మన మాయమైంది! మళ్ళీ "ఓపన్ ససేమ్" అనే సరికి తాసిల్దారుగారి కోడలు తాయారమ్మ పర్సు

లోంచి బయట పడిందా వంద రూపాయల నోటు!

కాఫీ హోటల్ గణపతి కళ్ళకు తువ్వాలడ్డం గట్టి, నోట్లోంచి వందలాదిగా ఇడ్లీలూ, దోశలూ, బోండాలూ, మైసూర్ పాకులూ కుంభవర్షం కురిపించాడు!

జనంలో హాహా కారాలూ?– గగ్గోలు!ఆనందబాష్పాలతో జై జై లూ! – ఎల్లాగైనా వర్ణించండి! – జనం మురిసి పోతున్నారు! డమరూ పుచ్చుకుని నాలుగు దరువులు గుండెలదిరేలా 'డమ' 'డమ' లాడిస్తూ ఆనందరావు తృటిలో గంభీర వదనంతో గొంతెత్తి అరిచాడు "ఇప్పుడు చూడండి నా తఢాఖా! ఆకలి కడుపు లల్లల్లారి పోతుంటే, యేమేం తింటాయో కళ్ళారా మీరే చూడండి పుణ్యాత్ము లారా!" అంటూ, ముందు బెట్టిన వొక వంద ఖాళీ గాజు గ్లాసుల్ని 'వుఫ్మ్' లా వూదేశాడు!

అంతా చకితులై చూస్తున్నారు!

పుణ్యమూర్తి గారికి మాత్రం నవ్వొచ్చిందెందుకో! అనుమానం తీర్చుకోదల్చుకున్నాడు! తన కొడుకు పెళ్ళిలో తనేగా యీ 'షో' ఏర్పాటు చేసింది : ఆ "ఆర్గనైజర్" హోదాతో ఏదో వొకటి అడక్కపోతే, జనానికెలా తెలుస్తుంది తన పెద్దరికం మరి!

"ఏమోయ్ ఆనందరావ్! వంద గ్లాసులు మింగేశావ్! ఇంకా అకలంటా వేంటోయ్?"

అంతా వెకిలిగా నవ్వారు!!

ఆకలంటే యీ రాక్షసులకేం తెలుసు?? తన పాత బీద తనంలో తన్ను ఆకలి పెట్టిన పాట్లన్నీ అద్దంలో మెరుస్తున్నట్టు తన కళ్ళ ముందుకొచ్చాయెందుకో!?

వొళ్ళు మండు కొచ్చింది....

ఈ సారి ఆకలితో కాదు.

అమితాగ్రహంతో!

తన తఢాఖా నిజంగా చూపించాలనుకున్నాడానందరావ్!

"అయ్యా! ఆకలితో అలమటించి పోయే కోట్లాది దేశ వాసులకు గాజో, బూజో, తిండి సమయానికి కళ్ళబడితే కబళించుకు మింగేయాలని పిస్తుంది... అయితే మరొక మనవి. తమ ఆజ్ఞ అయితే – ఆకలి లేకుండానే కొందరు ప్రజ్ఞులు యేమేం మింగేస్తుంటారో– అది కూడా చూపించమంటారా?"

'షో' కైపులో ఆనందరావు మాటల్లోని అంతరార్థమెవ్వరికీ తెలిసినట్టు లేదు!

అంతా వొక్కసారిగా అరిచారు.

"ఆ. చూపించండి. చూద్దాం."

"అయితే, అయ్యా! సర్వశ్రీ పుల్లారేకుల పుణ్యమూర్తి గారూ, అయ్యా ధువ్వూరి దున్నేశ్వర్రావు గారూ, అయ్యా, మతాచారి మహేశ్వరానందం గారూ– తమ ముగ్గురూ దయచేసి నా దగ్గరగా జరగండి స్వామీ. .."

పుణ్యమూర్తి గారు పేరెన్నికైన ,వర్ణ మెంటు కంట్రాక్టరని మీకు తెలుసుకదా! దున్నేశ్వర్రావ్ గారు దువ్వూరి నుంచి ఎన్నికైన యం. యల్. ఏ. మతాచారి గారు మహామహా భగవత్సాన్నిధ్యాన్ని సాధించిన మతగురువులు.

ఇలాంటి హేమా హేమీలను 'వాలంటీర్ల'గా పిలవ డంతో, ప్రేక్షకుల ఆదుర్దా పెరిగి పెరిగి గడియారంలా కొట్టుకుంటున్నాయి వాళ్ళ గుండెలు! మహదానంద కరమైన 'ఆనందరావ్ నైట్'లో ఏ అద్భుత మెలా ఘటిస్తుందో ఇప్పుడు! ముగ్గురు వి. ఐ. పి. లూ ముందుకు సాగుతుంటే క్లైమాక్స్ జనం ఉక్కిరి బిక్కిరాడకుండా చూస్తున్నారు.

"జిగ్.... జిగ్... జిగ్... జిగ్... జిందాబాద్.... వుస్తాద్‌కీ జయ్‌హో! 'క్షూ' మాయమంకాళీ.... 'భమ్' 'భమ్' 'భమ్' 'భమ్' 'భమ్ భోలే....", అంటూ మేమిటో మంత్రోచ్చారణ చేస్తున్నాడానందరావ్!

ప్రేక్షకులు హటాత్తుగా హడలెత్తి పోయారా ముందు జరిగిన దృశ్యం చూస్తూ!!

వి. ఐ. పి. లు కక్కడం మొదలెట్టారు! పెద్దలనే పెద్ద మనుషులు జీవితాంతం తీరని ఆకలి తీర్చుకోడానికి జనం నెత్తిన చేతులు చాచి దొంగతనంగా మింగిన సామాగ్రంతా ఇన్నాళ్ళూ ఎలా దాచుకున్నారో....

మొన్న మొన్న కూలిపోయిన బెజవాడ బ్రిడ్జి సిమెంటంతా పుణ్యమూర్తి గారి కడుపులోంచి– జిగటలుగా ధారపోసుకుంది!

వోట్ల కోసం తను గొంతు కోసిన కోట్ల సుబ్బయ్య కళ్ళూ, కాళ్ళూ, చెవులూ, చేతులూ, దున్నేశ్వర్రావ్ గారి గొంతులోంచి దూసుకొస్తున్నాయ్!!

మతకలహాలు రేకెత్తించడానికి తనూ, తన శిష్యులూ కూడ బెట్టిన కత్తులూ, కటారులూ, చాకులూ, బాకులూ, మతాచారి గారి మహాగరళం లోంచి కుంభ వృష్టి కురిశాయి!!!

మిగతా కథ మళ్ళీ రేపటి పేపర్లో తప్పకుండా చదవండి.

ఆశ్చర్యం కలగవచ్చు. అసహ్యం కలగవచ్చు. ఇలాంటి దుశ్చర్య లింకా తగ్గడమే లేదని మీకడుపులు మండుతాయి.

కానీ!!

కాలం గడుస్తూనే వుంటుంది.

'శాంతి పురం'లో శాంతి భద్రతల కేమీ లోటుండదు!

మంచి వాళ్ళకో మంచి పని చేయాలనీ, చెడ్డవాళ్ళకీ లోకాన్నే మింగేయాలనో ఆకలి!! – యీ 'ఆకలి' తీరేదికాదు!

ఎటూ "నా ఆకలి తీరేదెలా?" నంటారా? మరో కథ ఇలాంటిదే రాస్తాను.

ఎదురు చూడండి!!



# ప్రశ్నావళి

—కె. రామలక్ష్మి

న్యాయపతి రమేష్‌బాబు, హైదరాబాదు.

● నేడు దేశం భ్రష్టుపట్టి పోవడానికి కారణం స్త్రీలే కాదంటారా మేడమ్?

★ ఎలా అంటాను? మీరు వాళ్ళని మనుషులనుకుంటూంటే కద!!

● మగవాడు యింటి పనులలో సాయంచేసినంత మాత్రాన చిన్నతనం ఎందుకు?

★ ఎవరికి?!

● మగవాళ్ళంటే ఎందుకండీ మీకింత కక్ష?

★ కక్షా? లేదే కావలసినంత జాలివుంది.... పాపం వేజేతులా జీవితాలని నరకం చేసుకుంటూంటారని.

● వాగ్దానాలు చేస్తూ వాటిని నిలపెట్టుకోలేని వారిని— ఏమని పిలవాలి?

★ రాజకీయవేత్తలనండి! ఏదో సభ పెట్టి ఏ వాగ్దానబ్రహ్మ అనో వాగ్దాన సామ్రాట్ అనో బిరుదిచ్చి— ఆనందించండి.

● భార్యాభర్తలన్నాక ఒకరినొకరు బాగా అర్థం చేసుకుని హాయిగా కాపురాలు చెయ్యాలి. పంతాలకు పట్టింపులకు పోతే ఎలాగండీ?

★ నిజమే— కాని అలా అర్థం చేసుకొనే ప్రయత్నం సర్దుకుపోయే ప్రయత్నం ఒక్క భార్యలే ఎందుకు చేయాలా అన్నదే— ప్రశ్న.

ముద్రి భాస్కర్, మెట్‌పల్లి.

● ఫెమినిస్టులపై మీ అమూల్యమైన అభిప్రాయం?

★ మీరామాటకిచ్చే అర్థాన్నిపట్టి వుంటుందిసార్. చాలా మంది ఫెమినిస్టు అనగానే— బరితెగించిన ఆడదని అర్థం చెప్పేసుకుంటూ వుంటారు.

● జీవిత భాగస్వామిగా కాక ఒక అభిమానిగా ఆరుద్రగారిపై మీ అభిప్రాయం?

★ నాకు చాలా యిష్టం. ఇంకేం కావాలి?

● స్త్రీకి నిజమైన స్వాతంత్ర్యం యిప్పుడు లేదా? ఇంకెలా వస్తుంది?

★ తన ఉనికికి, తన శక్తికి, తన వ్యక్తిత్వానికి గౌరవం గుర్తింపు యిచ్చుకోని ఆడదానికి— ఇప్పుడూ ఎప్పుడూ రాదు స్వతంత్రం.

జి. వి. రామారావు, హైదరాబాదు

● తమ కష్టాలకి కారకు లెవరని వెతికేవాళ్ళ నేమనాలి!

★ అజ్ఞానులు సాదాసీదా సంస్కారంలేని వాళ్ళు— తమ కష్టాలన్నీ— ఇతరులవల్లనే వచ్చాయనుకుంటారు. కాస్త జ్ఞానమున్న వాళ్ళు— వాటికి తామే కారణం అనుకుంటారు. కాని నిజమైన జ్ఞానులు— ఎవరికీ కారణాలు అంటకట్టరు.

ఎస్. మహమ్మద్ రఫీ, కాశీబుగ్గ

● నేటి రచయితలు సాంఘిక దురన్యాయాలను ప్రతిఘటించే కవితలు కథలు గేయాలు నాటికలు అందిస్తున్నారంటారా?

★ అది పాఠకులైన మీరు కదా చెప్పవలసినది?!

● స్త్రీకి స్త్రీయే శత్రువట. నిజమేనా కె.రాగారూ.

★ నాకు తెలియదు. ఇది కూడా ఒక మిత్.

● వరకట్నం తీసుకోకుండా పెళ్ళి చేసుకొంటా. కాని ఓ షరతు. నా పెళ్ళికి మీరు రావాలి.

★ సారీ ఏ రకం షరతుల పెళ్ళిళ్ళూ— నాకిష్టం వుండదు. కట్నం తీసుకోక పోవడమే గొప్ప అనుకుంటే ఎలా? అసలా ఆలోచన రావడమే సంస్కారం లేకపోవడం అని— నా నమ్మకం.





పాఠశాల విద్యాశాఖాధికారుల గారిచే ఈ పత్రిక అన్ని విద్యాలయములు చందా చెల్లించుటకు ఆమోదించబడినది.

ప్రాతినిధ్యం లేనిచోట్ల ఏజంట్లు కావలెను.

విడిప్రతి రూ.3.00
సం॥ చందా రూ.35.00

వివరాలకు: తెలుగువిద్యార్థి
పోస్టు బాక్సు నెం.1
మచిలీపట్నం 521001

సీరియల్

# పంచశూలమ్

## విశ్వప్రసాద్

80

(గత సంచిక తరువాయి)

**ఇంతవరకూ సాగిన కథ- 20:** పంచశూలమ్ పంపిన యువకుడు ఇన్‌స్పెక్టర్ 'షా'గా చెలామణి అవుతూ జోషీ కేసు దర్యాప్తు చేస్తూంటాడు. గురూజీ కూతురు మీనాక్షి అంధురాలై మరణించగా జయరాజ్ కొడుకు మోహన్ హత్యకు గురై మరణిస్తాడు. ఎం. ఎల్. ఏ. దీపాదేవిని ఊర్వశి కాల్చి చంపుతుంది. జయరాజ్ భార్య పరిమళను మదన్ కాల్చి చంపి ఆమె శవాన్ని యింటి ముందు వ్రేలాడదీస్తాడు. ఊర్వశి తల్లి, చెల్లెలు ఉరిపోసుకుని చనిపోతారు. దీపాదేవిని చంపిందన్న ఆరోపణపై ఊర్వశిని, అబ్దుల్లా అరెస్టు చేసి మానభంగం చేయబోతాడు. పంచశూలమ్ అడ్డుపడి బెయిల్ మీద ఊర్వశిని విడిపించుకుని తీసుకు వెళ్తాడు. కన్నతల్లి విశాలాక్షిని క్రూరాతిక్రూరంగా చంపుతాడు సుభాష్. జయరాజ్, గురూజీలు పంచశూలమ్‌ని చంపడానికి ప్లాన్ వేస్తున్నారు. పంచశూలమ్ తన పథకాలలో తనుంటాడు.

రాత్రి పది గంటలు కావస్తోంది.

అమావాస్య చీకటి తాండవ నృత్యం చేస్తోంది

గోల్కొండ కోటకు వెనక భాగంలో- పది కిలో మీటర్ల దూరంలో, మరీ గాఢాంధకారం అలుముకు పోయింది. చుట్టుపక్కల ఉన్న చెట్లు, మెట్టలు చీకట్లో కలిసిపోయాయి.

మంత్రగబ్బలు అరుస్తున్నాయి. గుడ్లగూబలు కీచు కీచుమంటున్నాయి అప్పుడప్పుడు- కొరివి దెయ్యాల్లా, ఎక్కడో ఓ వెలుగు వెలిగి ఆరిపోతోంది.

వాతావరణం అతి భయంకరంగా ఉంది.

అదే సమయంలో-

చీకటిని చీల్చుకుంటూ ఓ బుల్లెట్ మోటార్ సైకిల్ వచ్చింది. ఓ చెట్టు పక్కన ఆగింది. సర్కస్‌లోని బఫూన్‌లాంటి వ్యక్తి కిందకు దిగి, బుల్లెట్‌కి స్టాండ్ వేశాడు. "ఆర్ యు రెడీ?" అన్నాడు చిన్నగా.

"యస్. రెడీ" ఎక్కడి నుండో మదన్ కంఠం వినిపించింది.

ఇంతలో, ఏదో లారీ వస్తున్నట్టు- దూరంలో హెడ్ లైట్లు కనిపించాయి.

ఓ చెట్టు పక్కకెళ్ళి నిలుచున్నాడు బఫూన్.

కొన్ని క్షణాల్లో లారీ వచ్చి, అక్కడ ఆగింది. దాని ముందు భాగంలో 'జంగిల్ సర్కస్' అన్న బోర్డు ఉంది. ఆ ఓపెన్ లారీలోని బోనులో ఓ పులి ఉంది. లారీ ఆగగానే బిగ్గరగా గాండ్రించింది పులి.

"కమ్ డౌన్". మదన్ కంఠం గర్జించింది.

బోను తెరచుకుంది. లారీ బైటకు దుమికింది పులి రెండు కాళ్ల మీద లేచి, నిటారుగా నిలుచుంది.

అది పులి కాదు- పులివేషంలో ఉన్న ఓ యువకుని ఆకారం!

రెండడుగులు ముందుకు వేశాడు ఆ యువకుడు. మళ్ళీ నిటారుగా నిలుచున్నాడు.

పెద్ద రాతి పక్క నుండి బైటకు వచ్చాడు మదన్. "తల తెచ్చావా?" అడిగాడు.

"తెచ్చాను. కేష్ వచ్చిందా?" పులి వేషంలో ఉన్న యువకుడు ప్రశ్నించాడు.

"రెడీ. తలిచ్చి, కేష్ తీసుకెళ్ళవచ్చు".

"నో. కేషిచ్చి, తల తీసుకెళ్ళు".

స్టేండర్డు వేన్-20 పక్క నుండి, బియ్యం బస్తాలాంటి లెదర్ బాక్స్ పట్టుకుని ముందు కొచ్చారు- జయరాజ్- గురూజీలు.

అంతలో చెట్టు పక్కనున్న బఫూన్ బైటకొచ్చాడు. లారీ డ్రైవర్ కిందకు దిగాడు. ఇద్దరూ టైగర్‌కి తోడుగా నిలుచున్నారు. ముగ్గురూ కలిసి లారీ లోంచి శవ పేటికను కిందకు దింపారు.

టైగర్ పార్టీలో ముగ్గున్నారు- అతను, బఫూన్, డ్రైవర్.

మదన్ పార్టీలో ముగ్గురున్నారు- అతను, జయరాజ్, గురూజీ.

రెండు పార్టీలకు మధ్య నలభై మీటర్ల దూరం ఉంది.

టైగర్ పార్టీ ఓ అడుగు ముందుకు వేసింది.

మదన్ పార్టీ రెండడుగులు ముందుకెళ్ళింది.

శవపేటికను మోసుకుంటూ, నాలుగడుగులు వేసింది టైగర్ పార్టీ.

కేష్ బాక్స్ పట్టుకుని వాళ్ళ వైపు నడిచారు- మదన్, జయరాజ్, గురూజీలు.

ఇరు పక్షాలవారు తూచి- తూచి అడుగులు ముందుకు వేస్తున్నారు.

వారు, వీరు నడుస్తూ- ఇరవై మీటర్ల దూరంలో, మధ్యలో కలుసుకున్నారు.

"కేష్ చూపించు" అన్నాడు టైగర్.

లెదర్ బాక్స్ తెరిచాడు మదన్. లోపల వంద రూపాయల కట్టలు వరుసగా పేర్చి ఉన్నాయి.

కింద నుండి పైవరకు, పై నుండి అన్ని నోట్లు పరిశీలించాడు టైగర్.

బాక్స్ మూస్తూ "తల చూపించు". అన్నాడు మదన్.

కర్ర పెట్టెను కింద పెట్టారు. తాళం తీసి, మూత తెరిచాడు టైగర్.

పెట్టెకు ఓ మూల- ముఖమల్ గుడ్డ మీద, రక్తపు మడుగులో ఉంది పంచశూలమ్ తల!

మదన్‌తో సహా జయరాజ్, గురూజీలు దాని వంక పరీక్షగా చూశారు.

-నెరిసిన గడ్డం, మీసాలు, తల వెంట్రుకలు, నల్లని కళ్ళు, తప్పటి ముక్కు- బలవంతంగా చంపబడినట్టు భయంకరంగా ఉంది ఆ తల!!!

"ఈ చిన్న తల కోసం యింత పెట్టెందుకు?" ప్రశ్నించాడు గురూజీ.

"ఈ పెట్టెకు కింద మరో అర ఉంది".

"అందులో ఏముంది?"

"పంచశూలమ్ మొండెం".

"తల తీసేస్తే అతను చచ్చిపోయినట్టేగా! మొండెం ఎందుకు?"

"మీకు పూర్తిగా నమ్మకం కలగడానికి....."

"అంటే?"

ఈ సీరియల్ MAHARAJA APM-INDIA వారు సమర్పిస్తున్నారు.

"అతని చేతి మీద 'పంచశూలమ్' అన్న అక్షరాలు పచ్చబొట్టుతో ఉన్నాయి ఆ పేరు చూసే, మీరే కాదు- ఎవరైనా సరే ఈ తల, మొండెం పంచశూలానిదేనని గుర్తిస్తారు. నేను ఏ పని చేసినా చాలా కరక్ట్‌గా చేస్తాను- తేడాపాడాలుండవు చెప్పింది చెప్పినట్టు చెయ్యడం నా స్పెషాలిటీ"



అన్నాడు టైగర్ వ్యర్థంగా

"కింద ఆర తరపండి" అన్నాడు జయరాజ్

ఇంతలో టేపలాంటి వాహనం వస్తున్నట్టు హెడ్ లైట్ల కాంతి కనిపించింది

"నాన్‌సెన్స్. మీరడిగింది పంచశూలమ్ తల మాత్రమే. అయినా మేము మొండెం కూడా తీసుకు వచ్చాం. చూపించటానికి మాకు అభ్యంతరం లేదు. కాని పోలీసులు మమ్మల్ని తరుముకొస్తున్నారు డీల్ త్వరగా పూర్తి చెయ్యండి" అన్నాడు కోపంగా టైగర్ శవపేటికను కాలుతో తన్నుతూ.

మదన్ వంక ప్రశ్నార్థకంగా చూశాడు జయరాజ్.

"కరక్టే. మనం అడిగింది తల మాత్రమే. అది పంచశూలమ్ తలో, కాదో పరీక్షించుకోండి" అన్నాడు మదన్.

"అతనిదే" అన్నాడు జయరాజ్.

"మీరేమంటారు?" గురూజీని ప్రశ్నించాడు మదన్.

"అతని తలలాగే ఉంది. మన వేనలో వేయించండి" అన్నాడు గురూజీ.

"టైగర్! కేష్ తీసుకుని, పంచశూలమ్ తల యివ్వండి" చెప్పాడు మదన్.

"ఆ నోట్లన్నీ మంచివేనా?" టైగర్ సూటిగా ప్రశ్నించాడు.

"అందులో ఏమీ పొరపాటు లేదు నేను హామీ యిస్తున్నాను". అన్నాడు మదన్

కేష్ బాక్స్ పట్టుకున్నాడు టైగర్. పంచశూలమ్ తల, మొండెం ఉన్న శవ పేటికలాంటి కర్రపెట్టెను అక్కడ విడిచిపెట్టాడు. "కమాన్!" అన్నాడు.

ఇంతలో, దూరం నుండి పోలీస్ సైరన్ వినిపించింది.

అప్పటికప్పుడే కేష్ బాక్స్ తీసుకుని బుల్లెట్

మోటారీ బైక్ దగ్గరకెళ్లాడు టైగర్.

అతనికంటే ముందే బైక్ దగ్గరకొచ్చి నిలుచున్నాడు బఫూన్.

కేష్ బాక్స్ అతనికిచ్చాడు టైగర్. సైడ్ బాక్స్‌లోని రెయిన్‌కోటు, ఫెల్ట్ హేటు తీశాడు. గబగబా కోటు తొడుక్కుని, హేట్ పెట్టుకున్నాడు. ఇంజన్ స్టార్ట్ చేసి, బుల్లెట్ మీద కూర్చున్నాడు.

"హర్రీ అప్" అన్నాడు.

లెదర్‌బాక్స్‌తో సహా మోటార్‌సైకిల్ వెనక కూర్చున్నాడు బఫూన్.

వెంటనే రాకెట్‌లా ముందుకు దూసుకుపోయింది- బుల్లెట్ మోటార్ బైక్.

అన్నీ గమనించాడు మదన్.

మరుక్షణంలోనే "పోలీసులు వస్తున్నారు. ముందు ఈ పెట్టె మీ వేన్‌లో పెట్టండి" అన్నాడు కంగారుగా.

"డోంట్ వర్రీ! ఆ పోలీసువాళ్లంతా మనవాళ్లే" జయరాజ్- వివరించాడు

"ప్రపంచంలో ఎవరినైనా నమ్మండి- కాని, పోలీసు వాళ్ళను నమ్మవద్దు. కమాన్!" అంటూ, పెట్టెను ఒక వైపు పట్టుకున్నాడు మదన్.

రెండో వైపున పట్టుకుని, పైకి లేవదీస్తూ "కంగారు పడకండి వస్తున్నది ఇన్‌స్పెక్టర్ అబ్దుల్లా. అతను మన మనిషే. టైగర్ని ఓ చూపు చూస్తాడు" అన్నాడు జయరాజ్.

శవపేటికలాంటి పెట్టెను స్టాండర్డ్-20 వేన్‌లో వేసి, "అంతకంటే ముందు నేనే ఓ చూపు చూస్తాను". అంటూ, తన టొరర్ కారు వైపుకు నడిచాడు మదన్. ఎగిరి స్టీరింగ్ ముందు కూర్చున్నాడు. ఇంజన్ స్టార్ట్ చేసి, కారును ముందుకు దూకించాడు.

## 81

మహా వేగంగా పరుగెత్తుతోంది బుల్లెట్.

ట్రాఫిక్ రద్దీలోను, ఎత్తుపల్లాల్లోను ఎంతో చాకచక్యంగా నడుపుతున్నాడు టైగర్.

అయినా, కేష్ బాక్స్ పట్టుకుని, వెనక కూర్చున్న బఫూన్ అదిరిపోతున్నాడు.

"సుభాష్! లాల్‌బహదూర్ స్టేడియం వైపు తిప్పు". అన్నాడు.

టైగర్ వేషంలో ఉన్న సుభాష్ మోటార్‌సైకిల్ని లాల్‌బహదూర్ స్టేడియం వైపుకు తిప్పాడు. అక్కడి నుండి ఎడం వైపుకు మళ్లించాడు.

కొన్ని క్షణాల్లోనే టాంక్‌బండ్ బ్రిడ్జి వైపు పరుగెత్తసాగింది- బుల్లెట్ మోటార్ బైక్.

వెనక అబిడ్స్ రోడ్ ఉంది. అది వన్‌వే ట్రాఫిక్.

కాని, వెనక నుండి ఓ జీప్ వస్తున్నట్లు గమనించాడు బఫూన్. వెంటనే "సుభాష్! ట్రాఫిక్ రూల్స్‌కు విరుద్ధంగా అబిడ్స్‌లోంచి దూసుకు వస్తోంది- అబ్దుల్లా జీప్". అన్నాడు.

"పోలీసువాళ్లకు ట్రాఫిక్ రూల్స్ వర్తించవు.

## త్యాగి దర్శకత్వంలో రాజ్‌బబ్బర్

అశోక్‌త్యాగి దర్శకత్వంలో తయారవుతున్న 'అంధేర్ గర్దీ' చిత్రంలో రాజ్‌బబ్బర్‌కు ప్రముఖమైన పాత్ర లభించిందట. థీం పాతదే అయినప్పటికీ చిత్రం తీసిన తీరులో చాలా మార్పుందట.

ఈ చిత్రంలో హీరోయిన్‌గా నటిస్తున్న కిమీకాట్కర్ అంగాంగ ప్రదర్శనలు కూడా చోటుచేసుకున్నాయట. మరి త్యాగి ఎన్నుకున్న ఈ సబ్జెక్టు ఎంతవరకు ప్రేక్షకులను ఆకట్టుకుంటుందో!

అవన్నీ వాళ్ల తాతలు పెట్టారు".

వెనక్కి తిరిగి చూశాడు బఫూన్. "వచ్చేస్తున్నాడు అబ్దుల్లా". అంటూ చిన్నగా అరిచాడు.

"డోంట్ వర్రీ! వాడి ముత్తాత కూడా మనల్ని పట్టుకోలేడు" అని, ఏక్సిలేటర్ని పూర్తిగా తిప్పాడు సుభాష్

గాలి కంటే వేగంగా పరుగెత్తసాగింది బుల్లెట్ డి. బి. ఆర్. ఖాదీ మిల్స్ దాటి లోయర్ టాంక్‌బండ్‌ను సమీపించింది

అదే సమయంలో-

లోయర్ టాంక్‌బండ్ వైపు నుండి మదన్ టొరర్ కారు రోడ్డు మీదకు వచ్చింది. టాంక్‌బండ్ బ్రిడ్జి వైపు పరుగెత్తసాగింది.

"వెరీ గుడ్' బఫూన్! కేష్ బాక్స్ టొరర్‌లోకి విసిరెయ్" అన్నాడు ఉత్సాహంగా సుభాష్.

సరిగ్గా బ్రిడ్జి ఎక్కబోతుండగా తన చేతిలోని కేష్ బాక్సు టొరర్‌లోకి విసిరేశాడు బఫూన్

మరు క్షణంలో నే టొరర్ స్పీడు అందుకుంది బ్రిడ్జి ఎక్కి కుడి వైపుకు తిరిగింది సికందరాబాద్‌కేసి పరుగెత్తసాగింది.

అబ్దుల్లా వచ్చేస్తున్నాడు" మళ్లీ చిన్నగా అరిచాడు బఫూన్.

"దుమికెయ్ నీటిలోకి" అంటూ, టేంక్ అంచు వరకూ వెళ్ళి, సడన్ బ్రేక్ వేసి విడిచిపెట్టాడు సుభాష్.

ఒక్క కుదుపుతో ముందుకు ఎగిరింది బుల్లెట్. టాంక్‌బండ్ మీద నుండి- ఇరవై మీటర్లు జంప్ చేసి, హుస్సేన్‌సాగర్‌లోకి దుమికింది.

అంతలోనే-

జీప్ టాంక్‌బండ్ మీదకు వచ్చింది.

సడన్ బ్రేక్ వేసి జీప్ ఆపాడు అబ్దుల్లా. అతనితో పాటు మరో నలుగురు కానిస్టేబుల్స్ జీప్ దిగారు. టాంక్ చివరికెళ్లారు. టార్చిలైట్ వేసి పరిశీలించారు.

వంద మీటర్ల దూరం వరకు గీతలా ఏర్పడి బుడగలు వస్తున్నాయి- నీటిలో.

ఇంతలో మరో పోలీస్ జీప్ వచ్చి ఆగింది. ఇద్దరు ఎస్. ఐ. లు, నలుగురు కానిస్టేబుల్సు క్రిందకు దిగారు. అబ్దుల్లాకు సెల్యూట్ చేశారు.

"వెంటనే సెర్చ్ లైట్లు తెప్పించండి. ఈతగాళ్లను రప్పించండి. అంగుళం అంగుళం వెదికించండి. లెదర్ బాక్సు, మోటార్ సైకిలు, ఆ యిద్దరు మనుషులు కనిపించేంత వరకూ హుస్సేన్‌సాగర్‌ని వడకట్టేయండి" అని ఆజ్ఞాపించి, జీప్ ఎక్కాడు అబ్దుల్లా.

అతనితో పాటు దిగిన కానిస్టేబుల్స్ తిరిగి జీప్‌లో కూర్చున్నారు.

రెండో జీప్‌లో వచ్చిన పోలీసువారు మళ్లీ సెల్యూట్ చేశారు.

"హర్రీ అప్". అని, గుబురు మీసాలు దువ్వుకుంటూ- జీప్‌ని సికందరాబాదు వైపు మళ్ళించాడు అబ్దుల్లా.

## 82

రోడ్డుకు అడ్డంగా, తాపీగా పరుగెత్తుతోంది ఓ పార్సిల్ వేన్.

అప్పటికి రెండు మూడుసార్లు హారన్ వేశాడు మదన్- సైడు కోసం. కాని, వేన్ డ్రైవర్ సైడు ఇవ్వలేదు.

మరోసారి హారన్ వాయించాడు మదన్.

అప్పటికీ సైడు యివ్వలేదు.

కాని-

వేన్ వెనక భాగంలో, చెయిన్ సిస్టమ్‌లో ఉన్న డోరు పైనుండి, కిందకు వేలాడింది. ఏటవల్లంగా దాదాపుగా రోడ్డుకు ఆనుకుని, చిన్న వంతెనలా ఏర్పడింది.

రియర్ వ్యూ మిర్రర్‌లోకి చూశాడు మదన్

వెనక పోలీసు జీప్ తరుముకొస్తోంది.

ముందుకు చూశాడు వేన్‌ని తప్పించుకు వెళ్ళడానికి ఎటూ మార్గం కనిపించలేదు.

ఇంతలో జీప్ హెడ్‌లైట్స్ ఆరిపోయాయి.

అదే సమయంలో-

అయస్కాంతానికి చేరువవుతున్న యినుములా, టొరర్ కారు వేన్‌లో కెక్కింది.

సడన్ బ్రేక్ వేశాడు మదన్.

అంతలోనే వేన్ వెనక డోరు యధాప్రకారం మూసుకుపోయింది.

కొన్ని క్షణాలపాటు స్థాణువులా ఉండిపోయాడు మదన్.

ఎంతో తెలివిగా ప్లాన్ చేసి- ప్రాణాలకు తెగించి, తీసుకొస్తున్న ఐదు కోట్ల, ఐదు లక్షల రూపాయలతో సహా తనూ, తన కారూ వేన్‌లో బంధింపబడిపోయారు!

ఈ విషయం మెదడులో కదిలేసరికి ఉగ్రభైరవునిలా అయిపోయాడు. కోటు జేబులోంచి రివాల్వర్ తీశాడు. వేన్ కంపించేటట్టు సింహగర్జన చేశాడు. "అరేయ్ బద్మాష్! ఎవరు నువ్వు? ఎంతో మందిని ట్రాప్ చేసి, కిడ్నాప్ చేసి, మర్డర్స్ చేసిన

నన్నే ట్రాప్ చేస్తావా? వెనక డోరు తెరుస్తావా, నీ చర్మం ఒలిచి డోలుకట్టమంటావా?'' అన్నాడు మదన్.

''మై సన్! పది నిమిషాలు రెస్ట్ తీసుకో. అబ్దుల్లా తరుముకొస్తున్నాడు. అతని జీప్ దాటిపోగానే వెనక డోరు తెరుస్తాను'' అన్న శాంత గంభీర స్వరం- వేన్ డ్రైవింగ్ సీటులోంచి వినిపించింది.

''శూలమ్ సాబ్!'' ఆశ్చర్యపోయాడు మదన్.

''యస్ మై బోయ్....''

''క్షమించాలి, సాబ్!''

''దట్సాల్ రైట్. వేన్ దిగే ముందు కేష్ బాక్స్ వేన్‌లో విడిచిపెట్టు'' శాంతంగా పైప్ పీలుస్తూ, ప్రశాంతంగా వేన్ నడుపుతూ, విలాసంగా మీసాలు దువ్వుకుంటూ అన్నాడు పంచశూలమ్.

## 83

గెస్ట్ హౌస్ దద్దరిల్లిపోయేలా నవ్వాడు గురూజీ.

చేతిలోని విస్కీ గ్లాస్ ఖాళీ చేసి, ఆగి, ఆగి నవ్వనారంభించాడు జయరాజ్.

అది వాళ్ల సీక్రెట్ రూమ్.

పంచశూలమ్ తల, మొండెం ఉన్న, శవపేటిక లాంటి పెట్టెను గది మధ్యలో పెట్టారు. దానికి రెండు వైపుల సోఫాలో కూర్చుని- కాళ్ళు ఆ పెట్టె మీద వేశారు. అప్పటికే యిద్దరూ బాగా తాగి ఉన్నారు. ఆ నిషాలో, అంతవరకు గూడుకట్టుకున్న భయం తొలిగిపోయింది. మొండి ధైర్యం, విజయ గర్వం వాళ్ళ కళ్ళకు పైకాన్ని కమ్మించాయి. మృత్యువును జయించినంత ఆనందంతో పొంగి పోతున్నారు.

''ఇహ మనకు భయంలేదు. ఖచ్చితంగా నూరేళ్ళు బతుకుతాం'' అన్నాడు జయరాజ్.

''లా ప్రకారం నడుచుకునే మనిషిని. ఐదు కోట్ల రూపాయలు పోతే పోయి. చెప్పిన మాట ప్రకారం పంచశూలమ్ తల తెచ్చాడు టైగర్. అదే 'లా' అంటే ... నేను నమ్మిన చట్టాలు నన్నెప్పుడూ మోసం చెయ్యలేదు''.

''నీకు సొంత చట్టాలున్నాయా?''

''లేకపోతే కోర్టువారి చట్టాల్ని నమ్ముకుంటే నిలువునా మునిగిపోతాం''.

''ఇప్పుడు మనం తేలినట్లేనా?''

''లక్షణంగా.... గాలిలో, ఆకాశంలోకి తేలి పోతున్నాం'' అంటూ, సోఫాలో పైకి కిందికి వూగాడు గురూజీ. శవపేటిక మీది కాళ్ళు కూడా వూగాయి.

ఆ మూమెంట్‌కు పెట్టె కదులుతున్నట్లనిపించింది జయరాజ్‌కు. ''తల ఎగురుతున్నట్లుంది, గురూ! కాళ్ళు తియ్-పెట్టె తెరుద్దాం''. అన్నాడు.

''అబ్దుల్లా వచ్చేంతవరకు పెట్టె తెరవకూడదు. అది 'లా''' అన్నాడు గురూజీ.

అదే సమయంలో గదిలోకి వచ్చాడు అబ్దుల్లా.

''స్మాష్! అందర్నీ స్మాష్ చేసేశాను. హుస్సేన్‌సాగర్‌లో పడి వూపిరాడక గిల గిలా తన్నుకు చచ్చాడు టైగర్''. అని, ఓ చేత్తో మీసాలు దువ్వుకున్నాడు. రెండో చేత్తో, టీపాయ్ మీది విస్కీ బాటిల్ అందుకున్నాడు. గడ గడా నాలుగు గుక్కలు 'రా' తాగాడు

''చచ్చాడా టైగర్?'' జయరాజ్ ప్రశ్నించాడు.

''డేమ్ డెకారం. చావకేం చేస్తాడు?''

''కేష్ బాక్స్ ఏమయింది?''

''వాడితో పాటు హుస్సేన్‌సాగర్‌లో పడిపోయింది. మన మనుషులు వెదుకుతున్నారు''.

''దొరుకుతుందా?''

''డిఫినెట్‌గా దొరుకుతుంది.... మీకు ఫిఫ్టీ, నాకు ఫిఫ్టీ....''

''సగానికి సగమే....!''

''ఔను.... మీరు ఆశవిడిచి పెట్టుకున్న డబ్బు అది అయినా, న్యాయంగా సగం మీకిస్తాను. వాటాల దగ్గర పోటీపడకూడదు. నా వాటాలో సగం పైగా మా గ్రహాలకు నైవేద్యం పెట్టాలి''. అంటూ, బాటిల్ ఖాళీ చేశాడు అబ్దుల్లా.

ఆ బాటిల్ పెట్టె మీద పెడుతుండగా, అది కదులుతున్నట్లనిపించింది.

''కాళ్ళు తియ్యండి- ఆ తలను బైటకు తీసి పుచ్చకాయలా పగులగొట్టేస్తాను'' అన్నాడు


Maharaja®

multi-purpose kitchen machine

It's Sleek! It's Elegant!!





3 STAINLESS STEEL JARS AND 5 BLADES.

500 WALTS HEAVY DUTY MOTOR.

60 MINUTES CONTINUOUS RATING.

18000 RPM.

3 SPEED WITH ADDITIONAL JUICER SPEED.

INDICATOR LAMP.

210-240 VOLTS.

అబ్దుల్లా- నిషాలో వూగిపోతూ.

జయరాజ్. గురూజీలకు కూడా నిషా తలకెక్కి పోయింది తూలుతూ లేచి నిలుచున్నారు.

పెట్టె తెరిచాడు అబ్దుల్లా

లోపల పంచశూలమ్ తల రక్తంతో పేరుకు పోయి ఉంది. రంగు మారిపోయింది. రాక్షస బొగ్గులా నల్లగా తయారయింది. తెరచుకుని ఉన్న కళ్ళు- టార్చిలోని బల్బుల్లా మిలమిల మెరుస్తూ అటూ- యిటూ కదులుతున్నాయి!

ఉలిక్కిపడ్డాడు అబ్దుల్లా. తల విదిలించాడు. రెప్పలు టపటపలాడించాడు. మళ్ళీ పరీక్షగా చూశాడు

పదే పదే పరిశీలనగా చూశాడు గురూజీ.

పంచశూలమ్ కళ్ళు కదులుతున్నట్లే ఉన్నాయ్!

"తల నరికినా, వీడు మళ్ళీ బతికాడా?" అయోమయంగా ప్రశ్నించాడు గురూజీ!

"అసలు నేను భస్మంగా మళ్ళీ బతకడానికి? మీ చావు చూసేంతవరకు నేను చావను" పంచశూలమ్ తల్లోంచి స్పష్టంగా వెలువడ్డాయి ఈ మాటలు.

తృళ్ళిపడ్డారు ముగ్గురూ. గదిలో మరెవరైనా ఉన్నారేమోనని నలువైపులకు చూశారు.

తిరిగి తల మీదకు దృష్టిని సారించాడు గురూజీ. "తెగిన తల ఎలా మాట్లాడుతుంది? ఏదో మోసం ఉంది యిందులో...." అన్నాడు.

"మోసాన్ని మోసంతోనే జయించాలి. మీరు నన్ను మోసగించి, హింస పెట్టినందుకు మిమ్మల్ని చిత్రహింసలు పెట్టి చంపుతాను అంతవరకు నా ఆత్మ శాంతించదు."

పంచశూలమ్ తల్లోంచి మళ్ళీ ఈ మాటలు వినిపించాయి

తల తిరిగిపోయింది అబ్దుల్లాకు. కోపం ముంచుకొచ్చింది. "చచ్చి కూడా మాట్లాడతావురా, సైతాన్" అంటూ, తలను పైకెత్తి నేలకేసి కొట్టాడు

కుండబద్దలయినట్లు భళ్ళున పగిలింది- మట్టితో తయారుచేసిన ఆ తల! గాజు గుడ్లు ముక్కలు ముక్కలయ్యాయి!! గడ్డం, మీసాలు, తల వెంట్రుకలు వూడిపోయాయి!!!

లోపల ఉన్న చిన్న సైజు టేప్‌రికార్డర్ తునాతునకలైపోయింది!

ఆ దృశ్యాన్ని చూసేసరికి ముగ్గురూ కొన్ని క్షణాల పాటు స్తంభించిపోయారు.

"దీనికంతకూ కారకుడు- ఆ మదనే" అన్నాడు జయరాజ్.

"వాడి అంతు చూడాలి" గురూజీ తన అభిప్రాయం వెల్లడించాడు

"చూస్తాను. వాడి అంతు చూస్తాను కీళ్ళు విరిచేస్తాను చర్మం ఒలిచేస్తాను ప్రాణాలు తీసేస్తాను. వాడి పేగులు మెళ్ళో వేసుకొని వూరేగుతాను." కోపోద్రేకాలతో వూగిపోతూ అన్నాడు అబ్దుల్లా

"డబ్బు పోయింది ఫలితం దక్కలేదు. యముడిలా ఆ పంచశూలమ్ ఎక్కడో, యింకా బతికే ఉన్నాడు. ఏదో క్షణంలో మా ప్రాణాలు తీసేస్తాడు." అన్నాడు జయరాజ్.

"డేమ్ డెకొరమ్! అంతకుముందే వాడి ప్రాణాలు తీస్తాను. వాడి శవాన్ని మీ కాళ్ళ ముందు వేస్తాను." అని, కోపాన్ని పట్టలేక, శవపేటికను బలంగా తన్నాడు అబ్దుల్లా.

ఆ ఒత్తిడికి రెండుసార్లు దొర్లి అర తెరచుకుంది.

లోపలి అరలోంచి

కళ్ళు పొడవబడి ముక్కు, చెవులు కోయబడి, కుళ్ళిపోతున్న విశాలాక్షి నగ్నదేహం నేలమీద పడ్డది!!!

ఆ కళేబరాన్ని చూసేసరికి కెవ్వున అరుస్తూ- తాగిన దానికి పది రెట్లు భళ్ళున కక్కుకున్నారు- అబ్దుల్లా, జయరాజ్, గురూజీలు!!!

## 84

రాత్రి ఒంటి గంట దాటిపోయింది.

ఐ జి. ఆఫీసు ముందు స్పోర్ట్స్ కారు ఆపుచేశాడు కేష్ బాక్స్ పట్టుకుని కిందకు దిగాడు. ఐ. జి. రూమ్ దగ్గరకెళ్ళాడు. ఓ కానిస్టేబుల్‌కి తన విజిటింగ్ కార్డు యిచ్చి లోపలకు పంపించాడు. పర్మిషన్ రాగానే- కేష్ బాక్స్‌తో సహా ఐ. జి. రూమ్‌లో ప్రవేశించాడు పంచశూలమ్.

"నేను మిలటరీ నుండి రిటైర్ అయ్యాను. ప్రస్తుతం పంచామృతం హొటల్లో పార్ట్‌నర్‌గా ఉంటున్నాను". తిరిగి పరిచయం చేసుకున్నాడు.

కుర్చీలోంచి లేచి, అతనితో కరచాలనం చేశాడు ఐ. జి మహేంద్ర. "వెరీ గ్లాడ్ టు మీట్ యు, మిస్టర్ పంచశూలమ్!... కూర్చోండి" కుర్చీ చూపించాడు

"అర్ధరాత్రి పూట వచ్చి, మీ విశ్రాంతికి భంగం కలిగించాను" అన్నాడు పంచశూలమ్- మహేంద్ర ముఖంలోకి పరీక్షగా చూస్తూ

"నో... నో... బాధ్యత గల వ్యక్తులకు విశ్రాంతి ఉండదు... వారం రోజుల నుండి నిద్ర లేదు, తిండి సహించడంలేదు, యింటికి వెళ్ళలేదు ఇరవై నాలుగు గంటలు ఆఫీసులోనే ఉంటున్నా...."

"సో.... వెరీ బిజీ ..??"

"బహుశా మీకు తెలిసే ఉంటుంది. ఈ మధ్య హైద్రాబాదులో నాలుగు హత్యలు, రెండు ఆత్మహత్యలు, ఓ చిత్రహింస జరిగాయి.. ."

"వాట్?" తెలియనట్లే రెట్టించాడు పంచశూలమ్.

"ఎమ్మెల్యే దీపాదేవి, పహిల్వాన్ భీమరాజు, బిజినెస్ మేగ్నెట్ జయరాజ్‌గారి శ్రీమతి, కొడుకు చంపబడ్డారు. గురూజీ కుమార్తె మీనాక్షి కళ్ళు పీకేశారు. ఆమె మరణించింది. అహల్య అనే ఓ స్త్రీ, ఆమె చిన్న కూతురు ఆత్మహత్య చేసుకున్నారు. ఈ మారణకాండలకు కారణమేమిటో, ఎవరు చేస్తున్నారో అంతుబట్టడం లేదు. హంతకుల కోసం గాలిస్తూ, మా డిపార్టుమెంట్‌ను నిద్రపోనివ్వడం లేదు, నేను నిద్ర పోవడం లేదు".

"ఆఫ్‌కోర్స్... మీ వృత్తి ధర్మం, బాధ్యతలు అలాంటివి... బై ది బై... సాయంకాలం సింగపూర్ నుండి ఓ పాసింజర్ వచ్చాడు మా హొటల్‌కి రాత్రి పదకొండు గంటల ఫ్లయిట్‌లో తిరిగి వెళ్ళిపోయాడు. కాని, రూమ్‌లో ఓ లెదర్ బాక్స్ మరచిపోయాడు. అతనిచ్చిన అడ్రసు, ఫోన్ నెంబర్ల ప్రకారం సింగపూర్‌కు ఫోన్ చేశాను నేను కాని, అలాంటి పేరు గల వ్యక్తి తమకు తెలియదని చెప్పారు."



# ఫోటో వ్యాఖ్య పోటీ-28 ఫలితాలు



బహుమతి పొందిన వ్యాఖ్య

"కృష్ణ పొంగుల ఆనందం
గతులు తప్పితే విషాదం"

ఎస్. శ్రీనివాసరావు (పొదిలి)

---

"ఉధృతమైన వరదనీరు,
హద్దులు దాటకుంటే చాలు"

ఆచంట రంగారావు (ఇల్లిందలపర్రు)

"గలగల పారే జల నిధులపై
రణగొణ ధ్వనుల రైలుదారి"

సామినేని సావిత్రి (హైదరాబాద్)

"ఏరుగా పారే నీరు ప్రాణం పోస్తుంది
వరదగా పొంగే నీరు ప్రాణాలు తీస్తుంది"

టి.వి.కృష్ణమోహన్ (విజయవాడ)

లక్కీ పేర్లు

కె.విజయ భాస్కర్ (కొల్లూరు), ఎం.సీత న్నాయుడు (మచిలీపట్నం), ఎం.ఉపేంద్రశర్మ (శ్రీకాకుళం), జి.సరోజిని (గుంటూరు), ఎం.సురేంద్ర రెడ్డి (కొంకుదురు), అల్లాడి శారద (హైదరాబాద్), కె.శివరామకృష్ణ ప్రసాద్ (ఏలూరు), నిట్టల కృష్ణాజి (అమలాపురం), కె.లక్ష్మి (బొంబాయి), జి.నరసింహామూర్తి (అంజుజ).

---

"అతని పేరు"

"జోషీ".

"జోషీ?" రెట్టించాడు ఐ. జి. మహేంద్ర.

"ఔను. అతను మరచిపోయిన పెట్టె యిది." అంటూ లెదర్‌బాక్స్ టేబిల్ మీద పెట్టాడు పంచశూలమ్.

కాలింగ్‌బెల్ నొక్కాడు మహేంద్ర. ఇద్దరు యిన్‌స్పెక్టర్లు లోపలకు వచ్చారు. వాళ్ళ చేత పెట్టె తెరిపించాడు.

పెట్టెనిండా వంద రూపాయల నోట్ల కట్టలున్నాయి.

కొన్ని క్షణాలపాటు వాటి వంక చూస్తూ, స్తంభించిపోయాడు మహేంద్ర.

నోట్లు పరీక్ష చేసి, కట్టలు లెక్క పెట్టి "ఐదు కోట్ల రూపాయలున్నాయి స్సార్!" అన్నాడు ఓ యిన్‌స్పెక్టర్. రెండో యిన్‌స్పెక్టర్ పరీక్షిస్తుండగా- పెట్టె అడుగున ఓ కవరు కనిపించింది. దానిని తీసి, మహేంద్రకిచ్చాడు.

కవరు చింపాడు మహేంద్ర. అందులో ఓ ఉత్తరం ఉంది. దానిలో

'ఐ. జి. మహేంద్రగార్కి నమస్కారాలు!

25 సంవత్సరాల క్రితం నేను, కేషియర్, అక్కౌంటెంటు; మద్రాసులోని భారత్ బ్యాంక్ నుండి కోటి రూపాయలు దోచుకున్నామని అపరాధం మోపారు. రిమాండ్‌లో ఉండగానే కేషియర్, అక్కౌంటెంట్- పోలీసుల అఘాయిత్యాలకు ఆహుతై పోయారు.

కాని, మేము ఆ దోపిడీ చెయ్యలేదు.

అయినా, కొందరు వ్యక్తులు యిచ్చిన సాక్ష్యాన్ని ఎదిరించి, వారిని అవమానించడం యిష్టం లేక, కోర్టులో నా నిర్దోషిత్వాన్ని నిరూపించుకోడానికి ప్రయత్నించలేదు.

చట్ట ప్రకారం నాకు శిక్ష విధించారు.

అన్యాయంగా ఆ శిక్ష అనుభవించడానికి యిష్టంలేక మర్నాడే జైల్లోంచి పారిపోయాను.

25 సంవత్సరాలు ఎక్కడెక్కడో అజ్ఞాతవాసం చేశాను. బ్యాంక్ దోపిడీ చేసి, ఆ అపరాధాన్ని నా మీద వేసిన దోషులపై ప్రతీకారం తీర్చుకోవాలని నిశ్చయించుకున్నాను. వాళ్ళ దగ్గర నుండే సంగ్రహించి ఈ 5 కోట్ల రూపాయలు మీకు అందజేస్తున్నాను.

ఇట్లు, జోషీ....' అని ఉంది.

"ఓ మై గాడ్! 25 సంవత్సరాల క్రిందటి కేసు మళ్ళీ వెలుగులోకి వస్తోంది. ఈ ఉత్తరం చూడండి, మిస్టర్ పంచశూలమ్!" అని, ఉత్తరాన్ని యిచ్చాడు మహేంద్ర.

రెండు నిమిషాల్లో ఉత్తరాన్ని చదవడం పూర్తి చేశాడు పంచశూలమ్.

"ఐ. జి. సాబ్! చట్టాలు నిద్ర పోవచ్చు. కాని, నేరం దాగదు. ఏనాటికైనా బైట పడుతుంది". అన్నాడు.

అతని ముఖంలోకి సూటిగా చూశాడు మహేంద్ర. "యు ఆర్ కరెక్ట్... బై ది బై.... ఈ విషయం హోమ్ డిపార్ట్‌మెంట్‌కు తెలియజేస్తాను. ఒకటి రెండు రోజుల్లో మీకు సన్మానం ఏర్పాటు చేయిస్తాను" అన్నాడు.

"దేనికి?" ఆశ్చర్యపోతూ అడిగాడు పంచశూలమ్.

"మీ నిజాయితీకి..., ఐదు కోట్ల రూపాయలు తెచ్చి యిచ్చారు మీరు. మిమ్మల్ని గౌరవించాలి మేము. యు ఆర్ ఎ గ్రేట్ మాన్".

"పాసింజర్లు హోటల్లో మరచిపోయిన వస్తువుల్ని పోలీసులకు అప్పగించడం నా డ్యూటీ ఇందులో నా గొప్పతనం ఏమీలేదు".

"మిమ్మల్ని ఆనర్ చెయ్యడం కూడా మా డ్యూటీయే". అన్నాడు దృఢ కంఠస్వరంతో ఐ. జి. మహేంద్ర.

(ఇంకా ఉంది)

# సప్తమ ఉత్తర అమెరికా తెలుగు సమ్మేళనం

**అమెరికాలోని తెలుగువారు రెండు సంవత్సరాల కొకసారి జరుపుకునే "తానా సభలు" (టి. ఎ. ఎన్. ఎ. తెలుగు అసోసియేషన్ ఆఫ్ నార్త్ అమెరికా) ఈసారి టెక్సాస్ రాష్ట్రంలోని హూస్టన్ నగరంలో జులై 1, 2 తేదీలలో జరిగాయి.**



–డా. యార్లగడ్డ లక్ష్మీప్రసాద్
(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

ఆంధ్రప్రదేశ్ నుండి పాల్గొన్న కొద్దిమంది విశిష్ట వ్యక్తులతో పాటు అమెరికాలోని మూడు వేల మందికిపైగా తెలుగువారు ఈ రెండు రోజుల సదస్సులో పాల్గొన్నారు. హైదరాబాద్ విశ్వ విద్యాలయం కులపతి ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి ముఖ్య అతిథిగా పాల్గొన్న ఈ సమావేశాలలో ఆలిండియా ఇనిస్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్‌కు చెందిన డా. వి. రామలింగస్వామి, చిన్మయ మిషన్‌కు చెందిన స్వామిని శారదప్రియానంద, సుప్రసిద్ధ తెలుగు కవులు జి. బాపురెడ్డి, (ఐ. ఏ. ఎస్) కనుములూరి వెంకట శివయ్య, ప్రఖ్యాత అవధాన పండితుడు మేడసాని మోహన్, తెలుగు సినిమా రంగానికి చెందిన శ్రీమతి జమున, చంద్రమోహన్, గాయనీమణులు శ్రీమతి పి. సుశీల, శోభారాజు, గాయకులు రామకృష్ణ, గోడమీద బొమ్మలు చెక్కే చిత్రకారులు శిష్ట్లా రామకృష్ణారావు, ప్రముఖ పారిశ్రామికవేత్త అక్కినేని బలరామ్, ఆంధ్ర విశ్వ విద్యాలయ మాజీ ఆచార్యులు ఆలూరి శ్రీరామదాసు ప్రభృతులు పాల్గొన్నారు.

జులై 1వ తేదీ ఉదయం 10 గంటలకు భారత, అమెరికన్ జాతీయ గీతాలాపనలతో సదస్సు ఆరంభమయ్యింది. హూస్టన్ నగరానికి చెందిన డా. వేములపల్లి కేశవరావు స్వాగతం చెప్పారు. సభల కన్వీనర్ డా. వి. జనార్ధనరెడ్డి ప్రసంగిస్తూ, 'ఐకమత్యమే మహా బలం' ప్రధాన ఉద్దేశ్యంగా ఈ సదస్సు నిర్వహిస్తున్నామని, ఏమైనా చిన్న చిన్న భేదాభిప్రాయాలు ఉన్నప్పటికీ అందరం కలసి మెలసి పని చేసి ఉత్తర అమెరికా తెలుగు సంఘాన్ని బ్రహ్మాండంగా తీర్చిదిద్దగలమనే ఆశాభావాన్ని వ్యక్తం చేస్తూ అనుభవాలనుండి పాఠాలు నేర్చుకుంటూ ముందుకు సాగాలని అన్నారు. ఈ సమ్మేళనానికి ముఖ్య అతిథిగా విచ్చేసిన ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి మాట్లాడుతూ, రెండేళ్ళ కొకసారి ఈ ఉత్తర అమెరికా తెలుగు సభలు జరుపుకోవటం ఆనందించవలసిన విషయమని, పిల్లలకు మన తెలుగు సంప్రదాయాలను, అలవాట్లను, కట్టుబాట్లను నేర్పాలని చెప్పారు.

ప్రత్యేక సంచిక విడుదల చేస్తున్న ముఖ్య అతిథి ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి




## సందేశాలు

ఈ సభలు విజయవంతం కావాలని అమెరికా అధ్యక్షులు జార్జి బుష్, భారత ప్రభుత్వ మానవ వనరుల అభివృద్ధి శాఖామాత్యులు పి. శివశంకర్ సందేశాలు పంపారు.

ఈ సభలో 'వింజమూరి సిస్టర్స్'గా ప్రసిద్ధి చెందిన సీత, అనసూయగార్ల పుస్తకాలను, కాసెట్లను, బాపురెడ్డి వ్రాసిన 'ప్రణయం ప్రణవం' సంకలనాలను విడుదల చేశారు.

## 'తా నా' అవార్డులు

ఈ సభల సందర్భంగా గత రెండేళ్ళలో అమెరికాలో వివిధ రంగాలలో విశేషమైన ప్రతిభ ప్రదర్శించిన తెలుగువారికి బహుమతులు ఇవ్వబడ్డాయి. బహుమతులు పొందిన వారిలో డా. నోరి దత్తాత్రేయుడు, డా. రాజు, యస్. కుచర్లపాటి, డా. పి. శ్యామసుందరరావు, శ్రీమతి పత్తిసాపు శకుంతల గంగాధరమ్, అంబటి జయకృష్ణ, అంబటి మురళీకృష్ణ, డా. బండారు సుభాషిణిరెడ్డి, మేడూరి అవంతి, శ్రీమతి ఉమా భారతి, అవసరాల అనసూయాదేవి, వింజమూరి సీతాదేవి ఉన్నారు. ఈ అవార్డుల ఎంపిక సంఘానికి డా. పరుచూరి జ్యోత్స్న అధ్యక్షులుగా వ్యవహరించారు.

## సాంస్కృతిక కార్యక్రమాలు

ఈ రెండు రోజుల సభల సందర్భంగా వివిధ విషయాలపై వేర్వేరు గదులలో 'ప్యానల్ డిస్కషన్స్' జరుగుతుండగా సభలకు వచ్చిన మిగిలిన వారికోసం ఏర్పాటు చేసిన సాంస్కృతిక కార్యక్రమాలలో




కన్వీనర్ జనార్ధనరెడ్డిని సన్మానిస్తున్న సినీ నటి జమున

ప్రధానమైన 'కుల్లెన్ ఆడిటోరియం' 20 గంటలపాటు హోరెత్తి పోయింది. అమెరికాలోని తెలుగువారు నృత్యాలతో, నాటక ప్రదర్శనలతో, సంగీత కార్యక్రమాలతో; మిమిక్రీతో సభికులను ఆశ్చర్యంతో ముంచెత్తి వేసారు. శ్రీమతి రత్నపాప విప్రనారాయణ నృత్య నాటికను ప్రదర్శించారు. హైదరాబాద్‌కు చెందిన పుంజల అలేఖ్య తన నృత్యంతో సభికులను ముగ్ధులను చేయగా, శ్రీమతి సునీత రామకృష్ణల బృందం 3 గంటలపాటు తమ సంగీత రసస్రోతస్వినితో సభికులను ఓలలాడించారు. రెండవరోజు చంద్రమోహన్ తన బృందంతో 'పూజకు వేళాయెరా' నాటకం ప్రదర్శించారు.

ఆంధ్రప్రదేశ్‌నుండి వచ్చిన శోభారాజు తన బృందంతో 'అన్నమాచార్య కీర్తనలు' ఆలపించారు. మేడసాని మోహన్ చేసిన 'అష్టావధానం' కూడా మన్ననలను పొందింది.

## వివిధ విషయాలపై గోష్ఠులు

'తానా' సభల సందర్భంగా ఉత్తర అమెరికాలోని తెలుగువారు ఎదుర్కొంటున్న వివిధ సమస్యలకు సంబంధించి గోష్ఠులు నిర్వహించబడ్డాయి. సామాజిక సమస్యలకు సంబంధించిన గోష్ఠిలో అమెరికాలోని తెలుగువారు సామాజికంగా తమ కెదురవుతున్న వివిధ సమస్యలను ఎలా పరిష్కరించుకోవాలో చర్చించారు. పిల్లలకు ప్రేరణ కలిగించే విషయంలో అమెరికాలోని తెలుగువారి పిల్లలు, మిగిలిన అమెరికన్ పిల్లలకంటే ఎక్కువ ఉత్సాహం, ప్రేరణ కల్గివున్న కారణంగా పిల్లలపై ప్రేరణ పేరుతో ఎక్కువ ఒత్తిడి కల్గించటం భావ్యం కాదని నిర్ణయించారు. అంతేకాకుండా పిల్లలను తమ కుటుంబానికో, ప్రాంతానికో, రాష్ట్రానికో, దేశానికో కట్టిపడేసే ఆలోచన మంచిది కాదని 'పిల్లలు ప్రపంచానికి బహుమతులని' తీర్మానించారు. పిల్లల వివాహాల విషయంలో వరకట్నం సమస్యను గురించి చర్చించటం జరిగింది. ఆడపిల్లలను, మొగ పిల్లలను సామాజికంగా, ఆర్థికంగా సమానంగా చూస్తే ఈ సమస్య దానంతట అదే పరిష్కారమవుతుందని నిర్ణయించారు.

## విడాకులు

అమెరికాలోని తెలుగువారిని ప్రస్తుతం తీవ్రంగా వేధిస్తున్న డేటింగ్, విడాకుల సమస్యపై ఆసక్తికరమైన చర్చ జరిగింది. అమెరికన్ సమాజంలో చాలా సహజమైన 'డేటింగ్' (యువతీ యువకులు వివాహానికి ముందు ఒకరినొకరు అర్థం చేసుకోవటానికి చేసే స్నేహం) వలన ఉత్పన్నమవుతున్న సమస్యలను పెద్దవాళ్ళు వివరించగా, తమకు డేటింగ్‌లో పాల్గొనే స్వేచ్ఛ ఉండాలని తెలుగు యువతీ యువకులు గట్టిగా కోరారు. తీవ్రమైన చర్చ జరిగిన తర్వాత డేటింగ్‌లోని మంచి చెడ్డలను వివరించే బాధ్యత వరకే పెద్దలదని, నిర్ణయం మాత్రం పిల్లలదేనని తీర్మానించబడింది.

విడాకుల సమస్యను గురించి చర్చించి, విడాకుల వలన ఉత్పన్నమయ్యే సామాజిక ఇబ్బందులను తొలగించటం కోసం కృషి చెయ్యాలని నిర్ణయించారు.

'స్త్రీలకు ప్రాధాన్యత' అన్న అంశంపై చర్చలు చాలా వేడిగా జరిగాయి. అమెరికాలో ఉన్న తెలుగు స్త్రీలు, మొగవారి కంటే ఎక్కువ బాధ్యతలు నిర్వహిస్తున్నారని, ఎక్కువ ఒత్తిడికి గురవుతున్నారని వ్యక్తం చేయబడింది. సంప్రదాయాలను రక్షించటంలో స్త్రీలే కాకుండా పురుషులు కూడా సమాన బాధ్యతలు నిర్వహించాలని నిర్ణయించారు.

అమెరికన్ తెలుగు యువత, ఇంట్లో తెలుగు సంప్రదాయం, బయట అమెరికన్ సంప్రదాయం, రెండింటి మధ్య నలిగిపోవలసి వస్తున్నదని, అదే విధంగా పెద్దవాళ్ళు తమ తల్లిదండ్రుల వలన వచ్చే సమస్యలను గురించి చర్చించారు.

పూర్తి తెలుగుదనం నిండిన సాంస్కృతిక కార్యక్రమాలతో, తెలుగు భోజనంతో, రెండు రోజుల ఉత్తర అమెరికా తెలుగువారి 'తానా సభలు' దిగ్విజయంగా ముగిశాయి.

శ్రోతల్ని ముగ్ధుల్ని చేసిన సుశీల, రామకృష్ణ బృందం






**సిగరెట్టు తాగుతూ స్నేహితుడితో నిల్చుని వున్నాడు రామారావు. అతని స్నేహితుడు రంగనాథం మద్రాసు వెళ్తున్నాడు. వెనకనుంచి భుజంమీద చెయ్యి పడటంతో ఉలిక్కిపడి వెనక్కి తిరిగి చూశాడు రామారావు.**

బాగా మాసి పోయిన పైజమా లాల్చీలో వున్న వ్యక్తిని చూసి మొహం చిట్లించుకున్నాడు రామారావు. "నేను గుర్తున్నానా?" రామం ముఖంలోకి లోతుగా చూస్తూ ప్రశ్నించాడు ఆ వ్యక్తి.

"లేదు" నిర్లక్ష్యంగా జవాబిచ్చాడు రామం.

"నా పేరు గోపాలం. ఐదు సంవత్సరాల క్రితం ఇదే ప్లాటుఫారం మీద కలుసుకున్నాం". రామం కళ్లలోకి గుచ్చి చూశాడు గోపాలం.

రామారావుకు వెన్నెముకలో ఏదో జరజర పాకినట్లయింది. కళ్లలో భయం. అరచేతుల్లో చెమట్లు పట్టాయి. "గుర్తురాలేదా? ఇంకా చెప్పమన్నారా....." అంటూ ఆగి ముఖంలోకి చూశాడు. రామారావు తడబడుతూ స్నేహితుని వైపు చూశాడు. అతను అక్కడ లేడు. దూరంగా బుక్ స్టాల్ దగ్గర నిల్చుని వున్నాడు.

"మీరు పొరబడి వుంటారు. నేను మిమ్మల్ని ఇంతకు ముందెప్పుడూ చూళ్లేదు." తనలో కలిగిన తడబాటును పైకి కనబడ నీయకుండా అన్నాడు రామం.

"మీ పేరు రామం కదూ? మీలో పెద్ద మార్పేమీ లేదు. నాలో చాలా మార్పు వచ్చింది. అందుకే గుర్తించలేదనుకుంటాను."

కాదు.... నా పేరు రామం కాదు.... వెంకటేశ్వర్లు."

అన్నాడు రామం పాఠం అప్పగించినట్టు.

గోపాలం ఆశ్చర్యంగా రామం కళ్ళలోకి చూశాడు. రామం పక్కకు చూడసాగాడు.

"నేనే పొరబడి వుంటాను. మనిషిని పోలిన మనుషులుంటారు" సాలోచనగా అన్నాడు గోపాలం.

"అవునవును. అప్పుడప్పుడు మనం పొరబడుతుంటాం" కొంత రిలీఫ్‌గా ఫీలవుతూ అన్నాడు రామం.

గోపాలం అదోలా నవ్వాడు. రామం గతుక్కుమన్నాడు.

"బండి రావడానికి చాలా టైం వుంది. కాఫీ తాగుదాం వస్తారా?"

"వద్దు. మీరు తాగండి. ఇపుడే నేనూ నా స్నేహితుడూ తాగాం!" అన్నాడు రామం.

"మర్యాదకు పిల్చాను. నా దగ్గర డబ్బులు కూడా లేవు లెండి. కాఫీ తాగివస్తాను" అంటూ గోపాలం రెస్టారెంటులోకి వెళ్ళాడు. అలా వెళ్తున్న గోపాలాన్ని చూస్తూ నిలబడి పోయాడు రామం.

మళ్ళీ వస్తాడేమో? తను వెళ్ళిపోతే? బండి వచ్చేవరకు వుండకుండా వెళ్ళిపోతే తన స్నేహితుడు ఏమనుకుంటాడూ? అతను తనను గుర్తుపట్టలేదుగా? భయం ఎందుకూ? ఎలాంటివాడు ఎలా అయిపోయాడు? ఎంత ఉత్సాహంగా కనిపించాడు ఆరోజు? నీట్‌గా డ్రస్ చేసుకుని వున్నాడు. దుర్వ్యసనాలు వున్నవాళ్ళ గతి ఇంతే!

ఆ రోజు..... ఐదేళ్ళనాడు.... తను అంతరాత్మ పీకనొక్కి స్మృతి పేటికలో అట్టడుగున గుప్తపరచిన ఆ రోజు ... మళ్ళీ కళ్ళముందు కొచ్చి నవ్వింది.

"ఒరేయ్ రామం! జాగ్రత్తరా! నాలుగు వేలు భద్రంగా తీసుకెళ్ళి మామయ్య కివ్వు. రైల్లో నిద్రపోకు. అసలే రోజులు బాగా లేవు." హెచ్చరించాడు తండ్రి గుడివాడ బస్టాండ్‌లో.

రామారావుకు అసలే గుండెలు పీచుపీచు మంటున్నాయి. అంత డబ్బు దగ్గర పెట్టుకుని ప్రయాణం చేయాలంటె భయంగా వుంది. తండ్రి హెచ్చరికలు మరీ చిరాకు కలిగించాయి.

"సరేలే! ఇక నువ్వెళ్ళు!" విసుక్కున్నాడు రామం.

"వెళ్తాలే! బస్ రానియ్!"

రామానికి మహా చిరాగ్గా వుంది

"రైల్లో జాగ్రత్త....",

"అబ్బబ్బ! ఊరుకో నాన్నా!" అంటూ ఎవరైనా వింటున్నారేమోనని చుట్టూ చూశాడు. ఎవరి గొడవలో వాళ్ళున్నారు. కొద్దిదూరంలో టిప్ టాప్‌గా డ్రస్ చేసుకున్న ఒక యువకుడు సిగరెట్ తాగుతూ రామం కేసి చూశాడు. రామం గతుక్కుమన్నాడు. వాడు తనకేసి ఎందుకు చూస్తున్నట్టు? నాన్న చెప్పడం విన్నాడేమో?

బస్ వచ్చింది. రామం బస్ ఎక్కి కూర్చున్నాడు. మరో సారి హెచ్చరించి తండ్రి వెళ్ళి పోయాడు. రామం కోటు కిందగా, షర్ట్ మీదనించి బనీన్ జేబు తడిమి చూసుకున్నాడు.

బనీన్ జేబులో నాలుగు వేలు పెట్టి పిన్ను పెట్టుకున్నాడు. షర్ట్ మీద నుంచి ఎత్తుగా కన్పిస్తుందనే భయంతో కోటు వేసుకున్నాడు. అయినా భయంగానే వుంది. జేబులు కత్తిరించే వాళ్ళ ప్రావీణ్యత గురించి ఎన్నో కథలు విన్నాడు రామారావు.

"ఎంతదాకా?"

రామం ఉలిక్కిపడ్డాడు. పక్కకు చూశాడు. తన పక్కన కూర్చున్న వ్యక్తిని చూసి నీరుకారి పోయాడు. వీడు...'తనను బస్టాండులో గమనిస్తూ నిల్చున్నాడు. ఇపుడు పక్కన చేరాడు. తనదగ్గర పెద్ద మొత్తం వున్నట్టు వాసన పట్టినట్టే వున్నాడు. నాన్న మరీ? చుట్టూ వున్న మనుషుల్ని చూడకుండా ఒకటే హెచ్చరికలు చేశాడు.

"మాట్లాడరేం?"

"ఒంగోలు వెళ్ళాలి. హైదరాబాదు, మద్రాసు ఎక్స్‌ప్రెస్‌లో" తీరా నిజం చెప్పినందుకు తనను తనే తిట్టుకున్నాడు

"నేనూ గూడూరు వెళ్ళాలి. ఫర్వాలేదు. తోడు దొరికారు. బోర్ కొట్టకుండా కబుర్లు చెప్పుకోవచ్చు" అన్నాడు ఆ వ్యక్తి... సందేహం లేదు. వీడు తనను వెంబడిస్తున్నాడు. హే భగవాన్ నన్ను ఈ దుర్మార్గుడి బారి నుంచి రక్షించే భారం నీదే. అతను ఏదో మాట్లాడుతూనే వున్నాడు. రామం "ఆఁ ఊఁ" అంటూ యధాలాపంగా కూర్చున్నాడు.

ఇద్దరు బస్ దిగారు.

అతను రిక్షా పిల్చాడు రామం మరో రిక్షా పిలుస్తూ వుంటే "ఎందుకండి రెండు రిక్షాలు దండగ! ఎక్కండి!" అన్నాడు ఆ వ్యక్తి.

రామం గుండెలు వేగంగా కొట్టుకున్నయ్. జేబు కత్తిరించే ప్రయత్నంలోనే వున్నాడు. దొంగ రాస్కెల్. పైకి ఎంత మర్యాదస్తుడిలా కన్పిస్తున్నాడో! అనుకుంటూనే రామం రిక్షా ఎక్కాడు.

"మీ పేరు?" రిక్షాలో కూర్చొని అడిగాడు ఆ వ్యక్తి.

"రామం!"

"నా పేరు గోపాలం?" చెప్పాడు అడక్కుండానే. దొంగలు నిజమైన పేరు చెప్పరు. వీడిపేరు గోపాలం

## పతులు గతించినా ఫలితం దక్కింది!

ఆరు దశాబ్దాలలో యిద్దరు ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన భర్తలను పొందటమే కాకుండా లక్షలాది డాలర్లు కూడబెట్టుకో గలిగిన మహిళ పేరు ప్రస్తావనకు వచ్చినప్పుడు ముందుగా చెప్పుకోవలసిన పేరు జాక్వెలిన్ బౌవియర్‌ట.

'89 జులై 28తో 60 ఏళ్ళు నిండిన ఈమె ఎవరో కాదు. . అమెరికా మాజీ అధ్యక్షుడు జాన్ ఎఫ్. కెన్నెడీ భార్య. 1953లో కెన్నెడీని వివాహం చేసుకోవటంతో ఈమె వార్తల్లో కెక్కింది అప్పుడు కెన్నెడీ మసాచ్యుసెట్స్‌లో సెనేటర్‌గా పని చేస్తున్నారు.

తగినటువంటి భార్యను పొందలేకపోతే అధ్యక్షుడివి కాలేవని కెన్నెడీ తండ్రి అంటుండేవాడట. అందుకే విద్యావంతురాలు, అందగత్తె అయిన జాక్వెలిన్‌ను పెళ్ళి చేసుకున్నాడు కెన్నెడీ.

1963లో కెన్నెడీ హత్య జరిగింది. ఐదేళ్ళ పాటు ఏమి విరహం అనుభవించిందో.... ఆ తర్వాత గ్రీక్ షిప్పింగ్ కంపెనీలో పని చేసే అరిస్టాటిల్ ఒనాసిస్‌ను వివాహం చేసుకుంది 1975లో అతను కూడా మరణించే సమయానికి జాక్వెలిన్ విడాకులకు సిద్ధంగా వున్నదట. అన్ని రకాల "వ్యవహారాలను" వదిలించుకునేందుకు ఒనాసిస్ కుమార్తె తన సవతి



తల్లి అయిన జాక్వెలిన్‌కు లక్షలాది డాలరు చెల్లించేందుకు సిద్ధపడింది ఆ విధంగా జాక్వెలిన్ తన సంపదను 20 కోట్ల డాలర్లకు పెంచుకుందట

అప్పటి నుంచి బయటి ప్రపంచంతో సంబంధాలను పెంచుకొంది "డబుల్ డే పబ్లిషింగ్ కంపెనీ"లో పార్ట్ టైం ఎడిటర్‌గా పని చేస్తూ, ఎక్కువ కాలం న్యూయార్క్‌లోనే గడిపింది.

మార్తా విన్‌యార్డ్‌లో ఒక పెద్ద భవంతిని ఏర్పాటు చేసుకుంది. 10 సంవత్సరాలకు పైగా తన ఆర్థిక సలహాదారుల్లో ఒకడైన మారిస్ టెంపుల్స్ మాన్‌ను తన సహచరుడిగా "వుంచు"కుంది.

కెన్నెడీకి ప్రియురాలైన మార్లిన్ మన్రోని పెళ్ళి చేసుకునేందుకు వీలుగా ఆయనకు విడాకులిచ్చేందుకు కూడా ఒకప్పుడు సంసిద్ధురాలైన జాక్వెలిన్ తన ఉనికి కోసమే ఒనాసిస్‌ను వివాహం చేసుకుందన్న విషయాన్ని యిప్పటికీ అమెరికా ప్రజలు మరువలేక పోతున్నారట.

అయి వుండదు దొంగవెధవ దొంగపేరు చెప్పాడు.

"అసలే ఉక్కగా వుంటే ఆ కోటెందుకండీ? తీసి పట్టుకోవచ్చుగా?" అన్నాడు గోపాలం.

"అమ్మ రాస్కెల్! జేబు కత్తిరించడానికి కోటు అడ్డంగా వుందా? నాకామాత్రం తెలివి తేటలు లేవనుకోకు. నేను చస్తే కోటు విప్పను!" అనుకొని "నాకేం ఉక్కగా లేదు" అన్నాడు రామం.

గోపాలం మెడతిప్పి పక్కన కూర్చొని వున్న రామం ముఖంలోకి ఆశ్చర్యంగా చూశాడు. "ఎట్లా చూస్తున్నాడో వెధవ తన ప్లాన్‌లో పడలేదని!"

ఇద్దరూ రిక్షా దిగారు. రామం రిక్షాకు సగం చార్జి ఇవ్వబోతే "వుంచండి. వడ్డీతో సహా వసూలు చేసుకుంటాను" అని నవ్వుతూ రిక్షా వాడికి డబ్బు ఇచ్చాడు గోపాలం.

రామం శరీరంలో చలి కుదుపు కలిగింది. "వడ్డీతో సహా వసూలు చేసుకుంటాడట. జేబు కొట్టేస్తానని ఎంత ధైర్యంగా చెబుతున్నాడూ?" రామం కోటు కిందగా వున్న బనీన్ జేబు తడిమి చూసుకున్నాడు. చేతికి ఎత్తుగా తగిలి రిలీఫ్‌గా నిట్టూర్చాడు.

కౌంటర్ దగ్గర ఇద్దరూ నిల్చున్నారు. గోపాలం ముందు నిల్చున్నాడు. టికెట్లుకొని "పదండి వెళ్దాం!" అన్నాడు.

"టికెట్?"

నేను కొన్నాను.

"దొంగవేషాలు! నమ్మకం కలిగించడానికి ప్రయత్నిస్తున్నాడు. ఎంతో కాలంగా పరిచయం వున్నట్టు కలేసుకుంటున్నాడు."

కోటు జేబులో వేరుగా పెట్టిన డబ్బులో నుంచి లెక్క చూసి ఇచ్చేశాడు గోపాలం వద్దన్నా వినకుండా.

బండి గంట లేటని తెలిసింది. కనీసం మరో మూడు గంటలయినా స్టేషన్‌లో వుండాలి.

ఇప్పటి నుంచే స్టేషనులో ఏం చేస్తాం? రండి టీ తాగుదాం!" అంటూ గోపాలం స్టేషనుకు ఎదురుగా వున్న బార్‌లోకి దారితీశాడు. రామం అయిష్టంగానే అతన్ని అనుసరించాడు.

"ఏం సార్! ఈ మధ్య కన్పించటం లేదు?" బేరర్ గోపాలాన్ని నవ్వుతూ పలకరించేడు.

"అవును! చాలా కాలమయింది. రెండు టీ స్పెషల్" అన్నాడు నవ్వుతూ.

రామం ఆలోచనలో పడ్డాడు. ఈ బేరర్ గాడూ, వీడూ కలసి తనను ఏమైనా చేస్తే? ఇంత మంది 'మధ్య పబ్లిగ్గా ఏం చేస్తాడు?

"సిగిరెట్ కాలుస్తారా?"

కాల్చాలని వున్నా "వద్దు!" అన్నాడు రామం. వీడెవరు నమ్మేది? ఆ సిగరెట్‌లో ఏ మత్తు పదార్థమో వున్నా వుండవచ్చు.

బేరర్ టీ తెచ్చి ఇద్దరి ముందూ పెట్టాడు.

స్పెషల్! అన్నాడు! వాడు నవ్వాడు. కోడ్ భాషలా వుంది. తన ముందున్న కప్పులో తప్పక ఏదో కలిపి వుంటాడు. గోపాలం బేరర్‌తో మాట్లాడుతున్నాడు సమయం చూసి తన కప్పు గోపాలం ముందు పెట్టి రెండోది తను తీసుకున్నాడు.

"తాగండి! స్పెషల్ టీ!" నవ్వుతూ అన్నాడు గోపాలం. తను కప్పులు మార్చింది గమనించినట్టున్నాడు కాలాంతకుడు.

గోపాలం తన ముందు వున్న కప్పు తీసుకుని టీ తాగుతూ వుంటే రామం ఆశ్చర్యంగా చూశాడు.

"పెళ్ళయిందా?"

"అయింది. ఒక పిల్లవాడు కూడా?" భార్యా బిడ్డల రూపాలు కళ్ళకు కన్పించగా ఉత్సాహంగా అన్నాడు రామం.

"ఉద్యోగం చేస్తున్నారా?"

"లేదు. బి. ఏ. పాసయాను. వ్యవసాయం చూసుకుంటున్నాను."

"ఒంగోలు పని మీద వెళ్తున్నారా?"

"సంతలో ముర్రా బర్రెల్ని కొనటానికి వెళ్తున్నాను." అని చెప్పబోయి మానేశాడు. "పనేం లేదు. మామయ్యకు సుస్తీగా వుంటే చూట్టానికి వెళ్తున్నాను." అన్నాడు.

"మీకు పెళ్ళయిందా?" రామం మొదటి సారిగా ప్రశ్నించాడు గోపాలాన్ని.

"అయింది. ఒక లక్షాధికారి కూతుర్ని లేపుకొచ్చి




# పుట్టపర్తి వారి "మేఘదూతం" కావ్యానికి అవార్డు



నవయుగ కవి చక్రవర్తి గుర్రం జాషువా సాహితీ అవార్డు పద్మశ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు రచించిన "మేఘదూతము" కావ్యానికి ఇస్తున్నట్లు శ్రీవాణి కళా పీఠం అధ్యక్షులు శ్రీ నిమ్మకంటి రామలింగయ్య ప్రకటించారు.

గుర్రం జాషువా పేరిట కడపలో శ్రీవాణి కళా పీఠం సాహిత్య అవార్డును నిరుటి సంవత్సరము నుండి ఇస్తున్నట్లు ప్రస్తుత సంవత్సరానికి శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులు మాత్రాఛందస్సులో రాసిన "మేఘదూతము" అనే అభ్యుదయ కావ్యానికి జాషువా అవార్డు ఇవ్వాలని కమిటి నిర్ణయించిందని శ్రీ రామలింగయ్య తెల్పారు.

జాషువా జన్మదినమైన సెప్టెంబర్ 28 న కడపలో జరిగే అవార్డు ప్రదానోత్సవ సభలో పుట్టపర్తి వారికి అవార్డు మొత్తం వెయ్యిన్నొక్క రూపాయలు, మెమెంటో అందచేస్తారు

బహుభాషావేత్త, మహా విమర్శకుడు, మహాకవి సంగీత స్వరకర్త అయినటువంటి పుట్టపర్తి నారాయణాచార్యులు జాషువా అవార్డును స్వీకరించడానికి సమ్మతి తెల్పడం వారి వినయానికి ప్రతీకగా నిలుస్తుందని ఆయన అన్నారు

రిజిస్టర్ మారేజ్ చేసుకున్నాను."

రామం గోపాలం ముఖంలోకి నిరసనగా చూశాడు. ఎంతకైనా తెగించిన వాడే! అనుకున్నాడు.

"నేను బ్యాంక్‌లో పని చేస్తున్నాను."

"కొయ్‌రా నాయనా కొయ్." అడక్కుండానే బ్యాంకులో ఉద్యోగం అని చెప్తున్నాడు. తను ఇలాంటి వేలు ఎన్నో రోజుకు చూస్తాననీ, డబ్బంటే తనకు లక్ష్యం లేదనీ నన్ను ఇంప్రెస్ చేయడానికి ప్రయత్నిస్తున్నాడు. చిట్టి నాయన! నాకు బొత్తిగా బుర్ర లేదను కొంటున్నాడు!

"ఏమిటి ఆలోచిస్తున్నారు?"

రామం త్రుళ్ళి పడ్డాడు. చేతిలో వున్న కప్పులో టీ వొలికింది. చెయ్యి చురుక్కు మంది.

"చెమట్లు కారిపోతున్నా ఆ కోటు విప్పరేం? మిమ్మల్ని చూస్తుంటే నాకు బాధగా వుంది." గోపాలం అన్నాడు.

"వుంటుంది! వుంటుంది! ఎందుకుండదూ బాధగా? నీకు కావాల్సింది నేను కోటు విప్పటమేగా. నేను ఆ మాత్రం గ్రహించలేదు అనుకోకు." అనుకున్నాడు. పైకి సమాధానం యివ్వలేదు.

"మీకు డ్రింకు తీసుకునే అలవాటుందా?"

అమ్మబిడ్డా! తాగించాలని చూస్తున్నావా? తాగాలని వున్నా "లేదు నాకు అలవాటు లేదు." అబద్ధం ఆడేశాడు.

రామం. "మీరు చాలా బుద్ధి మంతుడిలా వున్నారు?"

"నాకు చెడు అలవాట్లేమీ లేవు." గర్వంగా అన్నాడు రామం.

"నాకు అన్ని చెడు అలవాట్లూ వున్నాయ్. తాగుతాను. అందుబాటులో వున్న ఆడవాళ్లను ఒదిలిపెట్టను. నా భార్య పరాయి మగాడితో తిరుగుతానంటే చస్తే ఒప్పుకోను. మీలా మంచి అలవాట్లతో మనిషి ఎలా జీవిస్తాడో నాకు తెలియదు. గతాన్ని తలుచుకుంటూ, భవిష్యత్తు గురించి ఆలోచిస్తూ బ్రతకలేను. వర్తమానంలో జీవిస్తాను. ప్రతి క్షణం జీవిస్తాను." విస్కీ గ్లాసు ఖాళీ చేశాడు.

రెండో గ్లాసు కూడ పూర్తి కావస్తోంది. కబుర్లు చెపుతూ, మధ్య మధ్య కూనిరాగం తీస్తూ త్రాగుతున్నాడు.

ఏమిటి? ఇంత తాగేస్తున్నాడు? అంత డబ్బు అతని దగ్గరవుందా?

గోపాలం ముఖంలోకి చూశాడు. కళ్ళు మత్తుగా వాలి పోతున్నాయ్. ముఖం ఎర్రబడింది.

"ఇదీ ఒకందుకు మంచిదే. మరో గ్లాసు కొట్టాడంటే గుర్రం ఎక్కేస్తాడు. ఇక వాడిబొంద. వాడు నన్నేం చేస్తాడు?" ఆలోచనలో పడ్డాడు రామం.

"నా.... నా భార్య.... చాలా... మంచిది. నా కోసం కులం ధనం అన్నీ వదిలేసుకొంది. నేనేం చేసినా సహిస్తుంది...."

"అబ్బాయి గారి పని సగం అయిపోయింది. మరో గ్లాసు పోయిస్తే సరి!" అనుకుంటూ "మరో గ్లాసు తాగుతారా? డబ్బుకు వెనకాడకండి. నా దగ్గరవుంది ఇస్తాను" అన్నాడు రామం ఉత్సాహంగా.

గోపాలం రామం ముఖం లోకి చూశాడు.

"డబ్బు నాదగ్గర కూడా వుంది. మూడువేలకు పైనేవుంది. ఇంత మొత్తం దగ్గర పెట్టుకుని ఇవాళ తాగకూడదనే అనుకున్నాను. కాని వుండలేక పోయాను. ఇందులో వున్న హాయి మీకు అర్థంకాదు. మీలాంటి వాళ్ళను చూస్తుంటే నాకు జాలివేస్తుంది. తాగడం వల్ల కొన్ని నష్టాలు కూడ లేకపోలేదు. అప్పుడప్పుడు వాచీ, పెన్, డబ్బూ పోతూవుంటాయ్" అన్నాడు గోపాలం మూతలు పడిపోతున్న కళ్లను బలవంతంగా తెరుస్తూ.

"వీడు మామూలు దొంగకాదు. గజదొంగ. తెలివైన దొంగ. తన దగ్గిర మూడువేలున్నట్లు నన్ను నమ్మించటానికి ప్రయత్నిస్తున్నాడు. ఒరేయ్! రాస్కెల్. నువ్వు తాగినా తెలివిగానే వున్నావురా. నాకూ వున్నదిరా తెలివి. పైగా తాగలేదు కూడా." కసిగా అనుకున్నాడు రామం.

బేరర్ బిల్లు తెచ్చాడు. గోపాలం పర్సు తీసి వందరూపాయల నోటు యిచ్చాడు.

మొత్తం మీద ఒక వందరూపాయల నోటు వున్నట్టుంది. అది ఎవరి జేబులో నుంచి కొట్టేశాడో!

బేరర్‌కు ఐదురూపాయలిచ్చి గోపాలం లేచినిల్చున్నాడు. తూలి కుర్చీ పట్టుకున్నాడు.

"రామం గారూ! ఈ పర్సు మీ దగ్గర వుంచండి ఇందులో చాలా డబ్బువుంది. నేను మత్తులో వున్నాను. వళ్ళు తెలియకుండా నిద్రపోతే ఎవరైనా తీసేస్తారు." అంటూ పర్స్ అందించాడు.

రామం పర్స్ అందుకున్నాడు. పర్సులావుగానేవుంది. ఓక్షణం రామానికి అతని మాటల్లో నిజాయితీ వున్నట్టు అనిపించింది.

అంతా దొంగ వేషం! తను ఆ పర్సు ఎక్కడ పెడతాడో చూడాలనే ప్రయత్నం. తన జేబుల రహస్యం తెలుసుకోవడానికే ఈ ఎత్తు వేశాడు. తను మాత్రం తక్కువ తిన్నాడా? ఏం? దీన్ని కోటు జేబులోనే పెట్టుకుంటాడు. తనకు వేరే జేబులేలేనట్టు ప్రవర్తిస్తాడు. అయినా వాడి బొంద. ఇందులో ఏముంటుంది గనక. ఏవో పిచ్చి కాగితాలు, బిల్లులూవుండి వుంటాయి.

"ఏమిటి ఆలోచిస్తున్నారు? మీరు ఒంగోలులో దిగిపోయే ముందు నన్ను లేపి ఇచ్చేయ్యండి" అన్నాడు గోపాలం.

రామం పర్స్ కోటు జేబులో పెట్టుకున్నాడు.

"జాగ్రత్త కోటు జేబులో పెట్టుకున్నారు. షర్టుకు జేబు లేదా?" గోపాలం అడిగాడు.

"చిక్కావురా బిడ్డా! నేను ముందే అనుకున్నాను. నువ్వు నా జేబుల రహస్యం తెలుసుకోవడానికే ఈ పర్స్ నాకిచ్చావని" అనుకుంటూ "నా షర్ట్‌కు జేబు లేదండి!" అన్నాడు. ఆ విషయం చెప్పే అవకాశం వచ్చినందుకు రామానికి సంతృప్తిగా వుంది. నిశ్చింతగా వుంది. గోపాలం తడబడుతూనే ప్లాట్‌ఫారం చేరాడు. రామం భుజంమీద చేయి వేసి రైలు

పెట్టెలోకి ఎక్కాడు

బండి బయలుదేరింది సీట్లు చాలా వరకు ఖాళీగానే వున్నాయ్ గోపాలం ఇద్దరు మనుషులు కూర్చోగల స్థలంలో ముడుచుకు పడుకున్నాడు

రామానికి పర్సులో ఎంత వుందో చూడాలనే కుతూహలం కలిగింది బాత్‌రూంలోకి వెళ్ళి నోట్లు లెక్క పెట్టాడు రామం ఆశ్చర్యానికి అంతులేదు మూడు వేలు వున్నాయ్ వాటిల్లో మార్చిన వందరూపాయల్లో మిగిలిన కొన్ని పది రూపాయల నోట్లు కూడ ఉన్నాయ్

రామం తిరిగి సీటువద్దకు వచ్చాడు గోపాలం మంచినిద్రలో వున్నాడు నిద్ర నటిస్తున్నాడేమో అనే అనుమానంతో ముఖంలోకి పరీక్షగా చూశాడు

ఆ ముఖం ఎంతో అమాయకంగా కన్పించింది చిన్న పిల్లవాడిలా ఇంత నిశ్చింతగా నిద్రపోతున్న ఇతను దొంగా? కాదు కాదు తనే అనవసరంగా భయపడ్డాడు అతన్ని అనుమానించాడు.

అయినా రామం తెల్లవార్లూ కూర్చునే వున్నాడు తెలతెలవారు తుండగా ఒంగోలు స్టేషను వచ్చింది

రామం లేచినిల్చున్నాడు బ్యాగ్ తీసుకున్నాడు ఓ క్షణం హాయిగా నిద్రపోతున్న గోపాలం ముఖంలోకి చూసి దిగిపోయాడు

ఆగు! ప్లాట్ ఫారం మీద నడుస్తున్న రామం ఉలిక్కిపడి ఆగాడు

తననుకాదు అరే అతని పర్సు తన దగ్గరే వుండిపోయిందే? తను మర్చేపోయాడు బండి ఆగి వుంది వెళ్ళి ఇచ్చేస్తే? తను బండి ఎక్కగానే అది కదిలితే? పోనీయ్ తర్వాత పంపించవచ్చులే స్టేషన్ బయటికి నడిచాడు. బండి బయలు దేరింది చూస్తూ నిల్చున్నాడు

అతని అడ్రసు తన దగ్గర లేదుగా? ఎలా పంపించడం? అతను తనను గురించి ఏమనుకుంటాడు" దొంగ అనుకుంటాడేమో" అనుకోనియ్! తను నిజంగా దొంగతనం చేశాడా ఏమన్నానా? మరిచిపోయాడు అంతేగా" మనియార్డరు ద్వారా పంపాలంటే అతని అడ్రసు లేదాయె

అబద్ధం నీవు మరిచిపోలేదు. కావాలనే దిగేశావ్ నువ్వు దొంగవు. పరానా దొంగవు లోపల ఏదో అరిచింది

"ఏయ్ నువ్వు నోరుముయ్! నేనేం కావాలని మరిచిపోలేదు నిజంగా నేను మరిచిపోయాను ఇందులో దొంగతనమేముంది? అతనిమీద నాకూ జాలిగానే వుంది ఇలా జరిగినందుకు బాధగానే వుంది "

బుస్‌మని తల ఎత్తిన అంతరాత్మ నెత్తిమీద ఒకటి వేసి దాన్ని పడుకోపెట్టాడు రామం.

* * * *

మళ్ళీ చివ్వున అంతరాత్మ తల ఎత్తి "ఏం ఆరోజు నన్ను కసిరికొట్టావ్‌గా? నిజంగా మరిచిపోతే ఆ డబ్బు ఇప్పుడు ఇచ్చెయ్?" గట్టిగా అరిచింది

దీని సిగ తరగ ఇదొకటి మధ్యలో మాటకు ముందు నేను వున్నానంటూ బయలు దేరుతుంది

"ఎడ్చావ్‌లే నోరు మూసుకో! ఇప్పుడు నా దగ్గర అంత డబ్బు ఎక్కడుంది?"

ఇపుడు లేకపోతేనేం? అతన్ని ఇంటికి తీసుకెళ్ళు రేపు సర్దు "

"మంచి దానివే! రౌడీ వేషం వాడూనూ! పక్కా దొంగలా కన్పిస్తున్నాడు "

' నీకంటేనా?"

"నువ్వు నోరు మూస్తావా లేదా?"

చెవులు గింగురుమనేలా నవ్వింది అంతరాత్మ.

"ఏమిటా పిచ్చి నవ్వు?"

"దొంగ మంచివాళ్ళు దొంగ అంటుంటేనూ " మళ్ళీ నవ్వు

నేను దొంగనా? వాడు మంచివాడా?" ఎవరైనా వింటె నవ్విపోతారు?"

అవును లోకం దృష్టిలో నువ్వు మంచి వాడివి నీకు చాలా మంచి పేరు వుంది పరస్త్రీలను కన్నెత్తి (దొంగ చూపులు తప్ప) చూడవు పదిమందిలో (రహస్యంగా తప్ప) తాగవు చాలా మంచివాడివి ఎవరూ తెలుసుకోలేరంటే తప్పు దొంగతనం, వంకుతనం చెయ్యవు"

"నువ్వు నోరు మూసుకుంటావా? లేక గొంతు పిసకమంటావా?"

"నా గొంతు పదిలెయ్ ఊపిరాడటంలేదు నా కెందుకులే నీ యిష్టం వచ్చినట్లే చెయ్?"

"అలారా దారిక" మాటకు ముందు నేనున్నానంటూ బయలుదేరకు జాగ్రత్త!"

"ఏరా రామం? ఒంట్లో బాగాలేదా? వళ్ళంతా చెమటల్లు పట్టిందేం?" రామం స్నేహితుడు ప్రశ్నించాడు.

రామం తృళ్ళిపడ్డాడు. "ఏదోరా కొంచెం గిల్టీగా వుంది అంటూ కర్చీఫుతో ముఖం తుడుచుకో సాగాడు

"వీరేనా మీ స్నేహితులు మద్రాసు వెళ్తుంది?"

"మళ్ళీ తగలడ్డావ్? అనుకున్నాడు రామం "అవును" అని సమాధానం చెప్పాడు.

"ఇత నెవరు? పైనుంచి కిందకు శల్య పరీక్ష చేస్తూ అడిగాడు రామం స్నేహితుడు

"నా పేరు గోపాలం ఒకప్పుడు బ్యాంక్‌లో పని చేసేవాణ్ని."

"మరి ఇప్పుడో?" రామం స్నేహితుడు అడిగాడు

"నా వేషం కన్పించడంలా? ఇపుడు నిరుద్యోగిని. ఉద్యోగం పోయింది "

"ఏం? ఏం చేశావ్?"

ఏకవచన ప్రయోగానికి ఆశ్చర్యపోతూ ఓ నిముషం అతని ముఖంలోకి చూశాడు గోపాలం.

"క్యాష్ మూడు వేలు పోయింది. ఇక్కడే ఈ విజయవాడ నుండి ఇదే బండి కోసం ఎదురుచూస్తూ పోగొట్టుకున్నాను ఆరోజే ఇన్స్‌పెక్షన్ జరిగింది. వేరే డబ్బు తెచ్చి పెట్టే సమయం కూడ లేకపోయింది. మా బాస్ నోరు పారేసుకున్నాడు కోపంతో నాలుగు తగిలించాను ఉద్యోగం పోయింది. జైలుకు కూడా వెళ్లాను. తిరిగి వచ్చేటప్పటికి నా భార్య పుట్టింటికి వెళ్లిపోయింది దొంగతో కాపురం చేయనని డైవోర్సుకు కోర్టుకు వెళ్ళింది " నవ్వుతూ చెప్పాడు గోపాలం.

రామం ముఖంలోకి చూశాడు

"మీకు ఒంట్లో బాగా లేనట్లుంది. కాస్సేపు కూర్చోండి." అన్నాడు గోపాలం

"అబ్బే! నాకేం లేదు బాగానే వుంది" నంగి నంగిగా అన్నాడు రామం.

"ఇంకా నయమే అతను నన్ను గుర్తుపట్టలేదు. గుర్తుపడితే ఏం చేసేవాడో?"

రామం లోలోపల వణికిపోతున్నాడు.

బండి వచ్చింది రామం స్నేహితుడు ఎక్కాడు. బండి కదలబోయేముందు రామం భుజంమీద చేయి వేసి

"వస్తానండీ రామంగారూ!" అన్నాడు గోపాలం

రామం అదిరిపడి గోపాలం ముఖంలోకి చూశాడు.

గోపాలం కదులుతున్న బండి ఎక్కి, డోర్ దగ్గర నిలబడి నవ్వుతూ చెయ్యి వూపాడు.

రామం అప్రయత్నంగా రెండు చేతులు జోడించి నమస్కరించాడు.

(4-7-'75 ఆం. స. వా. ప. నుంచి)

## నాబాట

నేనొక,
పూటకూటికి
గతిలేని పాటగాణ్ని!
బ్రతుకు మెతుకుకై,
నేర్చాను ఓ చిన్నపాట.
ఆ పాటంతా,
తేట తియ్యదనాల ఊట!
పాట విన్నవారిది-
ఆహ్లాదపు బాట!
మరి, నాబాట...?
ఏ పూటకీ గతిలేని,
జన కారుణ్యతలేని
ఎచ్చోటో.....!

\- ప్రకృతి

కొత్త శీర్షిక ప్రారంభం!



# ప్రశ్నలు జవాబులు



అడ్వొకేట్
బి. భాస్కరరావు
ఎం. ఎ., ఎల్. ఎల్. బి.

## జె. చంద్రశేఖర్, ఆదోని

ప్రశ్న – నేను ఒక షాపు గుమస్తాగా పనిచేస్తూ వుంటిని నా యొక్క మేనేజిమెంట్ వారు నష్టంలో వుందని నన్ను ఉద్యోగం నుండి తీసివేసినారు నేను కర్నూలు అసిస్టెంట్ కమీషనర్ ఆఫీసులో కేసు దాఖలు చేసి వుంటిని అసిస్టెంట్ కమీషనర్ నన్ను తిరిగి వుద్యోగంలో చేర్చుకొమ్మని వుత్తర్వులు ఇచ్చినప్పటికి కంపెనీ మేనేజిమెంట్ ఏ విషయము తెలియపర్చ లేదు నేను తిరిగి షాపు చట్టం ప్రకారం అనంతపురం లేబర్ కోర్టులో కేసును దాఖలు చేయవచ్చునా?

జవాబు: మీరు ముందుగా యాజమాన్యం వారికి లాయర్ నోటీస్ పంపించండి. 15 రోజులలో మీకు జవాబు రానట్లు అయితే మీరు అనంతపురం లేబర్ కోర్టులో కేసును తిరిగి దాఖలు చెయ్యండి. 1986లో ఇచ్చిన ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ఫుల్‌బెంచ్ తీర్పు 30 6.89 తేదీ ఆంధ్ర సచిత్ర వారపత్రికలో "న్యాయపీఠం" శీర్షిక క్రింద ప్రచురించారు ఆ తీర్పు ననుసరించి మీరు కేసు దాఖలు చెయ్యవచ్చును.

## బి. రాజమణి, సంగారెడ్డి

ప్రశ్న – నేను సంగారెడ్డిలో నివసించు చున్నాను నా ఇంటి ప్రక్క ప్లాట్ అతను ప్రస్తుతము ఇల్లు కట్టుకొనుచున్నాడు అతను నా ప్లాట్‌లో కొంత స్థలాన్ని ఆక్రమించి తన ఇంటికి మెట్లు వేసుకున్నాడు అడిగితే దౌర్జన్యకరంగా ప్రవర్తిస్తున్నాడు నా స్థలము నాకు దక్కవలెనంటే నేనేమి చేయాలి? దీనిని ఎదుర్కొనుట ఎలాగునో తెలియ జేయగలరని కోరుచున్నాను

జవాబు: మీరు పూర్తి వివరాలు ఇవ్వలేదు. మీరు ఇంటిలో నివసిస్తుండగా మీ ప్రక్క ప్లాటు అతను మెట్లు వేసుకున్నాడా? మెట్లు వేసుకుంటే కోర్టుకు వెళ్ళవలసినది. ఆ పని చెయ్యలేదు. ఇక ప్రహరీ గోడ మీరు కట్టలేదని తెలుస్తున్నది. ప్రహరీ గోడ వుంటే మెట్లు ఎలా కడతాడు? మీరు మీ ఇంట్లో నివసిస్తున్నారా? మీరు మీ ఇంట్లో నివసిస్తూ వుండి మీ ప్లాట్‌లో మెట్లు కట్టుకొని పోతూవుంటే వూరుకున్నారు. ఇకనైనా మీ ఇంటి చుట్టూ ప్రహరీ గోడ కట్టండి. వెంటనే మీ క్రయ చీటీ పత్రాలు జతచేసి కోర్టులో దావా వెయ్యండి. మెట్లు కట్టకుండా ఇంజక్షన్ పిటిషన్ కూడా పెట్టండి. మెట్లు కట్టడం పూర్తి అయితే కొట్టి వేస్తారు. మీకు ఇప్పటికే నష్టం జరిగింది గనుక ఆలస్యం చెయ్యకుండా కోర్టులో దావా వెయ్యండి.

## గొట్టాపు దుర్గారావు, గోపాలపురం (పశ్చిమ గోదావరి జిల్లా)

ప్రశ్న:– ముచ్చిలుక పేరిట నాకు అన్యాయం జరిగింది. పరిష్కారం ఏమిటి?

జవాబు: మీరు ఆరు సంవత్సరముల వరకు మీ పొలమును లీజుకు ఇవ్వవచ్చును. ఆ తర్వాత ఆరు సంవత్సరములు మళ్ళీ లీజుకు ఇవ్వాలి. మీరు స్వయముగా వ్యవసాయము చేసుకుంటాము అంటే లీజు కాలము అయిపోయిన తర్వాత కోర్టుకు పిటీషను పెట్టుకోవాలి.

## ఎం. కె. వి. సీతారామ్, విశాఖపట్నం–5.

ప్రశ్న ఒక ఆమె/అతను "ఆత్మహత్య" చేసుకుంటూ తన మరణానికి పలానా ఆమె/అతను కారణమని రాస్తూ ఒక చీటీ పెట్టి ఆత్మహత్య చేసుకుందనుకోండి ఆమె/అతనికి కోర్టు శిక్ష విధిస్తుందా? ఇలాంటి సంఘటనలు ఎప్పుడైనా మన ఆంధ్రాలో జరిగాయా? చెప్పరూ?

జవాబు· భారతీయ సాక్ష్య చట్టంలోని 32(1) సెక్షన్ ప్రకారం ఆత్మహత్య చేసుకున్న వ్యక్తి ఉత్తరం రాసినట్లయితే అన్ని సాక్ష్యాధారాలు పరిశీలించి కోర్టు తప్పక శిక్ష విధిస్తుంది పాకల నారాయణస్వామి కేసులో

ఉత్తరాల ఆధారంగా హత్య జరిగినట్లు అప్పటి ప్రీవీ కౌన్సిల్ 1939లో శిక్ష విధించింది అదేవిధంగా సుప్రీంకోర్టు కూడా షరద్(మహారాష్ట్ర) కేసులో 1984లో శిక్ష విధించింది 32(1) సెక్షను హత్యకు, ఆత్మహత్యకు కూడా

వర్తిస్తుందని సుప్రీంకోర్టు పేర్కొన్నది. పాకల నారాయణస్వామి కేసులో బరంపురంలో (ఒరిస్సా) హత్య జరిగినా ఆంధ్రాలోని పిఠాపురంతో సంబంధం వున్నది మధ్యప్రదేశ్ హైకోర్టు కూడా 1987లో పై కేసులు ఉదహరించి తీర్పు చెప్పింది.

## కె. విఠల్‌రావు, సికిందరాబాదు.

ప్రశ్న: యాజమాన్యం నుండి నాకు రావలసిన జీతము, ఇతర భత్యాలు వసూలుచేసుకొనడానికి పారిశ్రామిక వివాదాల చట్టంలోని సెక్షన్ 33 సి (2) క్రింద లేబర్‌కోర్టుకు పిటిషన్ పెట్టదలచాను, నాకు రావలసిన మొత్తముపై వడ్డీ కోరడానికి అవకాశం వున్నదా? లేనిపక్షంలో యాజమాన్యంవారి ఆలస్యానికి నేను ఎటువంటి రిలీఫ్ కోరవచ్చు?

జవాబు: రావలసిన జీతభత్యములకు వడ్డీ రాదు. అయితే కోర్టు ఆదేశములు యాజమాన్యం నిర్లక్ష్యం చేసినప్పుడు వడ్డీ కోరవచ్చును. ●

# వారఫలం

## 1-9-1989 శుక్రవారం మొదలు
## 7-9-1989 గురువారం వరకు

**మేషం :** 'మన పద్ధతి మనదే'నని, మార్పు లేదని భీష్మించుకోరాదు. ముందు వెనుకలు ఆలోచించి కార్యక్రమానికి దిగాలి. కొందరు యిల్లు మార్చ యత్నిస్తారు. వ్యాపారాన మేలే. శుభదినాలే. గ్రహించాలి. స్త్రీలకు: ధనలబ్ధి, ఉత్సాహజనకం.

**వృషభం :** రెండు మూడు వ్యవహారాలు గురువారానికి సానుకూలం కాగలవు. ఎవరెవరిని కలుసుకోవాలో యత్నించి, ముగించి, లాభం పొందండి. మిత్రులు హఠాత్తుగా కలసికోనున్నారు. స్త్రీలకు: అపూర్వ వస్తుసేకరణకు ఆస్కారం.

**మిథునం :** వ్యవహార రీత్యా అనుకూలం. రాజకీయంగా ప్రయత్నాలకు దిగండి, మేలైన సమయంగా గ్రహించండి. ధనలోపంలేదు. పదిమందిలో ప్రతిష్ఠకు లోపం లేదు. స్త్రీ మూలకానందం వున్నది. స్త్రీలకు: ధనలబ్ధి, శుభ ప్రస్తావనలుంటాయి. గ్రహించాలి.

**కర్కాటకం :** దూర ప్రాంతాలకు వెళ్లవలసిన అవశ్యమున్నది. సభారంగాన ప్రసిద్ధి ఏర్పడనున్నది. రాజకీయంగా అనుకూలమున్నది. పెద్ద హోదా పదవికి వెళ్లతారు. స్త్రీలకు: వృత్తియందు మెరుగు, ఉద్యోగలాభం, వస్తుసేకరణకు ఆస్కారం.

**సింహం :** శుభదాయక వారం. బంధుమిత్రుల సమాగం. వ్యాపారాన అధిక లాభదాయక దినం. రాశియందలి 'కేతు' గ్రహం క్రమంగా మేలు చేయనున్నాడు. గ్రహించండి. ప్రసిద్ధులైన చిరకాల మిత్రులు, ఆత్మీయులు యింటికి రాగలరు. చిత్రరంగాన యత్నిస్తే సదవకాశాలు లభిస్తాయి. స్త్రీలకు : ఫ్యాక్టరీలందు, బ్యాంకులందు, కర్మాగారాలందు శ్రమించువారికి మేలే.

**కన్య :** దూర ప్రాంతాలకు వెళ్లవలసిన అగత్యం ఏర్పడుతుంది. ప్రయాణం ముగియువరకు బహు జాగ్రత్తగా సంచరించాలి. కొందరు 'విమాన' యానం రద్దు చేసినా మంచిదే. 'కాలం కానినాడు మొనగాడు కూడ హాయిగా ఉండలేడు' చతుర్థ శని ఏమి మేలు చేస్తాడు! అని మీరే గ్రహించి ఉంటారు. స్త్రీలకు: వృత్తియందు అనుకూలత, నాట్య నాటకరంగాలందు అనుకూలత, సంగీత పాఠకులకు అనుకూలం, గ్రహించాలి.

**తుల :** రాజకీయాలు ఏ విధంగా మీకు అనుకూలించనేరవని గ్రహించాలి. బంధుమిత్రులు యింటికి రానున్నారు. శుభ వ్యవహారాల గూర్చి చర్చలుంటాయి. కొందరి యింట నిశ్చితార్థం కూడా జరుగనున్నది. స్త్రీలకు: ఆదరణ, ఆదాయం, అపూర్వ వస్తుసేకరణ.

**వృశ్చికం :** ఇచ్చిన పైకం వసూలయిన దాకా బాధేగా! ఇంకా కొంతకాలం జరిగితే గాని దానంతట అదే మొత్తంగా యిల్లు చేరే అవకాశం లేదు. ఆదాయానికి మించిన అధిక వ్యయం కూడ చెప్పదగిన అంశమే. అతిథి అభ్యాగతులను ఆదరించుటకు, అభిషేకాదులకు ఆస్కార వారం, గ్రహిస్తారుగా! స్త్రీలకు: వస్త్రములో, వస్తువులో, కనీసం వాహనమో అందుట నిశ్చయం.

**ధనుస్సు :** ఏదిఏలాగున్న రాశియందే వక్రించిన 'శని' ఉన్నాడుగా! 'ఏలినాటి శని' బాధానివారణకు ఇంకా కొంతకాలం వున్నదని గ్రహించాలి. ఏదారి సుగమమో గ్రహించాలి. కొందరకు చలనచిత్ర రంగాన సదవకాశాలుంటాయి. స్త్రీలకు: అధికార వృద్ధి, అనుకూలమిత్ర సమాగమం.

**మకరం :** ఆదాయమున్నది. ఏంలాభం? అంతకు అంత ఖర్చు వున్నది, గ్రహించాలి. సాహితీరంగాన ప్రజ్ఞగలవారికి చక్కని అవకాశాలు. రచనా చాకచక్యానికి వికాసమున్నది. స్త్రీలకు: యత్నిస్తే నూతన ఉద్యోగానుకూలత, బంధుమిత్ర సమాగమం, గ్రహించండి.

**కుంభం :** 'శని' అనుకూలుడు, ఏలాభదాయక వ్యవహారమైన సానుకూలం కానున్నది. సభారంగాన ప్రసిద్ధి, ధనలబ్ధి, ఉద్యోగాభివృద్ధి, వృత్తియందు పెంపు గ్రహించాలి. స్త్రీలకు: ధనాదాయం, ఆరోగ్య వృద్ధి, చాలాకాలంగా కనిపించని మిత్రులు ఇంటికిరావటం గ్రహిస్తారు. చాలదా వారఫల విశేషం.

**మీనం :** గురుగ్రహోశిస్సులున్నాయి. గ్రహానికి రాశినుండి చతుర్థ స్థితి శ్రేయోదాయకం! జాయింటు వ్యాపారం బాగా కొనసాగనున్నది. తెల్లని వస్తువులకు అధిక ఆదరణ లభ్యం కానున్నది. రాజకీయాలు మీకు లాభించే వారంగా గ్రహించి ప్రాకులాడండి. స్త్రీలకు : ఉద్యోగరీత్యా మేలే.

-విద్వాన్ కోటసత్యరంగయ్యశాస్త్రి

## కొత్త శీర్షిక

## ఆంధ్రసచిత్రవారపత్రిక

"న్యాయపీఠం" శీర్షిక క్రింద పాఠకుల సందేహాలకు సమాధానాలు ప్రారంభించ దలిచాము !

మీ ప్రశ్నలు క్లుప్తంగా - సూటిగా - సాధ్యమైనంత చిన్నవిగా వుండాలి. ఈ క్రింది కూపన్ నింపి మీ ప్రశ్నకి జతచేయాలి. ప్రశ్న క్రింద కూడా మీ పేరు, పూర్తి పేరూ రాయాలి- మీ పూర్తి చిరునామా, పిన్‌కోడ్ వెయ్యాలి. జవాబులు ఇవ్వదగిన ప్రశ్నలకు ప్రముఖ న్యాయవాది - న్యాయశాస్త్ర విషయాల గ్రంథకర్త అయిన - శ్రీ బి. బి. రావు - జవాబులు ఇస్తారు.

- - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - -

న్యాయపీఠం - ప్రశ్నపత్రం

ప్రశ్న పంపినవారి పే[రు]...................................

చిరునామా...................................

- సం.

ACC. NO.
CL. NO
LANGUAGE
DATE

# బాబోయ్!... దెయ్యాల కథల పోటీ!

## ఆంధ్రసచిత్ర వారపత్రిక

## రూ. 3000 బహుమతులు!

ఈసారి దీపావళికి-కొత్తరకం కథల పోటీ పెడుతున్నాం!

మూడే కథలు మూడే బహుమతులు!

| |
|---|
| మొదటి బహుమతి రు. 1300లు. అక్షరాల పదమూడు వందల రూపాయలు |
| రెండవ బహుమతి రు. 1000 లు. వెయ్యి రూపాయలు. అక్షరాల |
| మూడవ బహుమతి రు. 700లు. అక్షరాల ఆరున్నొక్క వందల రూపాయలు. |

సూచనలు నిబంధనలు గట్రా :

తేట తెనుగులో తెనుగుదేశ వాతావరణంలో

*1) ఉత్కంఠ భరితంగా 2) చమత్కారయుతంగా 3) కొసవిరుపో తుదిమెరుపో ఉండేలాగా*

*ఆరు అరఠావులకి తగ్గకుండా పన్నెండు అరఠావులకి దాటకుండా " కథ" అల్లాలి!*

* మూఢనమ్మకాలు గాఢనమ్మకాలు అనే తర్కవితర్కమేల? కథ లక్షణాలున్న చదువుతున్నంతసేపు వెనక్కు తిరక్కుండా చదివించగల కథలు రాయండి!

* ఈ కొత్తరకం కథల పోటీ మీ ఉపజ్ఞకి ఊహాకి అనుభవానికి కూడా ఒక సవాల్‌గా భావించండి తప్ప దెయ్యాలున్నాయా? లేవా? అన్న 'రీసెర్చ్' అనవసరంగా మొదలెట్టకండి!

* మీరంతా టాలెంటున్న రచయితలు. అటా? యిటా? అన్న సమస్య లేకుండా ఒకే 'యిటు' ఆంధ్రసచిత్ర వారపత్రికకి పంపగల కథలు మీచేత రాయించాలనే మా యీ ప్రయత్నం! విజయీభవ అంటూ బయలుదేరండి! కవరు మీద 'దెయ్యాల కథల పోటీ కోసం' అని వ్రాయండి !

షరాలన్నీ మామూలే: కథ కాపీ కారాదు. ప్రచారం ప్రసారం ప్రచురణ అయినది కారాదు. పూర్తి చిరునామా తప్పక యిచ్చునది, హామీ పత్రం పెట్టునది అయివుండాలి. మరువకండి.

-ఎడిటర్
ఆంధ్రసచిత్రవారపత్రిక

కథలు పంపవలసిన చిరునామా ఎడిటర్, ఆంధ్రసచిత్ర వారపత్రిక, గాంధీనగర్, విజయవాడ-520 003

**ముగింపు తేదీ : 4 అక్టోబరు 1989**

ACC. NO.
CL. NO.
LANGUAGE
DATE:

సీరియల్

# శత్రుసంహారం

లల్లాదేవి

ఇంతవరకూ సాగిన కథ-12. పరమవీర చక్ర అవార్డు అందుకున్న మహేష్‌చంద్ర కొడుకు రాహుల్ వైమానికదళంలో పైలట్‌గా చేరుతాడు. తల్లి, భార్య కారు ప్రమాదంలో మరణిస్తారు. కుమార్తె సుషుమ్న దగ్గరున్న ఎలక్ట్రానిక్ ఇండికేటర్ వంటి పరికరం వల్లనే సంపత్ మాస్టారి కుటుంబం విచ్ఛిన్నమైందని తెలుసుకున్న రాహుల్ తన కుటుంబ సభ్యుల మరణానికి సంబంధించిన వివరాలను సేకరిస్తుంటాడు. కొరవెల్లి విమాన ప్రమాదానికి సంబంధించి క్రూబాక్స్‌లోని ఇండికేటర్‌ను దొంగిలించిన అలయన్స్ సంస్థపై కన్నువేసిన ఎ. ఎస్. పి. కారంత్ హత్యకు గురవుతాడు. హంతకుల కోసం పోలీసుల వేట ప్రారంభిస్తారు. అలయన్స్ సంస్థ అధిపతి దేవీప్రసాద్ ఆదేశంపై పీయూష కిడ్నాప్ చేసిన నర్సులను రాహుల్ రక్షిస్తాడు. రాహుల్ కూతురు సుషుమ్నని ఎత్తుకుపోయే ప్రయత్నంలో వుంటారు సైతాన్‌దళం.

(గత సంచిక తరువాయి)

ఇబ్రహీం అతని సైతాను దళం చేసిన హత్యలు, దహనకాండ, లూటీల వల్ల ఆ వీధిలో చాలా భయంకరమైన పరిస్థితి నెలకొంది. వీధిలో నివసించేవారు ఇంకా షాక్ నుంచి బయటపడలేదు.

అప్పుడే ఫైరింజన్లు వచ్చి తమ పనిని ప్రారంభించాయి. నగర కమిషనర్ ఆదేశాలు అందుకుని పోలీస్ పారా మిలిటరీ దళాలు కూడా ఆ వీధికి వచ్చి చేరుకున్నాయి.

అంతమంది అధికారులు రావటం, ఇంచుమించుగా తెల్లవారబోతూ ఉన్న సమయం కావటం స్థానికులకు కొంత ధైర్యాన్ని ఇచ్చింది. నెమ్మదిగా తలుపులు తెరుచుకుని వీధిలోకి వచ్చి తమ గోడు వివరించుకోవటం ప్రారంభించారు.

ఎవరికి వారు తమ ఇంటిలో జరిగిన దారుణాల గురించి గోలుగోలున విలపిస్తూ చెప్పుకుంటున్నారు. నాగరిక జీవితం ఛిన్నాభిన్నమై పోయింది కొద్ది గంటలసేపు.

రక్షించే నాధుడు అప్పుడు కన్పించలేదు. ఎదిరించే ధైర్యం లేదు. ఎడారిలా అయిపోయింది ఆ ప్రాంతం.

కమిషనర్‌తోపాటుగా రాహుల్ క్రిందికి దిగి వచ్చాడు. పోలీసులు సేఫ్టీ సైరన్ ఇచ్చారు. ఫైరింజన్ గంటలు మ్రోగాయి. బయటకు వచ్చేందుకు ఇంకా భయపడుతున్న వారి గుండెలు కుదుటపడ్డాయి. అందరూ కమిషనర్‌ని చుట్టుముట్టారు.

అక్కడ కొద్ది గంటలపాటు సాగిన పైశాచిక హేల గురించి వింటున్న వారి గుండెలు జలదరించాయి. కమిషనర్‌కి సైతం కన్నులు చెమరించాయి. ఇన్‌వెస్టిగేషన్ మొదలుపెట్టాడు.

"అసలీదాడి ఎక్కడ ప్రారంభమయింది?" అని అడిగాడు. స్థానికులు కమిషనర్‌ని ఓ ఇంటి దగ్గరకు తీసుకొనిపోయారు. దాడి చేసినవారు వెళ్లిపోయాక వివరాలు తెలుసుకోవటం కాక మిగిలింది ఏముంది వారికి ? ఒక్కరినయినా పట్టుకోలేకపోయామనే బాధతో కృంగిపోతున్నాడు కమిషనర్.

పూర్తి వివరాలు సేకరిస్తే పట్టుకునేందుకు ఒక్క ఆధారమయినా దొరకవచ్చుననే ఆశతో వున్నాడు.

స్థానికులు చూపిన ఆ ఇల్లు బూడిద కుప్పగా మిగిలింది. ఆ భస్మరాసుల మధ్య నాలుగు శవాలు పడిఉన్నాయి. ఒక నిండు చూలాలు శరీరమంతా కాలిపోయి ఉంది. ఆమె శవంలో మరో శిశువు శవంకూడా ఉండి ఉండాలికదా ! కమిషనర్ కూడా చూడలేక చూపులు మరోవైపుకు మరలించుకున్నాడు క్షణం సేపు.

"ఈ ఇంటి దగ్గరే ప్రారంభమయింది దాడి" ఓ వృద్ధుడు చెప్పాడు. ఆ ఇంటికి నిప్పు పెట్టటమే కాదు, ఏమీ మిగలకుండా చేసేందుకు చుట్టూ ఇళ్లని కూడా కాల్చేశారు. కేవలం ప్రేక్షకుడు అయిన ఆ వృద్ధుడు నిండు చూలాలి శవాన్ని చూపుతూ కన్నీరు పెట్టుకున్నాడు.

"ఈ అమ్మాయి పసి వయసునుంచి నా భుజాల మీదే పెరిగింది. ఈ వీధికే ఓ అలంకారం లాంటి అమ్మాయి. పాపం బీదవాళ్లు. ఒక యువకుడికి నాలుగవ భార్యగా కట్టబెట్టారు. తలవొంచుకు వెళ్లిపోయింది. సంవత్సరం తర్వాత గర్భిణితో, రోగాలతో చిక్కి శల్యమైపోయి జీవచ్ఛవంలా తిరిగి వచ్చింది. భర్త ఆగడాలు, సవతుల రాపిళ్లు అన్నీ భరించింది. అయినా భర్తతో ఉంటానంది.

చావు బ్రతుకులు అన్నీ నీతోనే జరిగిపోవాలని మా అందరి ఎదుటా కాళ్లు పట్టుకొని బ్రతిమాలింది. ఏడ్చింది.

అయినా ఆ కిరాతకుడు నిర్దయగా ఆమెను వదిలి వెళ్లాడు.

కొన్నాళ్లు రాయబారాలు నడిచాయి. దుర్మార్గుడి గుండెలు కరగలేదు. ఈ కర్ఫ్యూ కాళరాత్రిని అతను బాగా ఉపయోగించుకున్నాడు. చీకటి పడిన చాలాసేపటికి కొంత మందితో వచ్చాడు. ఆమెను వీధిలోకి తీసుకు వచ్చాడు. ఈడ్చాడు. డొక్కలో కాలితో తన్నాడు. రక్తమాంసాలు దూసుకు పడుతున్నా జాలిచూపలేదు కమిషనర్‌గారూ ! అందరూ చూస్తూనే ఉన్నాం. అడ్డుపడి ఆపే

ఈ సీరియల్ సమర్పిస్తున్నవారు
త్రివేణి నట్ పౌడర్ మాన్యుఫాక్చరింగ్ కంపెని
మచిలీపట్నం.

శక్తి మాత్రం ఎవరికీ లేకపోయింది.

తన తప్పు బయటపడకుండా అందరినీ ఇంటిలోకి నెట్టి, గొళ్లెంపెట్టి నిప్పంటించాడు. ఈ నగరం విడిచి దూరంగా పోతామని బ్రతిమాలినా వినలేదు. అందరూ సజీవంగా దహనమయ్యారు. అంతటితో అతని పని అయిపోయిందని అనుకున్నాం.

కాని అప్పుడే అసలు కార్యక్రమం ఆరంభమయింది. ఇళ్లని లూటీ చేయటం, అడ్డుపడినవారిని చంపటం. గుర్తులు కనిపించకుండా ఉండటం కోసమే ఇళ్లను తగులబెట్టడం. మీరు రాబోయే ముందు వరకూ సాగిన బీభత్స కాండ నరకాన్ని తలపించింది. ఎవరికివారు భయం గుప్పెట్లో ప్రాణాలు బిగపట్టుకొని ఉన్నాం. మేమిప్పుడు కొన్ని దశాబ్దాలు వెనక్కి పోయాం.

మళ్లీ మామూలు మనుషులం కావటమనేది ఈ తరంలో జరగదు" అంటూ హీనపడిపోయి క్షీణించిపోయిన కంఠస్వరంతో వివరించాడు.

ఈ విషాద కథ అక్కడ అందరికీ కన్నీరు తెప్పించింది. విలపించని వారు లేరు. కొందరు కన్నీటితో చెంపల్ని తడుపుకున్నారు. మరికొందరు కన్నీటితో గుండెల్ని తడుపుకున్నారు. కొందరు పైకి విన్పించేలా ఏడుస్తున్నారు. మరికొందరు మౌన రోదనలు సాగించారు. అందరూ దుఃఖంలో మునిగిపోయినవారే !

"అవును బాబుగారూ ! ఇది ఒక కారణం, ఒక లక్ష్యం ఉండి చేసిన దురాగతం. కాని అకారణంగా ఆ ఇళ్లలో చేసిన ఘాతుకాలు చూడండి" అంటూ తమ ఇళ్లవైపు ఆహ్వానించింది మరో వృద్ధురాలు.

రాహుల్ వంక చూచాడు పోలీస్ కమిషనర్.

"వెడదాం పదండి" ముందుకు సాగారు రాహుల్. ఒక దండులా అందరూ ఆవైపు కదిలారు. ఫైర్ పార్టీవారు పనిచేస్తున్నారు. పారా మిలిటరీ పోలీసులు తమతమ తక్షణ సహాయం అందిస్తున్నారు.

చేతనయినంతలో ఫస్ట్‌ఎయిడ్ చేస్తున్నారు.

కాస్తంత నిబ్బరం వచ్చింది. అన్ని ఇళ్ల తలుపులూ తెరుచుకున్నాయి.. అందరూ సాయం అందుతుందన్న ఆశతో వీధుల్లోకి వచ్చారు.

దండులా కదిలిన అధికారులు, జనం ఓ ఇంటిముందు ఆగారు. ఇల్లు పూర్తిగా తగలబడి ఉంది. శవాలు వరుసగా పడుకోబెట్టి వున్నాయి. వయసులవారీ బేధం తెలుస్తోంది.

"ఈ ఇంటిమీద దాడి చేశారు బాబూ ! ఆస్తి అంతా అప్పగించాం. పోతూ ఈ



## మీ జి. కె. ఎంత?

(1) ఇప్పటి వరకు ఎంత మంది "ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రులు" కాంగ్రెస్ అధ్యక్ష పదవిని కూడా అధిరోహించారు?

(2) 'అగ్ని' ప్రయోగం ద్వారా భారతదేశం ఇటువంటి శక్తి (ఐఆర్‌బిఎమ్ శక్తి) కలిగిన ఆరవ దేశం అయింది? మిగిలిన అయిదు దేశాలు ఏవేమిటి?

(3) ప్రస్తుతం "కంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్" ఎవరు? అతనికి జీతం ఎంత?

(4) "అభహాస్ కుమార్ గంగూలీ" అనేది ఎవరి అసలు పేరు?

(5) ప్రపంచంలో అత్యంత ఎక్కువ, అత్యంత తక్కువ అక్షరాలు గల భాషలేవి?

(6) స్వాతంత్ర్యం వచ్చిన తరువాత నోబెల్ బహుమతి పొందిన భారతీయ వ్యక్తి ఎవరు?

(7) మొట్టమొదటి అలీన దేశాల సమావేశం ఎప్పుడు. ఎక్కడ జరిగింది?

(8) టి.వి "మహాభారత్"లో 'కాలం' గొంతు ఎవరిది?

(9) ఇప్పటి వరకు రెండు సార్లు అంతరిక్ష యానం చేసిన మహిళలు ఎవరు?

(10) "ఫాదర్ ఆఫ్ సోవియట్ హైడ్రోజన్ బాంబ్" అని ఎవరిని అంటారు?

—వీరజైకిరణ్

(జవాబులు ఈ సంచికలోనే)

ఘోరం చేశారు. ఎవరిని అనాలి. ఈ బాధ అన్నీ ఏ దేవుడు తీర్చాలి బాబూ ! ఇది ఊరా? వల్లకాడా ?" అని ప్రశ్నించింది ఆ వృద్ధురాలు.

ఎవరూ మాట్లాడలేదు. మరో ఇంటి వైపు కదిలారు.

లూటీ జరగని ఇల్లు లేదు. రక్తసిక్తం కాని వాకిలి లేదు. ఆ వీధిలో మృత్యువు పదఘట్టని జాగా అసలు లేనే లేదు.

అంతా చూడటం నష్టాలు అంచనావేయటం పూర్తి అయింది. ఎప్పుడు తెల్లవారిందో, ఎప్పుడు పొద్దుపొడిచిందో ఎండ చుర్రుమనిపిస్తోంది. అధికారులందరికి అవసరమయిన ఆదేశాలు అందించాడు సిటీ పోలీస్ కమిషనర్! నగరంనాలుగుమూలలనించి అక్కడికా వార్తలు అందుతున్నాయి.

దోపిడీ కొన్ని కోట్లకు జరిగింది, జన నష్టం వందల్లో ఉంది. కనిపిస్తే కాల్చివేత ఉత్తర్వులు సడలించే వీలులేకుండాఉంది. కర్ఫ్యూ నిరవధికంగా పొడిగించటం తప్ప మరోదారి లేదు.

ఇంకతాను కార్యాలయంలో ఉండాలి. నగరం నాలుగుమూలల జరిగిన ఘాతుకాలకు ఓదార్పు అందించాలంటే అదే దారి.

కమిషనర్ వెనుదిరిగి వచ్చారు. కారులో కూర్చున్నారు. ప్రక్కనే కూర్చున్నాడు రాహుల్. అతని ముఖం విషాద ఛాయలతో నిండిఉంది.

"మీరు ఫ్రంట్ లైన్‌లో పనిచేస్తూ ఉంటారు కదా! ఇలాంటి దృశ్యాలు ఎప్పుడయినా చూచారా?" అని అడిగాడు కమిషనర్!

కొద్ది క్షణాలు గంభీరమయిన మౌనాన్ని పాటించాడు రాహుల్!

"సర్! ఇది చాలా దారుణం. నాగరికులు నివసించే అర్బన్ ప్రాంతాల్లో ఇలా జరిగే అవకాశముందని ఎవరూ ఊహించనయినాలేదు. నాకు ఒక విషయం స్పష్టంగా అర్థమవుతోంది.

భారతదేశానికి శత్రువులు సరిహద్దుల అవతల ఉన్నారేమో కొద్దిమంది. కాని అసలు శత్రువులు సరిహద్దుల లోపలే భారత సమాజంలో కలిసిపోయి వున్నారు. ఒక సైనికుడుగా ఆలోచిస్తున్నాను.

నేను పోరాడవలసింది సరిహద్దుల్లోకాదు. దేశంలోపలే నా పోరాటాన్ని సాగించాలని నిర్ణయించుకున్నాను.

ఆ బాస్టర్డ్ ఇబ్రహీం భార్యని దుర దృష్టానికి బలిచేశాడు. సమాజానికి రాచకురుపువాడు. ఆ దుర్మార్గుడి చరిత్రని కూకటి వేళ్ళతో పెకిలించివేయటానికి నేను తీర్మానించుకున్నాను.

వాడిని వాడి ముఠా అంతటిని భూస్థాపితం చేసిందాకా నిద్రించనని సైనికుడుగా నేను శపథం చేస్తున్నాను. అవసరమయితే ఈ ప్రయత్నంలో నా తను మనః ప్రాణాలను బలియిస్తాను" రాహుల్ ముఖం ఉద్విగ్నంగా అయింది. కళ్ళు విశాలంగా అయినాయి

నిలువెల్లా మండిపడుతున్న అగ్నికణం అయాడు.

"మీరు ఎక్కడ దిగిపోతారో చెప్పండి" అతని ఆవేశాన్ని రవంత శాంతింపచేయాలని అన్నాడు కమిషనర్!

"శంకరకృప కాంప్లెక్స్ దగ్గర దిగిపోతాను" దాడులు జరిగిన లిస్టులో ఆ ప్రాంతం కూడా ఉన్నట్టు అనుమానం వచ్చింది అధికారులు తెచ్చియిచ్చిన ఫైలు తెరిచి చూచాడు కమిషనర్!

"అవును. ఎగ్జాక్ట్‌లీ! శంకరకృప కాంప్లెక్స్ అయిదోనంబరు బ్లాకుమీద కూడా దాడి జరిగింది" అన్నాడు. ఆమాటవిన్న రాహుల్ అగ్నిహోత్రుడులా అయాడు. బుసలుకొట్టాడు.

"అయిదోనంబర్ బ్లాక్‌మీద దాడి జరిగిందా? ఏమయింది?" అన్నాడు.

"మీరు అక్కడే ఉంటున్నారా?" కమీషనర్ అడిగాడు.

"అవునుసార్! అది నాకుటుంబం! నా పాపకేమయింది?"

"వివరాలులేవు. పదండి మేము కూడా వస్తాం" అన్నాడు కమిషనర్! వారు అక్కడకు చేరుకునే సమయానికే అయిదో నంబర్ బ్లాకుముందు పోలీసులు కాపలా కాస్తున్నారు. వరండాలో కూర్చుని బొగిలి బొగిలి ఏడుస్తోంది తన్వి! కర్ఫ్యూ కారణంగా తండ్రి హాస్పిటల్ నించి అక్కడకు చేరుకోలేకపోయాడు.

చెన్నుడు ప్రక్కనే కూర్చుని ఆమెను ఓదార్చుతున్నాడు. ఊహించలేని దారుణం ఏదో జరిగిపోయిందని అర్థం చేసుకున్నాడు రాహుల్. జీపు ఆగక ముందే క్రిందికి దూకి ఆవేపుకి పరుగుతీశాడు.

రాహుల్ కన్పించగానే మరింత వివశురాలై ఏడవటం మొదలు పెట్టింది తన్వి. అతని వంక దీనంగా చూచాడు చెన్నుడు.

"చెన్నా ఏమయింది? యిదంతా ఏమిటి?" అన్నాడు రాహుల్!

"భాయ్! పోలీసులతోపాటు నన్నొదిలేసి వెళ్లిపోయావుకదా నువ్వు. వారి సాయంతో రాత్రి ఇంటికి చేరుకున్నాను. నువ్వు తిరిగి వచ్చావోలేదో తెలుసుకొనేందుకు ఉదయమే వచ్చాను.

రాత్రి దుండగులు దాడిచేసి పాపను ఎత్తుకుపోయారు. సుషుమ్న ఏమయిందో ఎక్కడుందో మనకిప్పుడు తెలియదు." అంటూ దుఃఖాన్ని అణచుకోలేక బావురుమన్నాడు చెన్నుడు.

ఆమాటలు వింటూనే భయంకరమైన కేకపెట్టి విరుచుకుపడిపోయాడు రాహుల్! దెబ్బమీద మరో దెబ్బ తగిలింది!

తెలివితప్పి ధబ్బున నేలమీదికి ఒరిగిపోతున్న రాహుల్ని పొదివి పట్టుకున్నాడు నగర కమిషనర్! వెంటనే ఇతర అధికారులు అతనికి సాయంపట్టి జీపులోకి చేర్పించారు.

"హాస్పటల్ కి పోనివ్వండి. క్విక్" అన్నాడు సిటీ పోలీస్ కమిషనర్!

అమిత వేగంతో జీపు ముందుకు సాగింది. నిర్మానుష్యంగావున్న వీధుల వెంట హాస్పిటల్ వైపుగా దూసుకుపోతూంది

నిర్జీవమైన కట్టెలా బిగిసిపోయాడు రాహుల్! ఆ షాక్ నుంచి ఎంత సేపటికి కోలుకుంటాడో తెలియనంతగా బిగిసిపోయాడు

కమిషనర్ స్వయంగా రుమాలుతో నుదురు అద్దుతున్నాడు!!

* * * * * * *

వార్తా పత్రికలు గగ్గోలు పెడుతున్నాయి. చాల హృదయవిదారక మైన ఫొటోలు ప్రచురిస్తున్నాయి. ఎటు చూచినా శవాలు! దహనాలు! దోపిడీలు, గుండెల్ని పిండివేసే దారుణాలు!

రెడ్ క్రాస్, సత్యశాయి శాంతి సంఘాలు అపారంగా సహాయాలు అందించేవార్తలు కొంత ఉపశమనం కలిగిస్తున్నాయి. ధనవంతులు, మరికొన్ని స్వచ్ఛంద సేవా సంస్థలనుంచి విరాళాలు అందుతున్నాయి.

నగరంలో ఇంకా కొన్నిచోట్ల కర్ఫ్యూ ఎత్తివేయలేదు

కనిపిస్తే కాల్చివేత ఉత్తర్వులు ఉపసంహరించారు

కొన్ని గంటలపాటు దుకాణాలు తెరిచారు. కళ్ళముందు జరిగిన దారుణాలు జ్ఞాపకాలుగా మారుతున్నాయి కాని మనుషుల శరీరాలమీద మనసులమీద అయినగాయాలు ఇంకా మాయలేదు.

పచ్చి పచ్చి గాయాలు! పచ్చి పచ్చి జ్ఞాపకాలు!

చెంపలమీద అవుతున్న దుఃఖాశ్రువుల చారికలు ఇంకా ఆగలేదు. ఎక్కడ ఎన్ని సైతానులు నర్తించినా మానవజాతి చిరంజీవి!

ఒక దురదృష్టకరమైన క్షణంలో జీవితాశను వదులుకున్న ఆ మనుషులే మళ్ళీ జీవనం సంపాదించే తాపత్రయంలో పడ్డారు.

వీధుల్లో పలుచగా వాహనాలు నడుస్తున్నాయి

పోలీసుల సంఖ్య తగ్గిపోతుంది. హాస్పిటల్స్ నిండుతున్నాయి. డాక్టర్లు బిజీ అయిపోతున్నారు.

ప్రభుత్వ ఆసుపత్రిలో ఒక ప్రత్యేక గదిలో తెల్లని పక్కమీద కళ్ళు మూసుకుని పడివున్నాడు రాహుల్! మెళుకువ వచ్చిన కాసేపటికి మళ్ళీ ఆలోచనలు టెన్షన్ యిస్తున్నాయి,

కొంతసేపు ఎందరు పట్టుకున్నా నిలవకుండా గొడవ చేయటం, మళ్ళీ స్పృహకోల్పోవటం ఇలా జరుగుతోంది.

తన్వి నిర్వీర్యంగా మోఢామీద కూర్చుంది ఆమె కనులముందు ఇంక భవిష్యత్తు అంతా అంధకారంగావుంది.

చెన్నుడు గదిబయట తచ్చాడుతున్నాడు. చదివిన పేపరు మళ్ళీ మళ్ళీ చదివాడు. చూపులు అక్షరాలవెంట పరుగులుతీస్తున్నా ఆలోచనలన్నీ పాపాయి మీదికే పరుగులు తీస్తున్నాయి.

కాస్సేపు అయ్యాక తన్వి వెలుపలకు వచ్చింది.

"ఆయన కన్నులు తెరిచారు" అంది భయంభయంగా! మళ్ళీ ఎంత అల్లరిచేస్తాడో అని ఆమె అనుమానపడుతోంది.

చెన్నుడు రాహుల్ దగ్గరగా చేరి కూర్చు


మీ 'పొట్టలు' జాగ్రత్త!!

పైవారమే ఆం. చ. సంచిక!



* సాహిత్య హంతకోపాఖ్యానం మేము నిర్వహించిన హాస్యనవలికల పోటీలో ప్రథమ బహుమతి అందుకున్న వ్యంగ్య వీచిక యీ సంచికలో హోల్ మొత్తంగా చదివి కడుపుబ్బ నవ్వండి!

* ఏ విజయలక్ష్మి? ప్రదర్శన యోగ్యం, పఠన యోగ్యం, అత్యశ్యం పొట్ట చెక్కలయ్యే ప్రమాదం- యిదీ యీ 'నాటిక' ప్రత్యేకత.

* 'ఆత్రేయ' నాటికీ నేటికీ 'ఆత్రేయే' స్పెషల్ యింటర్వ్యూ.

* "హనీమూన్ ఆరంభసమయే" ఇదేమిటి? యిలాంటివి ఎన్నో వున్నాయ్- మీ కాపీకోసం మా ఏజెంట్ నడగండి.

-ఎడిటర్




**ఆర్. ఎస్. కుమారి, నల్గొండ**

ప్రశ్న : ప్రతి దినము పచ్చగా వాంతులు అవుట.

జ : చింతలూరు ఆయుర్వేద ఫార్మశీవారి స్వర్ణ సూర్యావర్తి ని మాదీఫల రసాయనంతో సేవించ వలెను.

**కె. వి. పద్మజ, విశాఖపట్నం.**

ప్రశ్న: జుట్టు ఊడిపోవుట.

జ : చింతలూరు ఆయుర్వేద ఫార్మశీ వారి భృంగామలక తైలం క్రొత్త రోడ్డు జంక్షన్‌లో టి. వి. ఎస్. ఆఫీసుకు ఎదురు మేడపైమా బ్రాంచి కలదు.

**ఆర్. రమణి, విశాఖపట్నం.**

ప్రశ్న : బహిష్టు సమయ మందు నొప్పి.

జ : చింతలూరు ఆయుర్వేద ఫార్మశీవారి ఋతుశూల సంహరి బహిష్టు సమయములో 3 రోజాలు పూటకు 2 మాత్రలు చొప్పున ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం వాడి పాలుఅన్నం మాత్రమే సేవించ వలెను. వేడినీళ్ళు త్రాగవలెను.

**పి. లలిత, అనకాపల్లి.**

ప్రశ్న : మొఖముపై మొటిమలు.

జ : చింతలూరు ఆయుర్వేద ఫార్మశీ వారి హేమ సుందరరసం. సుగందాది లేహ్యం. శారిబాద్యాసవం సేవించవలెను.

**కె. మాధవి, అనకాపల్లి.**

ప్రశ్న: కాళ్ళు పగుళ్ళు.

జ : చింతలూరు ఆయుర్వేద ఫార్మశీవారి వాతారితైలంను పగుళ్ళు గల చోట్ల వ్రాయవలెను.

**ఎ. సీతా రామలక్ష్మి , కాకినాడ.**

ప్రశ్న : మదుమేహం

జ : చింతలూరు ఆయుర్వేద ఫార్మశీవారి నెం. 4 వసంతకుసుమాకరం మాత్రలను ఉదయం సాయంత్రం సేవించవలెను.

(గంజాంవారి వీధి, కాల్‌గ్యాస్ కంపెనీ ఎదురు గుండా మా బ్రాంచికలదు)

**ఎస్. రాజవీరు , ఆదిలాబాద్.**

ప్రశ్న : అతిమూత్రవ్యాధి.

జ : చింతలూరు ఆయుర్వేద ఫార్మశీవారి తారకేశ్వర రసం నెం. 4 వసంత కుసుమాకరం మాత్రలు. ఉదయం, సాయంత్రం సేవించవలెను.

**వి. వెంకటేశ్వరరావు , వెంకటాపురం.**

ప్రశ్న : కాళ్ళపైన దురదలు.

జ : చింతలూరు ఆయుర్వేద ఫార్మశీ వారి హేమ సుందరరసం, సుగందాదిలేహ్యం, శారిబాద్యాసవం లోనికి సేవించుచూ కాళ్ళపైన కాశీసాద్యఘృతం వ్రాయవలెను.

**వి. కళ్యాణిరావు , విశాఖపట్నం.**

ప్రశ్న : కడుపులో మంట.

జ : చింతలూరు ఆయుర్వేద ఫార్మశీవారి స్వర్ణ క్రవ్యాద రసం సూర్యావర్తి సేవించవలెను. (క్రొత్త రోడ్డు జంక్షన్‌లో మా బ్రాంచి కలదు. అక్కడ ఖరీదు చేసుకొనవచ్చును.)

**ఎన్. వెంకటప్పారావు , విజయవాడ.**

ప్రశ్న : కడుపులో నొప్పి, ఆకలి, నిద్ర లేకపోవడం.

జ : చింతలూరు ఆయుర్వేద ఫార్మశీవారి స్వర్ణ క్రవ్యాదరసం. పైత్యాంతక రసం. శూలకుఠారం సేవించి సుషుప్తి తైలం తలకు వ్రాయవలెను.

**కె. సూర్యనారాయణ , విజయవాడ.**

ప్రశ్న : గొంతులో కఫం.

జ : చింతలూరు ఆయుర్వేద ఫార్మశీ వారి రజత లోహ రసాయనం చ్యవనప్రాశ కాల్పియం సేవించవలెను.

**జి. గోవర్ధనరావు , మంగళగిరి.**

ప్రశ్న : ఆయాసం, పిల్లికూతలు.

జ : చింతలూరు ఆయుర్వేద ఫార్మశీ వారి మహాలక్ష్మి విలాస రసం, చ్యవనప్రాశ కాల్పియం సేవించవలెను.

**ఎస్. ఎ. బాబా , నూజివీడు.**

ప్రశ్న: మూలవ్యాధి.

జ : చింతలూరు ఆయుర్వేద ఫార్మశీ వారి అర్శోహర చంద్రప్రభాదివటి ఉదయం, సాయంత్రం 1 మాత్ర చొప్పున మంచినీళ్ళతో సేవించి రాత్రి పరుండునప్పుడు 10 గ్రా. మోతాదు త్రివృత్ లేహ్యంను నమిలి మ్రింగి గోరువెచ్చని మంచినీళ్ళు త్రాగవలెను.

**కె. ఎస్. బట్ , వరంగల్.**

ప్రశ్న : మా అమ్మగార్కి కీళ్ళ నొప్పులు.

జ : చింతలూరు ఆయుర్వేద ఫార్మశీ వారి బృహద్వాత చింతామణి ఉదయం, సాయంత్రం తేనెతో సేవించి వాతారి తైలంను నొప్పులు గల చోట్ల వ్రాయ వలెను. ●

న్నాడు. అతను తొక్కిపట్టిన స్ప్రింగులా మంచంమీద పడిఉన్నాడు. చూపులు ఎక్కడా అతకని పాదరసం పలుకుల్లా ఎటో జారుతున్నాయి.

"రాహుల్! నువ్వు చాల తెలివితక్కువగా ప్రవర్తిస్తున్నావు."

"చెన్నా! దురదృష్టవంతులు తెలివితక్కువవారే అవుతారు" అన్నాడు రాహుల్! అతని టెన్షన్ మాట్లాడేస్థాయికి తగ్గిపోవటంతో చెన్నుడు చాల సంతోషపడిపోయాడు.

"అదృష్టాన్ని నిర్ణయించేవాడు భగవంతుడు."

"భగవంతుడికి నామీద చిన్నచూపని తేలిపోయింది."

"నో! నేనొప్పుకోను రాహుల్! కష్టాలు మనుషులకే వస్తాయి. దానికి భగవంతుని దృష్టిలో కారణాలుంటాయి."

రాహుల్ విసురుగా లేచుకూర్చున్నాడు.

"నాకు ఈ ప్రపంచంలో మిగిలివున్న చిరుకాంతి నా సుష్మన్న. ఆ దీపం ఆరిపోవటానికి కూడ అర్థముందంటావా?"

"రాహుల్! దుఃఖంవల్ల ఆవేశంవల్ల నువ్వు వాస్తవాలను మరిచిపోతు న్నావు. దీపం ఆరిపోలేదు. కనుమరుగయింది" అంటూ అతన్ని ఆలోచనల్లోకి దింపాడు చెన్నుడు.

రాహుల్ తల ఒక్కసారి విదిలించాడు.

"ఏమంటున్నావు? నా బేబి బ్రతికి ఉందా?" అన్నాడు ఆవేశంగా.

"చనిపోయిందని నువ్వు ఎందుకనుకుంటున్నావు రాహుల్! పాప అపహరించబడింది. కాని హత్య చేయబడలేదని నా అనుమానం".

ఈ మాట వినగానే అతనిలో నిర్వీర్యమయిన శక్తులన్నీ తిరిగి జాగృతమయినాయి. మంచం దిగాడు.

"అవును. ఈ విషయాన్ని టెలిఫోన్‌లో ఓకామె చెప్పింది. నన్ను బెదిరించింది. అదే యివ్వాళ జరిగివుండవచ్చు."

"అవును బావా! పాప బ్రతికేఉంటుంది" కన్నీరు తుడుచుకుంటూ అంది తన్వి. ఆమె ముఖంలో రవంత కాంతి! ఒక ఆశ!

ఆ గదిలోనే చైతన్యం వచ్చింది. ఆశలు జీవంపోసుకున్నాయి. ఆ వెంటనే ఆలోచనలు ముందుకి సాగాయి.

"చెన్నా! నా కిప్పుడు అంతా జ్ఞాపకం వస్తోంది. టెలిఫోన్‌లో బెదిరించిన కంఠస్వరాన్ని నేను మళ్ళీ విన్నాను. మనం వెలుపలకు వెళ్ళేసమయంలో ఆమె కారులోంచి క్రిందకుదిగింది. అప్పుడామెను నువ్వుకూడ చూచావు.

ఎ ఎస్ పి శవాన్ని చూపి బెదిరించింది. ఆమె మరొకసారి కూడ కన్పించింది. యిబ్రహీంతో మాట్లాడింది.

నర్సులున్న వాన్ సురక్షితమయిన చోటుకు చేర్చమని నన్ను ప్రాధేయపడింది. ఇదంతా ఆలోచిస్తే ఆమెకు ఈ అపహరణతో సంబంధం ఉండితీరాలనిపిస్తోంది" అన్నాడు రాహుల్.

తన్వి అతని ఊహల్ని మరింత క్లియర్

చేసింది.

"బావా! అవును. నీ అనుమానం యదార్థమే అయుండాలి. ఎందుకంటే మన యింటిమీద జరిగిన దాడిలో పాల్గొనేందుకు అయిదారుగురు వచ్చారట! వారు ఒక జీబులో వచ్చారు. ఆ జీపుని నడుపుతోంది ఒక యువతి! మూడు నాలుగు బ్లాకుల వాళ్ళు పోలీసులకి చెప్పటం నేను విన్నాను" అందామె.

అతని మనసుమీదపట్టిన మబ్బులు విడిపోయాయి.

"ఆ యిండికేటర్ సంపాయించాలనే వాళ్ళ తాపత్రయం అంతా! రిసెర్చి సెంటర్ నించి అది ఎలా దొంగిలించబడింది? అని ఆరాతీయటానికి వెళ్ళిన ఎ ఎస్ పి చనిపోయాడు. పాపని దొంగిలించి దాని ఆచూకి తెలుసుకోవాలని వాళ్ళే ఈపని చేసిఉండాలి" అన్నాడు రాహుల్.

"అదే నిజమయితే మనకి బెదిరింపు రావాలికదా?" చెన్నడు.

"అందుకే మనం తక్షణం యింటికి వెళ్ళిపోవాలి" అన్నాడు రాహుల్.

ఆక్షణంలోనే వెనుకముందులు ఆలోచించకుండా బయలుదేరాడు. డాక్టర్లుకాని, ట్రీట్‌మెంట్‌కాని గుర్తురాలేదు.

పోలీసుల సాయంతో వారి వాన్‌లోనే ఇంటికి చేరుకున్నారు. బయటుండగానే వార్త అందింది.

"సార్! మీ టెలిఫోన్ నిర్విరామంగా మ్రోగుతోంది. ఇప్పుడే ఆగిపోయింది" ప్రక్కవాటాలో ఉంటున్న పెద్దమనిషి చెప్పాడు.

తలుపులు తెరుచుకుని లోనికివెళ్ళాడు రాహుల్! టెలిఫోన్ ఎదురుగా మోల్డావేసుకుని కూర్చున్నాడు.

అది ఎప్పుడు మ్రోగుతుందో! ఇల్లంతా నిశ్శబ్దం. రింగ్‌కోసం ప్రతిక్షణాన్ని లెక్కిస్తున్నాడు. కొద్దిసేపు గడిచిపోయింది. హార్లిక్స్ కలిపి తెచ్చియిచ్చింది తన్వి.

కాని రాహుల్ ఒక్కసారిఅయినా సిప్ చేయలేకపోయాడు.

"ట్రింగ్...... ట్రింగ్..... ట్రింగ్" అతని ఎదురుచూపులు ఫలించాయి. రిసీవర్ అందుకున్నాడు.

"ఇంటికి చేరుకున్నావా? పాపకోసం ఎక్కడెక్కడ వెదుకుతున్నావ్?" చాల డైరెక్టుగా వినిపించిన ప్రశ్న. ఆ కంఠస్వరాన్ని వెంటనే గుర్తించాడు రాహుల్.

"ఎవరు నువ్వు? నీకేం కావాలి?"

"కారవెల్లిలోంచి పడిపోయిన యిండికేటర్ కావాలి."

"అదేమిటో నాకు తెలియదు."

"బుకాయించకు. ఒక పైలెట్ చేతిలో అదిపడడం అనుకోకుండా జరిగిపోయింది. మీ పాప ద్వారా అది మీ ఇంటికి వచ్చింది".

"కాని పాప దాన్ని ఎక్కడో జారవిడిచింది."

"కథలు చెప్పకు మిష్టర్! నువ్వు పైలెట్‌వి కాబట్టి దాని విలువ నీకు తెలుసు! అందుకే భద్రంగా దాచావు. కొన్ని కోట్ల రూపాయలు టర్నోవర్‌చేసే ఒక వ్యాపార సంస్థ భవిష్యత్తు దానిమీదే ఆధారపడివుంది. దాన్ని నువ్వు యిచ్చితీరాలి."

"అది ఎక్కడుందో నిజంగా నాకు తెలియదు. మీకు ఎంత డబ్బు కావాలన్నా యిస్తాను. బేబిని ఏంచేయకండి."

"మా భవిష్యత్తు మీ చేతుల్లోవున్నట్లే నీ బేబి ప్రాణాలు మా చేతుల్లోఉంది. జస్ట్ మ్యూచువల్! నీదే తుదినిర్ణయం."

"నే నెక్కడికిరావాలో చెప్పండి?" అడుగుతూండగానే ఫోన్ కట్ అయిపోయింది

(ఇంకావుంది)




నాణ్యత మా తయారీ
ఖ్యాతితెచ్చినది భారత ప్రజలు
ఒక్కపలుకు-చాలు
పరిమళాలు-చిలుకు
త్రివేణి
తీపి వక్కపొడి
కోట్లాదిప్రజలు మక్కువతో కోరుకొనేది

# కృత్రిమం-అకృత్రిమం

''నాకీ ఘుఖస్తుతి గిట్టదండీ. మనసులో ఏముందో అదే పైకి రావాలి. నన్ను విమర్శించినా నా కిష్టమే. కాని పొగడ్తలంటేమటుకు చెడ్డ చిరాకు. మనసులో ఒకటి పెట్టుకొని పైకి మరొకటి మాట్లాడేవాళ్ళకి నే నామడ దూరంలో ఉంటాను. నామటుకు నేను అనదలచు కొన్నది మొహాన్నే అనేస్తాను. మనసులో ఉంచుకొని గుంజాటన పడను'' డ్రింక్ సిప్‌చేస్తూ అన్నాడు సైకాలజీ ప్రొఫెసర్ సతీష్‌చంద్ర.

అతని ప్రక్కనేఉన్న అయన కొలీగ్ విమల్ 'నాకు తెలీదటోయ్ నీ సంగతి. నువ్వు ముక్కు సూటి మనిషివి'' అని అటుప్రక్కనేవున్న ఎం.ఎల్.ఏ. రమణమూర్తిని చూస్తూ ''మా సతీష్‌ది మొదటి నుండీ ఇదే తత్వం. అందుకే వాడికి స్నేహితులు తక్కువ. ఏదో నా బలవంతాన యిలా అప్పుడప్పుడు నలుగుర్లోకి వస్తున్నాడుగాని ఇదివరలో అయితే యూనివర్సిటీ.... ఇల్లు తప్ప మరో ప్రపంచం తెలీదు''.

''ప్రొఫెసర్ సతీష్ జగమెరిగిన వ్యక్తి. కదుటంటే. అయన సంగతెవరికి తెలీదు. దేశంలోని గొప్ప సైకాలజిస్టుల్లో అయన ఒకరు'' అన్నారు ఎం.ఎల్.ఏ.గారు.

''అ.... అ.... అదే వద్దంటున్నారాయన. మీ ఎం.ఎల్.ఏ.ల ఓట్ల పొగడ్తలు, అధికార పొగడ్తలు మాదగ్గర పనికిరావు. అయినా ఈ రోజిలా ప్రొఫెసర్ వెంటపడ్డారేం?'' అడిగాడు కర్నల్ జోషి.

ఎం.ఎల్.ఏ.గారు గుర్రుగా చూశారతనివంక. డాక్టర్ మూర్తి అయన గ్లాసులో మరికొంత విస్కీ వంపుతూ ''మీ. కెందుకుసార్! మీరు కానీయండి. జోషీ సాబ్ మాటలంతే లెండి. అయన ఏనాడు ఎవర్ని మెచ్చుకున్నాడుగనుక? గవర్నమెంటు డాక్టర్లు రంగునీళ్ళు పోస్తారంటాడు. ప్లీడర్లు అబద్ధాలాడి, కేసుల్ని వాయిదావేయించి, నక్షత్రకుడి అన్నల్లా కాబూలీవాడి బాబుల్లా పీడించి డబ్బు గుంజుతారట. ఇంజనీర్లు సున్నం ఇసుక కలిపి ఇళ్ళు, డాములు కూల్చేసి తమ ఇళ్ళు డబ్బులతో కట్టుకుంటారట. ఇంక మీ లాంటివాళ్ళు పొగడ్తలతో ఛీ అన్నా ఉమ్మేసినా తుడిచేసుకొని పదవికోసం ఏ నీచప్పనికైనా......?

''డాక్టరూ.... మరీ ఇంత ఇదిగానా విమర్శించేది? దానికీ హద్దూపద్దూ ఉండక్కర్లేదూ?'' ముద్దముద్దగా వస్తున్నాయి ఎం.ఎల్.ఏ.గారి నోటినుండి మాటలు.

డాక్టరుగారు పూర్తి మైకంలో కొచ్చారు. ''హద్దులు మనం గీచుకొనేవి. పద్దులు మనం రాసుకొనేవి'' ఇంకా ఏదో చెప్పబోయి మాటరాక తల వాల్చేశాడు.

మిస్టర్ జోషి డ్రైవర్ని కేకేసి డాక్టరుగార్ని తీసికెళ్ళమన్నాడు. అతను బాయిస్ సాయంతో డాక్టరుగార్ని కారెక్కించాడు.

ఎం.ఎల్.ఏ.గారు సతీష్ పక్కకొచ్చి కూర్చున్నాడు.

''విన్నారా! ఆ డాక్టరు మాటలు. పాపం తాగుబోతు ప్రాక్టీసులేని మనిషి అని దయదలచి గవర్నమెంటు ఉద్యోగం యిప్పిస్తే ఎంతలేసి మాటలన్నాడో?''

సతీష్ చిరాగ్గా మొహంపెట్టి ''అతనిగురించెవరికి తెలీదు. అలాంటి మనిషిగురించి నా దగ్గర మాట్లాడకండి. అయినా మీ లాంటి ప్రజాసేవకుల కలాంటి నిందలు తప్పవు. మీరు తన కెంత సాయం చేసింది మరిచిపోయిన కృతఘ్నుడు''.

''అదీ సరైన మాటంటే. మీరూ నన్ను సరిగా అర్థంచేసుకోండి. ఎంతైనా గొప్ప సైకాలజిస్టు మీరు. అన్నట్లు రేపు మంత్రిగారింట్లో ఫంక్షనుంది. వెళ్ళాలి. సహాయమంత్రిపదవి ఇప్పిస్తానని చెబుతున్నాడు మహానుభావుడు. ఏం ఇస్తాడో ఏమో! నన్నుమటుకు సూర్యుడి చుట్టూ తిరిగే భూమిలా తిప్పుకుంటున్నాడు. మధ్యమధ్య దక్షిణలు, కానుకలతో తడిచి మోపెడవుతోంది.




పదవెప్పుడొస్తుందో, పోయిందంతా ఎప్పుడు రాబట్టుకోవాలో! ఏమిటో.... అంతా అగమ్యగోచరంగా వుంది.''

''మీకేమండీ. మీరు తెలివిలో ఏదురడంతటివారు. బుద్ధికి బృహస్పతి. మీ రేదైనా పాచిక వేస్తే అది శకుని పాచిక లాంటిదిగాని దానికి మరి ఎదురు తిరుగు ఉంటుందా?'' మిస్టర్ జోషి అందుకున్నాడు.

ఎం. ఎల్.ఏ.గారా బిరుదులన్నీ చిరునవ్వుతో స్వీకరించి ''ఏదో తమకు నాయందు గల అభిమానం అలాంటిది. అయ్యా వస్తాను మరి'' అని లేచాడు.

పార్టీ యిచ్చిన జోషి అయన్ని వాకిలిదాకా సాగనంపాడు.

అఖరున బైలుదేరింది విమల్, సతీష్. కారు దగ్గరికెళ్తుండగా విమల్ అడిగాడు ''అన్నట్లు ప్రొఫెసర్ రామనాధం అమెరికా నుండెప్పు డొస్తున్నాడు?''

''నెలాఖరులో వస్తున్నానని వ్రాశాడు'' అన్నాడు సతీష్.

''ఏమైనా అదృష్టవంతుడు. అతడ్ని మేనమామ బాగానే పైకితెచ్చాడు. విదేశాల్లో సైకాలజిస్టుగా గొప్ప పేరు తెచ్చుకుంటున్నాడు'' అన్నాడు విమల్.

''ఔను'' క్లుప్తంగా అనేశాడు సతీష్. రామనాధం గురించిన ప్రసక్తితో సతీష్ మూడ్ మారిపోయింది.

మౌనంగా కారు డ్రైవ్ చేయసాగాడు.

''రామనాధం అదృష్టవంతుడు. హుఁ! ఏం అదృష్టంలే వాడి మొహం. ఇక్కడ ప్రొఫెసర్‌గా చేసే దమ్ములేక అయినవాళ్ళ కాళ్ళుపట్టుకొని అమెరికా పోయాడు. అమాత్రాన వాడో పెద్ద సైకాలజిస్టయినట్లు, అక్కడెవ్వరూ ఇంత గొప్ప సైకాలజిస్టులు లేక వీణ్ణి పిలిపించారా? అన్నీ గొప్పలు. మేనమామ కుంటి కూతుర్ని అంటగట్ట టానికి వేసిన ప్లాన్ అది. అయన స్వార్థం అయనది. వీడి స్వార్థం వీడిది. ఛీ... ఛీ... మనుషు లెంత అల్పులు? ఎక్కడికక్కడ స్వార్థం, అవినీతి తాండవిస్తున్నాయి. నయవంచనలతో బ్రతుకులన్నీ వెళ్ళిపోతున్నాయి. తనని తాను మోసంచేసుకుంటూ ఎదుటివాణ్ణి మోసగించడం, అదో గొప్పతనంగా, ఘనకార్యంగా భావించటం ఇలాంటివాళ్ళు ఆ రకాలని గురించి భజనలు చేయటం ఛీ...'' అతనివేవీ పైకి అనలేకపోయాడు.

అన్నట్లుగానే రామనాధం భార్యా పిల్లలతో నెలాఖరుకు రానేవచ్చాడు. బంధువులని, మిత్రులని

కలుసుకుంటూ ఓ రెణ్ణాళ్ళు గడిపాడు. వెళ్ళేముందు సతీష్ అతణ్ని తమ ఇంటికి పిలిచాడు

భోజనాలయ్యాక సాయంకాలం వీడ్కోలు తీసుకొనేముందర రామనాదం స్నేహితుడిచ్చిన విందుకి, సత్కార గౌరవాలకి ఆనందపడూ కృతజ్ఞతలు చెబుతూ –

బ్యాగ్‌లో నుండి ఓ వస్తువు తీసి సతీష్‌కిచ్చి "ఇది నీకు నా బహుమతి నీకోసం అమెరికా నుండి తెచ్చాను అందరికీ ఏవేవో చిన్న చితకా బహుమతులిచ్చుకుంటూవచ్చాను నీ దగ్గరి కొచ్చేసరికి ఇది మిగిలింది తీసుకో అని ఇచ్చాడు

సతీష్ అతనికి కృతజ్ఞతలు చెప్పి తీసుకొని బీరువాలో దాచాడు

సతీష్ భార్యా పిల్లలు రామనాదం కుటుంబానికి వీడ్కోలు చెప్పారు

ఆ రాత్రి సతీష్ అందరూ నిద్రపోయాక రామనాదం ఇచ్చిన ప్యాకెట్ విప్పాడు

అదొక చిన్న కోటుగుండీ సైజులో ఉన్న ట్రాన్స్‌మీటర్ అండ్ రిసీవర్ రెండూ విడివిడిగా ఉన్నాయి

అది చూసి చాలా ఆనందించాడు తీసి బీరువాలో జాగ్రత్తగా దాచాడు

చదుకొన్నాక అతనికొక విచిత్రమైన ఆలోచన వచ్చింది. మనుషులు పైకొకటి లోపలింకొకటి ఉంచుకొని మాట్లాడుతుంటారు తనని అందరూ ఎదుట చాలా బాగా పొగిడి ఆకాశాని కెత్తేస్తుంటారు. అయితే ఇది నిజంగా వాళ్ళ మనసుల్లో ఉందేనా? లేక మెరమెచ్చులా?

ఇది తెలుసుకోవాలంటే

ఎస్ ఈ ట్రాన్స్‌మీటర్ సాయంతో వాళ్ళు నిజంగా నా గురించి ఏం అనుకొనేది తెల్సుకోవచ్చు ఆ పని రేపు ఉదయం నుండే మొదలెట్టాలి అనుకున్నాడు సతీష్

తెల్లవారి లేవగానే ట్రాన్స్‌మీటర్ తీసికెళ్ళి హాల్లోని పూలకుండీలో దాచాడు

బ్రేక్‌ఫాస్ట్‌కి ఇంట్లో అందరూ డైనింగ్ టేబుల్‌దగ్గరికి చేరుకోవటం అన్నది ఆ ఇంట్లో ఇరవై సంవత్సరాలుగా అలవాటు సతీష్ పెద్దకొడుకు కృష్ణ కోడలు గీత ఇద్దరూ డాక్టర్లే రెండో కొడుకు భగత్ బి టెక్ చదువుతున్నాడు కూతురు కిరణ్మయి ఇంటర్ సీనియర్ తన పిల్లలు రత్నాల్లాంటి వాళ్ళని అందరూ అనటం అతనికి చాలా గర్వంగా అన్పించేది



భగత్ టేబుల్ దగ్గరలేకపోయేసరికి ఏమైంది' భగత్ రాత్రి లేట్‌గా నిద్రపోయాడా? అడిగాడు భార్యని సతీష్

ఔను కాలేజీలో పంక్షనుందని రాత్రి బాగా

# "మరువలేని మహా నటుడు"



1926లో రంగూన్ (బర్మా) లో ప్రదర్శించబడిన "సతీ సావిత్రి" నాటకంలో సత్యవంతుడిగా శ్రీ వుప్మాక కామేశ్వరరావు, సావిత్రిగా శ్రీమతి రామతిలకం, యముడిగా శ్రీ వేమూరి గగ్గయ్య.

లౌడ్ స్పీకర్‌లు లేని ఆ రోజుల్లో పద్యం గళమెత్తి పాడితే సుమారు మూడు కిలోమీటర్ల దూరం వరకు వినబడేది - అటువంటి గాత్రం ఇప్పుడు ఏది? అని పలువురు ప్రశ్నిస్తారు. అటువంటి కంచుకంఠం ఎవరిదంటే శ్రీ వుప్మాక కామేశ్వరరావు (1885-1956) గారిది.

శ్రీ వుప్మాక కామేశ్వరరావుగారి స్వస్థలం బొబ్బిలి దరి నారాయణప్పవలస. తన ఇరవైయవ ఏటనుంచి సుమారు 50 సంవత్సరాల పాటు దేశంలోని అనేక ప్రాంతాలలోనే కాక 'బర్మాలోని రంగూన్, ముండవే వంటి పట్టణాలలో వివిధ నాటకాలలో ప్రముఖ పాత్రలు ధరించిన నటగాయక శిరోమణి. ముఖ్యంగా ఈయన 'రామదాసు' నాటకంలో ధరించిన 'కబీరు' పాత్ర బహుజనాదరణ పొందింది. ఆ పాత్రకు అనేక సన్మానాలలో మూడు పదులకు పైగా బంగారు పతకాలు లభించాయి.

అన్నింటికంటె ముఖ్యంగా అపురూపమైంది. అమూల్యమైంది 1926లో రంగూన్‌లో వీరికి బహుమతిగా లభించిన ఎనిమిదన్నర అడుగుల పొడవు, అయిదున్నర అడుగుల వెడల్పు, మూడున్నరఅడుగుల ఎత్తు కొలతలు గలిగి, లతలు, నగిషీలు చెక్కబడిన బర్మా టేకు పందిరి మంచం.

వారికి లభించిన స్వర్ణపతకాలన్నీ, వారి అనంతరం మా కుటుంబ ఆర్థికావసరాలకు కరిగిపోయాయి. "ఈ పందిరి మంచం ఒక్కటే మాకు మిగిలిన జ్ఞాపిక" అని ప్రస్తుతం నారాయణప్ప వలసలో ఉంటున్న (శ్రీ కామేశ్వరరావుగారి) శ్రీమతి అమ్మాయమ్మగారు 85 సంవత్సరముల వృద్ధురాలు కన్నీళ్లతో వివరించారు. ఆనాటి రంగస్థల పరిస్థితులు, ఆయన నాటకానుభవాలు, గౌరవ పురస్కారాల గురించి ఎన్నెన్నో ఆసక్తికరమైన విషయాలు ఆమె ప్రస్తావిస్తుంటారు.

ఆయనకు లభించిన అన్ని సన్మానాలకంటే మిన్న 1950 ప్రాంతంలో బొబ్బిలిలో - ఆనాటి బొబ్బిలి ప్రభువులు రాజు శ్రీ ఆర్.ఎస్.ఆర్.కె. రంగారావుగారు స్వయంగా సన్మానించి యిచ్చినది స్వర్ణపతకం అని ఆమె కన్నీళ్ల జ్ఞాపికలతో చెప్పారు. తరువాత 'కాకినాడ' - నాటక సమాజంవారు యిచ్చిన "గవయ్యా!" బిరుదు ఇలా వ్రాసుకుపోతే ఎన్నో, ఎన్నెన్నో... అలాంటి నటగాయకులు అమరులు - వారులేకున్నా - వారి చరితలు అజరామరాలు.

టి. శ్రీనివాసాచార్యులు

## ప్రియం-అప్రియం

లేట్‌గా వచ్చాడు" అంది గాయత్రి.

"అంత లేట్ అయ్యే ఫంక్షన్స్‌కి వెళ్ళొద్దని చెప్పు" అన్నాడు సతీష్.

మౌనంగా తలూపింది గాయత్రి.

పెద్దకొడుకు పెద్ద డాక్టరైనా తనెదుట మాట్లాడ్డానికే భయపడతాడు. తలొంచుకొంటాడే తప్ప, సూటిగా చూస్తూ ఏనాడూ మాట్లాడలేదు. కోడలు సరేసరి. మొదట్లో డైనింగ్‌టేబుల్ దగ్గరికి రావటానికే భయపడ్డది. గాయత్రి ఎంతో బలవంతంమీద 'మాకు కిరణ్మయి ఒకటి నువ్వు ఒకటి కాదమ్మా!' అని తీసుకొచ్చింది. వంచినతల ఎత్తదు.

భగత్ రాత్రి లేట్‌గావస్తే ఉదయం తనకి కన్పించడు. తను కాలేజీకి వెళ్ళాక అతడు గది దాటి బైటికొస్తాడు.

టిఫిన్ అయ్యాక మేడమీద స్టడీ రూమ్‌కెళ్ళి కూర్చున్నాడు సతీష్.

రిసీవర్ ఆన్‌చేసుకొని కూర్చున్నాడు. ఏవో సాధారణపు మాటలు తప్ప ప్రత్యేకమైన వేవీ లేవు. కృష్ణ గీత హాస్పిటల్ కెళ్ళినట్టున్నారు.

ఓ అరగంట గడిచాక రిసీవర్ ఆఫ్‌చేసి బుక్స్ తీసి చదవసాగాడు.

మధ్యాహ్నం 3 దాటాక –

విమల్, జోషి వచ్చారు.

కాస్సేపు పాలిటిక్స్, తర్వాత యూనివర్సిటీ విషయాలు అయ్యాక – విమల్ రామనాథం ప్రసక్తి తెచ్చాడు. "మొత్తానికి రామనాథం బంగారుపిచ్చుక. విమానమంత కారు, కోటీశ్వరుడైన మామగారు, బంగారు బొమ్మలాంటి భార్య, రత్నాల్లాంటి పిల్లలు – వాడికేం?"

"ఆ! ఏం పిల్లలు! ఎంత అమెరికాలో ఉంటేమటుకు ఆడపిల్లల్ని మరీ అంత బరితెగింపుగానా పెంచేది? వాళ్ళూ, వాళ్ళ అవతారం! నాకు చిరాకేసింది. మన ఇళ్ళలో ఆడపిల్లలెలా ఉంటారు? మీ అమ్మాయి చూడు – ఎంత లక్షణంగా ఉంటుందో? నీ మగపిల్లలు మటుకు నువ్వంటే ఎంతగౌరవం. అసలు వాళ్ళల్లో మచ్చుక్కూడా తల్లిదండ్రులపట్ల గౌరవం కన్పడలేదు."

"నిజమే. వాళ్ళ డ్రెస్, మాటతీరు నాకూ నచ్చలేదు. తల్లిదండ్రులు పిల్లల్ని క్రమశిక్షణలో పెంచాలి. రామనాథం చిన్నప్పుడెలా ఉండేవాడో మనకు తెలీకపోతేగా!"

ముగ్గురు మిత్రులు నవ్వుకున్నారు.

తమ కాలేజీ రోజుల్లోని సంఘటన లొక్కసారి గుర్తొచ్చాయి.

"ఏమైనా రామనాథం ఇండియాలో సెటిలైతే బాగుండేది. తన శక్తి సామర్థ్యాలు, తెలివితేటలు ఎక్కడో పరాయిదేశానికి డబ్బుకోసం అమ్ముకోవటం నా దృష్టిలో దేశద్రోహమనుకోండి" అన్నాడు సతీష్.

"నిజమే. నూటికి నూరుపాళ్ళూ నిజం" అన్నారు మిత్రులిద్దరూ.

"జస్ట్ ఎమినిట్. కాఫీ తెస్తాను. మీరు టిఫిన్ కానిస్తుండండి" అని లోపలికొచ్చాడు

"గాయత్రీ కాఫీ అయిందా?" కిచెన్‌లో కొస్తూ అడిగాడు.

"ఆఁ! రెండు నిముషాలు" అంది గాయత్రి, వేడి నీళ్ళు ఫిల్టర్‌లో పోస్తూ.

సతీష్ ప్రక్క గదిలో కెళ్ళి రిసీవర్ ఆన్ చేశాడు.

హాల్లోని స్నేహితుల మాటలు విన్పించసాగాయి.

అది విమల్ గొంతు "ఫారెన్ ఛాన్స్ తనకి తగల్లేదని ఏడుపు అతణ్ణి చూసి కళ్ళల్లో నిప్పులు పోసుకుంటున్నాడు."

"ఔను. పరాయి ఆడ పిల్లల్నలా విమర్శించటం దేనికి? తనకి తన, పిల్లలకి పట్టని అదృష్టం ఎదుటివాళ్ళకి పడితే ఓర్చలేని మనిషి' అది జోషీగొంతు.

'అబ్బ ఇంత అసూయ, ద్వేషం కలవాణ్ణి నేనెక్కడా చూళ్ళేదు బాబూ! తనలో సత్తాలేదు. ఎదుటివాణ్ణి చూసి ఏడుపు. ఏదో సామెతుందిలే– ఎదుటివాడికుందీ అని ఏడిస్తే ఒక కన్ను, నాకు లేదే అని ఏడిస్తే రెండు కళ్ళూ పోయాయట.

'అందుకే రిటైర్ కాబోతున్నా ఇంకా ప్రొఫెసర్‌గానే

# మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి, పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి. సెరిలాక్ లాభాన్ని అందించండి.
పోషకాహార లాభం : సెరిలాక్ ప్రతీ మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు, ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజాలూ అన్నీ వున్నాయి. అన్నీ సమ పాళల్లో వున్నాయి.
రుచి లాభం : పాపాయిలకు సెరిలాక్ రుచి ఇష్టం.
సమయం ఆదా లాభం : సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ పంచదార వున్నాయి. దానిని వెచ్చటి నీటితో కలిపితే చాలు.
ఎంపిక లాభం : ఎంచుకునేందుకు మూడు రకాల సెరిలాక్ వుంది.
మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకూ తయారుచేయటంలో పరిశుభ్రతను పాటించేందుకూ డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.



6 మాసాలు నించి



4 మాసాలు నించి



6 మాసాలు నించి

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి.సెరిలాక్
పోస్ట్ బాక్స్, నెం 3
న్యూ ఢిల్లీ 110008



Nestlé®

## సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం

RK SWAMY/FSL/5112/TEL

ఉండిపోయాడు."

'ఎవరితో మంచిగా ఉన్నాడూ? ఎవరు బాగుపడ్డా ఏడుపేనాయె! ఎదుటి వాళ్ళని గురించి ఎప్పుడూ ఏదో ఒకటి విమర్శగా మాట్లాడ్డం తప్ప మంచిగా ఏనాడైనా అన్నాడా? తనేదో గొప్ప సైకాలజిష్టయినట్లు?'

'స్టూడెంట్స్‌కి వీడి క్లాసంటే పరమబోర్. ఇతని పిరియడ్ అప్పుడు స్టూడెంట్స్ క్యాంటిన్‌లో చెట్ల కింద తప్ప, క్లాసురూంలో పట్టుమని పదిమంది ఉండరు' విమల్‌గొంతు.

'మరి ఇక్కడే ఇంత లక్షణంగా చెప్పేవాడికి విదేశాలకి ఛాన్స్ ఎలా వస్తుందయ్యా? బాగుపడే వాళ్ళ్ని చూసి ఊరికే ఏడ్చి పోతాడే తప్ప తన లో టుపాట్లు సరిదిద్దుకోడు.'

'ఎవరో వస్తున్నట్లుంది. ఊరుకోండి–

కొద్ది సెకన్లు గ్యాప్.

గాయత్రి గొంతు 'ఏరి! ఆయన కాఫీ తెమ్మని ఎటు వెళ్ళారూ?

ఆయన ఏ సైకాలజీ పుస్తకమో తిరగేస్తుంటారు. నిన్ననే కొత్త బుక్స్ లైబ్రరీ కొచ్చాయి. తెచ్చినట్లున్నారు. ఏమైనా సతీష్ మంచి హార్డ్‌వర్క్ చేస్తాడు. అందుకే అతని క్లాసంటే స్టూడెంట్స్ అంతవెర్రిపడిపోతారు విమల్‌గొంతు.

సతీష్ రిసీవర్ ఆఫ్ చేశాడు.

అతడి మొహడు మొద్దుబారినట్లుగా వుంది.

ఒక్క నిముషంలో సర్దుకొని బైటి కొచ్చాడు. 'ఇదేమిటి వాళ్ళని హాల్లో కూర్చొబెట్టి మీరిక్కడేం చేస్తున్నారూ?' ఎదురొస్తూ అడిగింది గాయత్రి.

'పుస్తకం ఒకటి కన్పించలేదు. వెదుకుతున్నాలే' అంటూ హాల్లోకెళ్ళాడు సతీష్.

మళ్ళీ మామూలు డైలాగులు.

పొగడ్తలు. అభినందనలు.

'పయో ముఖ విషకుంభాలు' అన్పించిందతనికి.

వాళ్ళు వెళ్ళాక అతనెవరితో ఎక్కువ మాట్లాడలేదు. మేడమీదికెళ్ళి తన గదిలో కూర్చున్నాడు.

రాత్రి 8 గంటలు దాటింది.

'ఏమిటి యింకా చదువుతున్నారా భోజనానికి రారా?' అడుగుతూ లోపలికొచ్చింది గాయత్రి.

'ఆకల్లేదు గాయత్రీ.'

"కొద్దిగా తినండి. అలస్యంగా తింటే మీకసలరగదు కూడా."

"సారీ! నాకక్కర్లేదు. నువెళ్ళి భోంచెయ్యి."

గాయత్రి వెళ్ళిపోయింది.

సతీష్ ఆలోచిస్తూనే రిసీవర్ ఆన్‌చేశాడు.

"ఏం ఆయనింకా కిందికి దిగలేదా? నీకెన్నిసార్లు చెప్పానమ్మా అలా పదిసార్లు మేడ మెట్లు ఎక్కి దిగొద్దని! నీకసలే బ్లడ్‌ప్రెజర్. ఎప్పుడో ఆ మెట్లమీది నుండి పడ్తావ్! పెద్దకొడుకు గొంతది.

సెటారుగా అయ్యాడు సతీష్.

"అయినా ఆయనకా మేడమీది గది దేనికి? కిందగదిలో సర్దుకోక. ఆయనే గ్రహించి కిందికొస్తాడనుకొంటే ఆ సూచన లేమీ లేవు. ఏ రడుగుతారా? నే నడగనా?"

గీత గట్టిగా అంటోంది.

"అబ్బ! పోన్లే ఎక్కడ పడుకొంటే ఏమిటి?" విసుక్కున్నాడు కృష్ణ.

"అంతేలెండి. ఓ ముద్దు మురిపెం లేదు. కొత్తగా పెళ్ళిన వాళ్ళంకదా? మనకి వంటరితనం కావాలన్పిస్తుంది. ఈ వయసులో ముసలాయన కాగది దేనికిచెప్పండి?"

సతీష్ నరాలు బిగుసుకుంటున్నాయి.

"అమ్మా!" భరత్ గొంతు అరిచినట్లువుంది.

"ఇదే నేను చెప్పటం లాస్ట్. నేను రేపటి నుండి అన్నయ్య స్కూటర్ తీసకెళుతున్నాను. అన్నయ్యకి



నాన్న కారిమ్మను."

"అంత అదృష్టం కూడానా! మీ నాన్నగారు ఆ కారు విడుస్తారటయ్యా! ఆయన ప్రాణం అందులోనే వుంది మాంత్రికుడి ప్రాణం చిలకలో లాగా."

"ఏమో! అవన్నీ నాకు తెలీవు. నాకు టైముకి బస్సులు దొరకటంలేదు. నా ఫ్రెండ్సంతా స్కూటర్ల మీద నస్తారు. నే నసహ్యంగా బస్సుల్లో పోతున్నా. రేపటినుండి అలా వెళ్ళను."

"మరి పెద్దాడెలా వెళ్తాడు?" గాయత్రి గొంతది.

'చెప్పాగా కార్లో వెళ్ళమని.'

"మరి మీ నాన్నెలా వెళ్తారూ?"

గాయత్రి గొంతులో అసహనం.

"మరోటి కొనుక్కోమను. లేదా స్కూటర్ కొనండి. ఎంత పీనాసితనమో! పోయేప్పుడంతా మూటగట్టుకు పోతాడా వెంట? మొన్న చెల్లాయేదో కొనమంటే వద్దన్నాట్ట. సంపాయించిన డబ్బంత ఏం చేసుకుంటాడ్ట! సుఖపడటం చేతకాని మనిషి.'

సతీష్ కళ్ళు ఎర్రబడ్డాయి.

'మొదట్నుంచి అంతే. డబ్బుకి ఆయన మహాలంకె.

వీళ్ళా నా భార్యా పిల్లలు!

తననెంతో గౌరవించి ప్రాణప్రదంగ ప్రేమిస్తున్నారనుకున్న తన భార్యా పిల్లలు వీళ్ళేనా



"ఇంద్రుడు-చంద్రుడు"లో కమల్‌హాసన్, విజయశాంతి

# 'రాయల' రాజధాని కాలేక పోయిన రాయలసీమ గ్రామం



శ్రీ విజయరాయార కట్టె-చిప్పగిరి

శ్రీ విజయదాసులవారి బృందావనం

శ్రీ విరూపాక్షస్వామి ఆశీస్సులతో విజయనగర ప్రభువులు 'హంపీ' విజయనగరాన్ని రాజధానిగా చేసుకుని పరిపాలన సాగించేరన్నది పది మందికీ తెలుసు కానీ, 'నాడూ– నేడూ' నీళ్లకై అలమటించే రాయలసీమ నాడు 'రాయలు' సీమయ్యె అలరారే అదృష్టం నీళ్లవల్లే కోల్పోయిందంటే "అయ్యో!" అన్పిస్తుంది

రాయలసీమ ముఖ్య రైల్వే కూడలి 'గుంతకల్'కు సుమారు 10 కి.మీ దూరంలో వున్న 'చిప్పగిరి' గ్రామం, తొలుత విజయనగర ప్రభువులచే రాజధానిగా నిర్ణయింపబడి నిర్మాణాలను చేపట్టేరట. అయితే నీటిని నూతుల (బావి) నుండి 'చిప్పల'తో (చిన్న చిన్న తాటి దొన్నెలు) తోడవలసి రావడంతో విసిగి, నిర్మాణాలను నిలిపివేసేరు. చిప్పలతో నీళ్లు తోడుకున్నందున నాటి నుండి ఆ ప్రాంతం 'చిప్పగిరి'గా పిలువబడుతోంది ప్రకృతి సహకరించని ఆ ప్రాంతాన్ని వదలి, తుంగభద్రా నదీ తీరాన, హంపీని రాజధానిగా చేసుకుని, ప్రభువులు పరిపాలన సాగించేరని చిప్పగిరి పెద్దల మాట.

శిథిలావస్థలో నున్న ఈశ్వర దేవాలయాలు, సగంలో నిర్మాణం నిలుపబడన కొండపైని కోటబురుజులు నాటి దురదృష్టాన్ని వివరిస్తున్నాయి

భృగు అంశ సంభూతులు, భక్తపురందరదాసు వారసులు, సాక్షాత్ కాశీ విశ్వేశ్వరునిచే "తుంబుర" ప్రసాదితులైన 'శ్రీ విజయదాసుల" వారు కర్తవ్య నిర్వహణ ముగించుకుని చిప్పగిరిలో బృందావనులై దురదృష్టవంతమైన ఆ ప్రాంతానికి పవిత్రత చేకూర్చేరు.

– నిడమర్తి ఆదిలక్ష్మీప్రసాద్

లసలే బాగా లేవు అందుకని కొనలేదుగాని

'ఈ ముసిలాయన బ్రతికుండగా మన సరదాలు తీరవు' కూతురి స్టేట్‌మెంటది

వినలేక రిసీవర్ ఆఫ్ చేశాడు సతీష్

వెళ్ళి తలుపు గడియపెట్టి లైటు తీసేసి పడుకొన్నాడు

ఇందాక అతని మెదడు పగిలినట్లయితే–

ఇప్పుడతని హృదయం కాలిపోతున్నట్లుంది

చాలా సేపయిం తర్వాత గాయత్రివచ్చి తలుపు తట్టింది

'నాకు తలనొప్పిగా వుంది డిస్టర్బ్ చేయొద్దు అన్నాడు సతీష్

'కొంచెం కాఫీతాగి, టాబ్లెట్ వేసుకోండి'

'ఏం వద్దు '

గాయత్రి వెళ్ళిపోయిన ధ్వని

రాత్రిచాలా సేపు సతీష్ నిద్రపోలేదు

తెల్లవారింది

మామూలుగా అంతా ఎనిమిది గంటలకల్లా డైనింగ్‌హాల్లోకొచ్చారు

అలవాటుకు విరుద్ధంగా సతీష్ అక్కడ లేడు

ఆశ్చర్యంగా ఒకళ్ళ మొహాలు ఒకళ్ళు చూసుకున్నారు

ఎనిమిదిన్నర కావస్తోంది టిఫిన్ చల్లారుతోంది

గాయత్రి పైకెళ్ళటానికి మెట్ల దగ్గరికొచ్చింది అప్పుడేపైనుండి కిందికొస్తున్నాడు సతీష్

గాయత్రి రెండు మెట్లెక్కి "ఏమిటండీ ఒంట్లో బాగా లేదా పెందరాడే లేవక పోతే, రాత్రి ఒంట్లో బాగా లేదన్నారుగదా, విశ్రాంతి తీసుకుంటారులే అని లేపలేదు ఇప్పుడెలా వుంది?' ఆదుర్దా మాటల్లో, కళ్ళల్లో, మొహంలో ప్రతిఫలిస్తుండగా అడిగింది గాయత్రి

'ఏంటమ్మా నాన్నగారికి ఒంట్లో బాగా లేదా? మరి రాత్రే ఎందుకు చెప్పలేదూ' కొడుకు ఆందోళన

'నేనప్పుడే అనుకున్నా డాడీ ఇంత పెందరాళే పడుకోవటమేమిటా అని' బగత్ సమర్థన

ఒకసారి ఆయన్ని చెకప్ చేయండి కోడలు కొడుక్కు సలహా యిస్తోంది 'మీరు రాత్రే ఎందుకు చెప్పలేదు' అత్తగార్ని అడుగుతోంది

'ఎలా వుంది నాన్నగారూ ఒంట్లో! ఇలా రండి బి పి చూస్తాను టేబుల్ మూందు నుండి లేస్తూ అన్నాడు కృష్ణ

అందరివైపు ఒకసారి చూశాడు సతీష్ మెట్లన్ని దిగి కిందికొచ్చాడు "ఏం లేదులేరా! మీ అమ్మకి బాగా ఖంగారెక్కువ మీరు టిఫిన్ చేయండి" అంటూ బైటికి నడిచాడు

హాల్లో పూలకుండీలోని ట్రాన్స్‌మీటర్ చేతిలోకి తీసుకొని దానివైపు పరీక్షగా కొన్ని క్షణాలు చూశాడు

ఏదో నిశ్చయించుకొన్నట్లుగా బైటికొచ్చి రిసీవర్ని, ట్రాన్స్‌మీటర్‌ని బలంకొద్దీ రోడ్డుమీదికి విసిరేశాడు ●

ఒక్కొక్కరిలో ఎంత స్వార్థం? అసూయ ఉన్నాయి!

అనుబంధానికి తావేలేదా? తండ్రినన్న గౌరవం లేదా?

వీళ్ళు పైకి కన్పరచే భక్తి, భయం వినయం అన్ని నటనేనా! లోలోపల వీళ్ళకి తనపై ఎంత ద్వేషం

స్నేహితుడి స్కూటర్ నడుపుతూ యాక్సిడెంట్ చేశాడని, బాగా డ్రైవింగ్ వచ్చేదాకా స్కూటర్

## ప్రియం– అప్రియం

కొనివ్వనన్నాడు తను అంతేగాని వాడికి స్కూటర్ కొనటం కష్టమా తనకి?

ఒక్కగా నొక్క ఆడపిల్లకి కోరిన నగ చేయించలేని తాహతులేని వాడు కాదు తను

కాని అది వేసుకొని కాలేజీకి వెళ్తుంది రోజు

# విద్యార్థులలో అశాంతి ఎందుకు?

పురుషుల కళాశాలలో కంటె మహిళా కళాశాలలో ఉపాధ్యాయినులు స్త్రీ సహజ లక్షణాలైన ఓర్పు, క్రమశిక్షణ, విధేయతతో బాధ్యత నెరిగి విధులను నెరవేర్చుటచే మహిళా కళాశాల ప్రిన్సిపాలుకే సమస్య లెక్కువగా వుండవు. పైగా బాలుర కంటె బాలికలు బాగా చదివి ఉత్తమ శ్రేణిలో పాసవుతారు. బాలికలకు విద్య మీదనే దృష్టి. అయినా సంఘంలో వున్న విద్యార్థుల యందు కల అశాంతి ప్రభావం విద్యార్థినుల మీద కూడ వుండక తప్పదు. మొత్తం మీద విద్యార్థి లోకమును బాధించుచున్న అశాంతిని గూర్చి అందరూ ఆలోచించక తప్పదు.

## పద్మావతీ మహిళా కళాశాల ప్రిన్సిపాల్ అభిప్రాయం

ఒక కాలేజి ప్రిన్సిపాలుగా నాకు కనిపించే ప్రధాన కారణం... విద్యార్థులు ఎంత కష్టపడి చదివినా వుద్యోగాలు ప్రతిభ ననుసరించి వారికి దొరకకపోవడం- విద్యార్థి కుటుంబ ఆర్థిక దుస్థితి. విద్యార్థులకు తమ భవిష్యత్తు ఆశాజనకంగా కనబడకపోవడం మొదలైన కారణాల వల్ల- విద్యార్థులు అల్లరులను సృష్టించి తద్వారా ఆనందాన్ని పొందుతారు. ఇది ఒక విధమైన శాడిస్ట్ ఆనందం.

వెనుకటి రోజులలో తల్లిదండ్రులు, చదువుకునే తమ పిల్లల ప్రవర్తన యందు శ్రద్ధాసక్తులు చూపెట్టేవారు. కానీ యిపుడటువంటి పరిస్థితి లేదు.



ACC. NO.
CL. NO.
LANGUAGE... DATE:

శ్రీ సర్వా రామమోహన ప్రసాద్

బందరులోని పద్మావతి మహిళా కళాశాల ప్రిన్సిపాలు శ్రీ సర్వారామమోహన ప్రసాద్ గారు సమర్థులైన ప్రిన్సిపాలుగా కళాశాలలో పేరు పొందారు. వారు చరిత్రలో ఎం. ఎ. పట్టా పుచ్చుకున్నా ఆంగ్లాంధ్ర సాహిత్యాలందు ఆసక్తి, గాఢ పరిచయం కలవారు. విద్యావేత్త.

కానీ ఒకటి నిజం. ప్రిన్సిపాలు దగ్గర నుండి పిల్లల గురించి రిపోర్టు వెడితే తల్లిదండ్రులు తమ పిల్లలను శిక్షించడానికి బదులు- విద్యార్థుల ఎదుటే ఉపాధ్యాయులను నిందించుటయో, కళాశాలలను విమర్శించుటయో చేస్తారు. అట్టి సమయంలో విద్యార్థులకు కళాశాల మీద- ప్రిన్సిపాలు మీద, లెక్చరర్ల మీద గౌరవం ఎలా వుంటుంది?

ఇక ఉపాధ్యాయులు కూడ ఈ అశాంతి సృష్టికి గల కారణాలలో పాలుపంచుకోక తప్పదు.

ఉపాధ్యాయులు తమ యిళ్ల వద్ద ట్యూషన్లు మానేయాలి. క్లాసులో విద్యార్థులందరికీ బోధపడునట్లుగా పాఠాలు చెప్పాలి. ఉపాధ్యాయుడు ధనవంతుల పిల్లలను, బీద పిల్లలను ఒకే దృష్టితో చూడాలి. అపుడా ఉపాధ్యాయుణ్ణి విద్యార్థులు ఎంతగానో గౌరవిస్తారు. ఉపాధ్యాయులు తమ నైతిక ప్రవర్తన చేత, పాండిత్యం చేత, స్వీయ క్రమశిక్షణా ప్రదర్శన చేత- విద్యార్థులను ప్రభావితం చేసి- మార్గదర్శకంగా వుండాలి. అప్పుడు విద్యార్థి లోకములోని వాతావరణమే మారిపోతుంది.

రాజకీయ నాయకులు కళాశాలలకు చాలా దూరంగా వుండాలి. అరాచక చర్యలను ప్రోత్సహించరాదు. అశాంతికి ప్రభుత్వ బాధ్యత కూడ కొంత వుంది. ప్రభుత్వం ఏర్పాటు చేసిన రిజర్వేషన్లు వుండవలసిందే. ఎవరూ కాదనరు. కానీ రిజర్వేషన్లు మినహాయించి మిగిలిన వుద్యోగాలలో ప్రభుత్వం ప్రతిభకు ప్రాధాన్యతనివ్వాలి. అపుడు వున్నత వర్గ విద్యార్థులు ఉత్సాహంతో విద్య యెడ శ్రద్ధ వహిస్తారు.

నేడు ఈ విద్యా ప్రపంచం పంచభూతముల సృష్టి అని చెప్పొచ్చు. విద్యార్థి – ఉపాధ్యాయుడు- తల్లిదండ్రులు- రాజకీయ నాయకుడు- ప్రభుత్వము- ఏ భూతము సహకారం లేకపోయినా విద్యా ప్రపంచములో సృష్టి క్రమము అస్తవ్యస్తమై అశాంతి ఏర్పడుతుంది.

(సేకరణ : విన్నకోట సుశీలాదేవి)

# మంచు మనిషి

ఉజ్బెకిస్తాన్‌లో 'యతి' అనబడే మంచు మనిషి కనబడ్డాడుట. ఈ మనిషిని అమెరికా, మంగోలియా, ఆస్ట్రేలియా ప్రాంతాల్లో ప్రజలు చూశారు. అసలు ఈ మనిషి రహస్య మేమిటో కనుక్కునేందుకు మానవాళి కృషి జరుపుతునే వుంది.

1921 లో ఎవరెస్టు శిఖరం మీద పెద్ద పెద్ద అడుగుజాడలు ఒక పరిశోధనక బృందానికి దర్శన మిచ్చాయట. అప్పటి నుంచి ఆ జీవిని 'మంచు మనిషి' గాను, 'యతి'గాను అభివర్ణిస్తున్నారు.

ఈ 'యతి' మంచు శిఖరాలమీదే నివసిస్తాడనుకోవడానికి వీల్లేదట. రష్యాలోని కోలా ద్వీపకల్ప ప్రాంతంలోను, ఉక్రేయిన్‌లోనూ 'యతి' జాడలు కన్పించాయి. శాకాహారి అయిన ఈ వింత ప్రాణి కూరలూ, పళ్ళూ తినడం చాలా మంది కంటపడిందట కూడా.

కాగా కొన్ని దశాబ్దాల క్రితం వరకు యతి లు వ్యవసాయం పనుల్లో తమకు సహకరిస్తుండేవని చైనా రైతులు చెప్తున్నారు. మానవులతో సంబంధాలు పెట్టుకునేందుకు కూడా అవి ప్రయత్నించాయట. 'యతి' ని గురించిన పరిశోధనకుగాను యిటీవలే సోవియట్ యూనియన్‌లో "జీవశాస్త్ర పరిశోధక బృందం" ఒకటి ఏర్పడింది.



# కోస్టల్ హెల్త్ కేర్



40-1-53, Banz Circle,
Vijayawada-520 010. Tel: 75037

## పిల్లలులేని దంపతులకు ఆశాదీపం
## మాతృత్వం కోరే మగువలకు మహదవకాశం

# కోస్టల్ హెల్త్ కేర్ వారి

## INFERTILITY CLINIC

కోస్తా జిల్లాలలో ప్రప్రథమంగా **03-09-89** నుండి ప్రారంభం

స్త్రీ సంబంధిత పర్యవేక్షకులు
(Female Workup)

పురుష సంబంధిత పర్యవేక్షకులు
(Male Workup)

హార్మోన్ సంబంధిత పర్యవేక్షకులు
(Hormonal Work-up)

గర్భధారణ పర్యవేక్షకులు
(Assisted fertilisation and Invitrofertilisation)

Dr. N. పాండ్యన్, MD,DGO,MNAMS
కన్‌సల్‌టెంట్ అపోలో హాస్పటల్, మద్రాస్.

### వైద్యపరిశోధనా కేంద్రాలు

ముఖ్యసలహాదారు

Dr. T. ఇందిర MD, DGO, MRCOG (ఇంగ్లండు)
బొంబాయి.

* కన్‌సల్‌టేషన్‌కు ముందుగా అపాయింట్‌మెంట్ తీసుకొనవలెను.

## సీరియల్

# 3

(గత సంచిక తరువాయి)

"షో!" అంది పింకీ

సేట్ చమన్‌లాల్ ముఖమల్ చేతిగుడ్డతో నుదుటి మీద అలుముకుంటున్న స్వేదబిందువులు తుడుచుకుంటూ వణుకుతున్న చేత్తో మూడు ముక్కలూ టేబుల్ మీద పరిచాడు

"షో!"

రాజు- రాణి- జాకీ!

తల తిప్పి ప్రభు వైపు చూశాడు సేట్ చమన్‌లాల్

అఖరి దమ్ము లాగి సిగరెట్ యాష్‌ట్రేలో నులిమేస్తూ మౌనంగా తన చేతిలోని మూడు ముక్కలూ టేబుల్ మీద పరిచాడతను

మూడు జాకీలు!

సేట్ చమన్‌లాల్ మొహం ప్రకాశించింది

ఇందాకట్నుంచీ వర్సగా ఆరాటలు ఓడిపోయాడతను

ఈ సారైనా గెలిస్తే !

పింకీ వైపు చురుగ్గా చూసి కనుబొమ్మలు పైకెత్తాడు

ఆమె నిర్లక్ష్యంగా ముంగురులు సవరించుకుంటూ ఒక్కో ముక్కా టేబుల్ మీద పెట్టింది

"రాజు "

సేట్ చమన్‌లాల్ అసహనంగా కదిలాడు

రాణి " అంది పింకీ

చమన్‌లాల్ గుటకలు మింగాడు

పింకీ చివరగా మూడో ముక్క కూడా టేబుల్ మీద పెట్టింది

"ఆస్ !"

సేట్ చమన్‌లాల్ కుర్చీలో కూరుకుపోయాడు

పింకీ చకచకా డబ్బు కలెక్ట్ చేసుకుంటూ లేచి నిలబడింది

'గుడ్ బై సేట్ జీ!"

సేట్ చమన్‌లాల్ చటుక్కున ఆమె చెయ్యి పట్టుకున్నాడు

"ఇదీ అన్యాయం జీ!" అన్నాడు కీచుగా

పింకీ కనుబొమలు పైకెత్తింది

"అన్యాయం యేవిటి సేట్‌జీ!"

"నాదీ రొక్కం పట్కాపోతం!"

పింకీ చిత్రంగా నవ్వింది

"ఇంకా ఆడాలని వుబలాటంగా వుందా సేట్‌జీ?" హేళనగా అడిగింది

చమన్‌లాల్ బలహీనంగా తలూపాడు

పింకీ తిరిగి కూర్చుంది

"ఆల్‌రైట్, షఫుల్!"

ప్రభు మౌనంగా మరో సిగరెట్ వెలిగించి చకచకా ముక్కలు పంచాడు

పింకీ తన ముక్కల వైపు చూసుకుంది

మూడు జాకీలు

సాలోచనగా ఆమె ప్రభు వైపు చూసింది

అతని మొహం భావరహితంగా వుంది

చమన్‌లాల్ వైపు తల తిప్పిందామె

అతని మొహం ఈసారి కాగడాలా వెలిగిపోతోంది

"కాయండి సేట్‌జీ!" కుర్చీలో తాపీగా వెనక్కి వాలుతూ అన్నాడు ప్రభు

చమన్‌లాల్ పింకీ వైపు చూశాడు



"వెయ్యి!" అంది పింకీ వెయ్యి రూపాయల కట్ట టేబుల్ మీద పడేస్తూ

"రెండు వేలు!" టేబుల్ మీద పెట్టాడు ప్రభు.

"నాలుగు వేలు!" అన్నాడు సేట్ చమన్‌లాల్

"అయిదు వేలు!" అంది పింకీ

"ఆరు వేలు!" అన్నాడు ప్రభు

సేట్ చమన్‌లాల్ ఆలోచించలేదు

"పది వేలు!"

"ఆల్‌రైట్, షో!" తన చేతిలోని ముక్కలు టేబుల్ మీద పడేసింది పింకీ

"షో!" అన్నాడు ప్రభు

రాజు – రాణి – రాజు!

సేట్ చమన్‌లాల్ విజయగర్వంతో తన చేతిలోని ముక్కలు చూపించాడు

"త్రీ ఏసెస్ జీ!" డబ్బు కలెక్ట్ చేసుకుంటూ అన్నాడు

పింకీ తన కుర్చీలో విసురుగా వెనక్కి వాలింది

చమన్‌లాల్ హుషారుగా విస్కీ ఆర్డరిచ్చాడు

"అభీ ఖేలేంగే ఆప్ మేమ్‌సాబ్?" ఓరకంటితో పింకీని చూస్తూ ఈసారి తను హేళనగా అడిగాడు

'ష్యూర్! క్యూఁ నహీ సేట్‌జీ!" ఏమీ జరగనట్టే ముందుకు వాలింది పింకీ.

"ఇల్లలగ్గానే పండగ కాలేదు సేట్‌జీ! అప్పుడే యేమైందని ఖేలియే ఖేలియే !" కవ్వింపుగా అన్నాడు ప్రభు

"హాఁ హాఁ ! క్యూఁ నహీఁ! ఖేలియే .. ఖేలియే ! మహోత్సాహంగా పేక అందుకున్నాడు చమన్‌లాల్

ఒక్కాట గెలుస్తూనే పుల్లైపోయాడతను

ఈసారి స్టేక్స్ జోరుగా సాగాయి

అదృష్టం తన వైపే వుందన్న బరోసాతో సేట్ చమన్‌లాల్ తన దగ్గరున్న డబ్బంతా కాశాడు

"షో!"

రాజు – రాజు – రాజు!

చమన్‌లాల్ మరోసారి విజయగర్వంతో చూశాడు

ప్రభు లాభం లేదన్నట్టుగా నిట్టూర్చి తన చేతిలోని ముక్కలు టేబుల్ మీద పడేశాడు

"షో!"

మళ్ళీ మూడు జాకీలు!

పింకీ చిలిపిగా నవ్వుతూ తన చేతిలోని ముక్కలు చూపించింది

త్రీ ఏసెస్!

చమన్‌లాల్ మొహం కమిలిపోయింది

"బేడ్‌లక్ సేట్‌జీ! రాం రాం!"

డబ్బంతా నిర్లక్ష్యంగా జర్కిన్ పాకెట్స్‌లో కుక్కుకుంటూ లేచి నిలబడి గాగుల్స్ పెట్టుకుంది

"రైరో!"

డబ్బంతా పోయిందన్న అక్కసుతో ఆమె వైపు దూసుకొచ్చాడు చమన్‌లాల్

అంతలోనే పామును చూసినట్టు అదిరిపడి ఆగిపోయాడు

పింకీ చేతిలో బటన్ నైఫ్ తళతళా మెరుస్తోంది

"పిచ్చి వేషాలెయ్యక సేట్‌జీ! న్యాయంగా సంపాయించిన సొమ్ము కాదుగా నువ్వు పోగొట్టుకుంది ఇంటి కెళ్ళి యే బాకీదారుడ్నో పీడిస్తే ఇంతకంతా ఇనప్పెట్టెలో 'వుంటుంది' గుడ్‌బై!" ఉచిత సలహా ఒకటి పారేసి మెరుపులా ఆ హోటల్ లోంచి బయటికెళ్ళిపోయింది

సేట్ చమన్‌లాల్ కుర్చీలో కూలబడి జుట్టు పీక్కున్నాడు

* * *

"హాయ్ డాళింగ్!" హుషారుగా ఆ గదిలో కొస్తూ అన్నాడు ప్రభు

చూయింగ్‌గమ్ నములుతూ ఎదురుగా వున్న టేబుల్ మీదికి కాళ్ళు చాచి ఏదో ఇంగ్లీషు నవల సీరియస్‌గా చదివేస్తున్న పింకీ విసురుగా తల పైకెత్తి చూసింది

"షటప్! కూత మార్చావంటే రాత మార్చగలను ఇంకెప్పుడైనా నన్నలా పిల్చావో అప్రసుండదు జాగ్రత్త!"

ప్రభుజీ కుర్చీ దగ్గరికి లాక్కుని అందులో సర్దుకున్నాడు

"సారీ పార్ట్‌నర్!" అన్నాడు బుద్ధిగా

"అలా దారికిరా! ఏవిటిలా దయచేశావ్?" సౌమ్యంగా మారిపోతూ అంది పింకీ

"ఎందుకేమిటి! నిన్నటి పేకాటలో నా షేర్ నాకియ్యవా?"

"ఓస్, అదా!" టేబుల్ మీద నుంచి కాళ్ళు దించి డెస్కులాగింది పింకీ

"నిన్న మొత్తం లాభం అరవై అయిదు వేలు ఇదిగో నీ షేర్ – ముప్పైరెండు వేలా అయి దొందలు!" అతని ముందు నోట్ల కట్టలు పడేసింది

ప్రభు ఆ డబ్బు తాకలేదు

"నాక్కావల్సిన షేర్ డబ్బు కాదు!" గోముగా చూశాడు

"మరి?" కనుబొమలు పైకెత్తిందిపింకీ

"నీ జీవితంలో షేర్! నన్ను నీ లైఫ్ పార్ట్‌నర్‌గా చేసుకోవా ఫార్ట్‌నర్!"

పింకీ అతని వైపు సీరియస్‌గా చూసి అంతలోనే పకపకా నవ్వేసింది

"ఎందుకు నవ్వుతావ్?" ఉక్రోషంగా చూశాడు ప్రభు

"ఏదైనా తెలుగు సినిమా చూసొస్తున్నావా డైలాగులు చెబుతున్నావ్?"

"అదిగో! నేనంటే నీకెప్పుడూ లోకువే" ఉడుక్కుంటూ అన్నాడు "నన్ను చూడు డార్లింగ్! నా హృదయాన్ని చూడు! ఈ కత్తితో నా గుండె చీల్చి చూడు! ఎన్ని పీసులు చేసినా అది పీచు పీచుమంటూ పింకీ పింకీ అనే అరుస్తుంది "

"ఊఁ! ఇదే సినిమాలో డైలాగ్?"

"సినిమా కాదు డార్లింగ్! ప్రేమ! నువ్వంటే ప్రేమ! నువ్వు లైలావి, నేను మజ్నూని నువ్వు పార్వతివి నేను దేవదాసుని , నువ్వు జూలియట్‌వి నేను రోమియోని , నువ్వు హీర్‌వి, నేను రాంఝాని నువ్వు !"

"స్టుపిడ్!" విసుగ్గా అంది పింకీ

"ఏమన్నావు డార్లింగ్?" ట్రాన్స్‌లోంచి బయటి కొస్తూ క్వశ్చన్ మార్కు మొహం పెట్టాడు ప్రభు

"ఐసే స్టుపిడ్!"

"స్టాప్ చేస్తాను డార్లింగ్! నువ్వు లవ్ చెయ్యి!"

**ఇంతవరకూ సాగిన కథ- 11:** విశ్వధరవర్మకు తండ్రి తదనంతరం మిగిలిన బీడు భూమిలో బావి త్రవ్వుతుండగా అపురూపమైన వజ్రం దొరుకుతుంది. అతని దాయాది అయిన వజ్రపాణి విశ్వధరవర్మ కొడుకు రాజేంద్రవర్మను, అతని కుటుంబాన్ని దారుణంగా చంపి ఆ వజ్రాన్ని కాజేస్తాడు. విశ్వధరవర్మ చిన్నకొడుకు నరేంద్రవర్మపై హత్యానేరం మోపబడి ఉరిశిక్ష పడుతుంది. నరేంద్రవర్మ భార్య కౌసల్య మగ మగబిడ్డను ప్రసవిస్తుంది. మనవడు పుట్టిన ఆనందంలో విశ్వధరవర్మ ధైర్యం పుంజుకొని వజ్రపాణి అంతం చూస్తానని బెదిరిస్తాడు. ఒక గూడెంలోని చిన్నోడు- మరో గూడెంలోని సిన్నమ్మ ప్రేమించుకుంటారు. ఒకనాడు అడవిలో సరసాల్లో వున్న ఈ జంటను పులి చంపబోగా వజ్రకాయుడొకడు అడ్డుపడి దాని అంతం చూస్తాడు. బాబా పెట్టిన పరీక్షలో నెగ్గుతాడు శక్తి.

ఈసీరియల్ సమర్పిస్తున్నవారు : కోస్టల్ హెల్త్ కేర్, A.B.C. హెల్త్ కార్డ్.






ఆనందానికి మరియు సంతృప్తికి

డేప్ శిలా ఫోర్టె కాప్సుల్స్




ఆయుర్వేద విశిష్ట ఔషధి

దక్కన్ ఆయుర్వేదాశ్రమ్
ఫార్మసీ లిమిటెడ్
సైదాబాద్, హైదరాబాద్ - 500 659







నూనె, క్రొవ్వు పదార్థాలు తగ్గించుకోండి
రుచిని మాత్రం తగ్గించుకోకండి.

నిర్లేప్ మీకు రుచి, దాంతోటే ఆరోగ్యం అందిస్తుంది
ప్రత్యేకమైన నాన్‌స్టిక్ పూత కలిగినది కనుక నూనె పదార్థాలు
తక్కువగా వాడినప్పటికీ, మీ కుటుంబం వారికి పసందైన
భోజనం రుచికరంగా తయారుచేసుకోవచ్చు "

అవునండీ, మీ కుటుంబానికంతా మంచి ఆరోగ్యానికి
హామీ ఇస్తుంది నిర్లేప్

• వంట పాత్రల విస్తృత శ్రేణి
• తక్షణ విక్రయానంతర సేవ
• ఐఎస్ఐ మార్కు పొందిన ఉత్కృష్ట నాణ్యత

నిర్లేప్

నాన్‌స్టిక్ కుక్ వేర్




అన్ని ప్రసిద్ధి చెందిన దుకాణములలో లభించును



ఆంధ్రప్రదేశ్‌కు డిస్ట్రిబ్యూటర్లు

Mahavir Enterprises

కాంచన్‌జంగ కాంప్లెక్స్, కింగ్ కోఠి రోడ్,
హైదరాబాద్-1 ఫోన్స్: 231198, 231747

అన్ని ప్రముఖ దుకాణాలలో లభించును

# వజ్రసంకల్పం

"చేస్తాను ముందు నువ్వర్జంటుగా వెళ్ళి మూసీలో దూకు"

"నీళ్ళు లేవే! కీళ్ళు విరిగి చస్తాను! అయినా దేనికి డార్లింగ్?"

"ఇందాక వాగావే వర్సగా పేర్లు వాళ్ళెవరూ బతికుండగా కలవలేదు"

"ఐసీ! అయితే బతికుండగా కలిసిన జంట పేరు చెబుతాను!"

"నా కోసం చచ్చే వుద్దేశం మాత్రం లేదన్న మాట!"

"లేదు డార్లింగ్! బ్రతికి యుండిన సుఖములు బడయవచ్చు మనిద్దరం కలిసి!"

పింకీ ఈ సారి నిజంగానే నవ్వేసింది

ఇతనెప్పుడూ ఇంతే!

ఎలాంటి కోపంలో వున్నా ఇట్టే నవ్వించేస్తాడు

చాలా రోజుల్నించీ ప్రభుతో జట్టు కట్టింది తను లోకాన్ని మోసం చేసి డబ్బు సంపాయించడం తమ వృత్తి ఆ వృత్తిలో పార్ట్‌నర్స్ తామిద్దరూ అయితే అంతకు మించి ప్రత్యేకమైన ఇదేమీ లేదతని మీద

అతను మాత్రం అలాకాదు

నెంబర్ వన్ రకం జిడ్డు!

ప్రేమించానంటాడు

ఇలా గోల చేస్తుంటాడు

తనతన్ని విదిలించి కొడుతుంది

వదలడు

తిడుతుంది

పట్టించుకోడు

అతని ధోరణి అతనిది

అలాగని అమాయకుడనుకుంటే పొరపాటు

అవులిస్తే పేగులు లెక్కబెట్టే మనిషి

పింకీకి అతని మీద ఒక్క విషయంలో మాత్రం బ్రహ్మాండమైన అభిమానముంది

తన పట్ల అతని సిన్సియారిటీ

ప్రభు ఎంత కేటుగాడైనా తనని మాత్రం డబ్బు విషయంలో మోసం చెయ్యడు

ఎన్నోసార్లు టెస్ట్ చేసి చూసింది

అన్నిసార్లూ ఫస్ట్‌మార్కు అతనిదే

అందుకే తనూ అతన్ని మోసం చెయ్యడానికి ప్రయత్నించదు

అతనిలో ఆమెకు నచ్చిన మరో అంశమేమిటంటే లోకాన్ని మోసం చెయ్యడంలో కూడా అతని నిజాయితీ

"మనం మోసం చేసినా దగుల్బాజీలనే చెయ్యాలి గానీ మంచివాళ్ళ నెప్పుడూ మోసం చెయ్యకూడదు పార్ట్‌నర్!" అప్పుడప్పుడూ చెబుతుంటాడతను

"కష్టపడి సంపాయించే డబ్బుతో బతుకుతున్న వాళ్ళని మోసం చేస్తే పాపం చుట్టుకుంటుంది ఇతరుల్ని పీడించి డబ్బు మూట కట్టుకున్న వాళ్ళని ఖాళీ చేస్తే పుణ్యమొస్తుంది" ఇదీ అతని ఫిలాసఫీ

పింకీకి అతన్లో నచ్చని అంశం ఒకటుంది

ప్రభుకు దేవుడంటే వల్లమాలిన భక్తి

పింకీకి దేవుడున్నాడో లేడో స్పష్టంగా తెలీదు

కానీ దేవుడి పేరు చెబితే ఆమెకు కోపం

దేవుడే వుంటే ఈ లోకం ఇలా తగలడదు

అదీ ఆమె వాదన

ప్రభు ఆమెను ఆట పట్టిస్తుంటాడు

దేవుడున్నాడనే వాళ్ళకంటే దేవుడు లేడనే వాళ్ళే పుణ్యాత్ములు కోపం వచ్చినప్పుడల్లా తిట్టుకోవడానికైనా దేవుడ్ని తల్చుకుంటారు అదీ ఒకరకమైన భక్తేనంటాడు

ఇద్దరూ ఎంత పోట్లాడుకున్నా చివర్లో ఆమెనే నెగ్గనిస్తాడు అతని మీద సంపూర్ణాధిపత్యం ఆమెదే అందుకే అతన్ని ఈజీగా డామినేట్ చేసి పారేస్తుంది

ఏమైనా, ఇద్దరికిద్దరే పోర్జంటీలు!

ఎదుటి వాళ్ళకు టోపీ వెయ్యడంలో ఘటికులు

మూడు ముక్కలాటలో ఎలాంటి మేజిక్కులు చెయ్యకుండానే ఎదుటి ఆటగాడ్ని దివాళా తీయించడం వాళ్ళు సర్వసాధారణంగా ప్రయోగించే ట్రిక్ చిన్న చిట్కాతో అది సాధించవచ్చని ప్రభుకు నేర్పింది పింకీయే ఎటొచ్చీ ఆ ఆట ఒక్కడితోనే ఆడాలి

మూడు ముక్కలాట కేవలం అదృష్టంతో కూడుకున్న ఆట దాంట్లో ఆటగాడి చాతుర్యం యేమీ వుండదు అందుకే ప్రభుత్వం దాన్ని నిషేధించింది అయినా ఆ ఆటాడించే క్లబ్బులు హైదరాబాదులో అనేకం వున్నాయి

పింకీ ప్రయోగించే ట్రిక్ ఏమిటంటే ముందుగా తనో పేకాట క్లబ్బుకెళ్ళి ఓ ఆటగాడ్ని ఎన్నుకోవడం అతను తెలివిగలవాడై వుండకూడదనేది మొదటి రూలు

పింకీ లాంటి బ్యూటీ పేకాటకు పిలిస్తే రుష్యశృంగుడైనా వచ్చి కూర్చుంటాడు ఆ తర్వాత నెమ్మదిగా సీన్లో ప్రవేశిస్తాడు ప్రభు ముగ్గురూ కలిసి ఆట ప్రారంభిస్తారు పింకీ ప్రభూలిద్దరూ ఒకటే జట్టని మూడో ఆటగాడికి తెలీదు అంతకుమించి వాళ్ళు చేసే మోసమేమీ వుండదు ఆ తర్వాత జరగాల్సిందంతా దానంతటదే జరిగి పోతుంది




భారతదేశంలో ఆభరణాలను ధరించడం కొందరిలో అధికారానికి చిహ్నమయితే, మరికొందరికి వివాహానికి, దైవికమైన, రాజరికమయిన చిహ్నంగా పరిగణింపబడే వైదికచర్య. సంపదకు ప్రతీకగానేగాక సాంప్రదాయాల ఆచరణకు భారతదేశంలో ప్రజలు ఆభరణాలు ధరిస్తారు.

జీవిత భాగస్వామిని, ఆకర్షించేందుకు, తమ సౌందర్యాన్ని ఇనుమడింపచేసేందుకు, స్త్రీలు ఆభరణాలను ధరించడం పురాతన కాలం నుండి వస్తూనే ఉంది. దైవసంబంధ కార్యాలల్లో భగవంతుడిని ఆభరణాలతో అలంకరించడం అనాదిగా వస్తున్న ఆచారం. రాజుల కిరీటాలలో మణి, మాణిక్యాలు రాజసాన్ని సూచిస్తుంటాయి. భారతదేశంలో మధ్య, తూర్పు ప్రాంతాలలో కడియాన్ని అధి



## వజ్రసంకల్పం నేపథ్యంలో...

# భారతీయ సాంప్రదాయాలలో ఆభరణాలు!

కారానికి చిహ్నంగా, రాజసానికి గుర్తుగా ధరిస్తారు.

పశ్చిమ, దక్షిణ ప్రాంతాలలో చెవికి, శిరస్సుపై ధరించే ఆభరణాలు సూర్య చంద్రులకు సర్పాలకు చేసే పూజగా ప్రజలు భావిస్తారు. మన ధర్మశాస్త్రంలో వివాహ తంతులో, కొన్ని ఉత్సవాలలో ఆభరణాలను తప్పనిసరిగా ధరించాలని ఉంది. అతి పేదవాడయినాసరే వివాహంలో తన కుమార్తెకు ఆభరణాలను, కనీసం ఒక్కనగయినా కట్నంగా ఇవ్వాలని మన ధర్మశాస్త్రంలో ఉంది. వివాహంలో ధరించే ఆ ఆభరణాలను, ఆమె వితంతువుగా మారినప్పుడో, మరణించినప్పుడో తీసివేయాలి కానీ ఈలోపు తీయకూడదట. ఐతే ఈ వివాహ ఆభరణాలలో ఒక ప్రాంతానికి మరో ప్రాంతానికి తేడాలు ఉంటాయి.

బెంగాల్‌లో గవ్వలతో తయారయిన కడియాలను హిందూపత్ని పవిత్రతకు చిహ్నంగా ధరిస్తే, శక్తిదేవతలను ఆహ్వానించేందుకు గుర్తుగా కడియాలను కొన్నిచోట్ల ధరిస్తారు. ఇనుపకడియాన్ని ఎడమచేతికి ధరిస్తే భర్తను చెడు శక్తులు ఆవహించవని కొందరు స్త్రీలు నమ్ముతారు ధనవంతులైతే ఈ కడియానికి బంగారం కూడా తాపడం చేయిస్తారు.

కొన్ని ప్రాంతాలలో పెళ్లయిన స్త్రీలు కాళ్లకు మెట్టెలను ధరిస్తే, ముస్లిం స్త్రీలు ముక్కుపై 'నాథ్'ను ధరిస్తారు. ఆంధ్ర, తమిళనాడులలో వివాహంలో బంగారమున్న మంగళసూత్రాన్ని వధువు మెడలో వరుడు కడితేగాని వివాహం పూర్తికాని విషయం మనకు తెలిసిందే. కాశ్మీర్‌లో వివాహాలలో చెవికి ఆభరణాలు ధరిస్తారు.

ఈ ఆభరణాల సాంప్రదాయాలు చాలా ఏళ్లనుండి మన సంస్కృతిలో భాగమైపోయాయి. ఉదాహరణకు మంగళసూత్ర ధారణ క్రీ. పూ. 3 వేల సంవత్సరాల కాలంనాటి మొహంజోదారో నాగరికత కాలంలో ఉన్నట్లు



చరిత్ర పరిశోధనలు వెల్లడిస్తున్నాయి. రాజస్థానీ స్త్రీలు తలపైన పాపిడిలో ధరించే 'టిక్కా' అనే ఆభరణం హరప్పా నాగరికతా కాలంలో ఉండేది. ఐతే వీటికి ఇప్పుడు మన వాళ్లు ఆపాదిస్తున్న పవిత్రత అనాగరికతకాలంలో ఈ ఆభరణాలకు ఉండేదా అనే విషయం తెలియదు.

మన దేశంలో కొన్ని ప్రాంతాలలో మొదటి భార్య మరణిస్తే రెండవ భార్యగా వచ్చిన స్త్రీ మొదటి భార్యకు గుర్తుగా చేతికి కడియం ధరించాలని, లేకపోతే మొదటి భార్య ఆత్మ ఆమెను వేధిస్తుందనే నమ్మకం ఉంది. పుట్టిన పిల్లలు చనిపోతుంటే, కొత్తగా పుట్టిన బిడ్డని మగపిల్లాడయితే ఆడపిల్లగా కనపడాలని ముక్కుకు కుడివైపున రంధ్రంచేసి ఆభరణాన్ని ధరింపచేస్తారు. ఆడపిల్లయితే ముక్కుకు ఎడమవైపున ముక్కుపుడక పెడతారు.

పూర్వం కొన్ని రాజరిక వ్యవస్థలలో కొన్ని కులాల వారు కొన్ని ఆభరణాలు ధరించడానికి అర్హులు కారనే రాజశాసనాలు ఉండేది. ఉదయపూర్‌లో కొన్ని వర్గాలవారు బంగారాన్ని పాదాలపై మాత్రమే ధరించవచ్చని, ధరించవలసిన బంగారం పరిమాణం నిర్ణయించే అధికారం న్యాయస్థానాలకు మాత్రమే ఉండేదని శాసనాలు ఉండేవి.

ఈజిప్టులో మరణించినవారితోపాటు వారి ఆభరణాలను దహనంచేసే ఆచారం ఉండేది. అదృష్టవశాత్తు మనకా ఆచారంలేదు. ఐతే భర్త మరణిస్తే వితంతు స్త్రీ ఆభరణాలు ధరించరాదనే మూఢనమ్మకం మనందరకూ తెలిసిందే.

---

కేవలం అదృష్టం మీద ఆధారపడిన ఆటల్లో గెలుపు పర్సెంటేజీని బట్టి వుంటుంది

ఉదాహరణకు ఎక్స్, వై అనేవాళ్ళు బొమ్మా బొరుసూ ఆడుతున్నారనుకోండి

బొమ్మాబొరుసు అదృష్టం మీద ఆధారపడిన ఆట

అందులో ఎక్స్ గానీ వైగానీ ఏ ఒక్కరో మాత్రమే గెలవాలి

అంటే గెలవడానికి ఎక్స్‌కి 1/2 ⁄ ఛాన్సు

అలాగే వైకీ 1/2 ⁄ ఛాన్సు

ఎన్నిసార్లు కాయిన్ ఎగరేసినా ఆ ఛాన్సు పర్సెంటేజీలో మార్పురాదు

మూడు ముక్కలాట కూడా అంతే

ఇద్దరు మాత్రమే ఆ ఆట ఆడుతున్నప్పుడు గెలవడానికి చెరిసగం ఛాన్సుంటుంది అయితే ఆటగాళ్ళు పెరిగే కొద్దీ ఆటలో గెలిచే ఛాన్సు పర్సెంటేజీ కూడా తగ్గిపోతుంది

ముగ్గురాటగాళ్ళు ఆడుతున్నప్పుడు గెలిచేందుకు ఒక్కొక్కరికీ 1/3⁄ ఛాన్సు

పింకీ అనుసరించే పద్ధతిలో తమాషా ఏమిటంటే తనూ ప్రభూ మరో ఆటగాడితో ఆడుతున్నప్పుడు గెలవడానికి ఆ మూడో ఆటగాడి ఛాన్సు 1/3⁄ మాత్రమే. కానీ, తామిద్దరూ కుమ్మక్కై ఆడతారు కాబట్టి తామిద్దరిలో ఎవరు గెలిచినా ఒక్కటే కాబట్టి– ఆటలో గెలిచే చాన్సు తమకే ఎక్కువ 1/2⁄ కంటే ఎక్కువ విడవకుండా ఆడుతూ పోతే 1 2 నిష్పత్తిలో తామే గెలుస్తూ వస్తారు మూడో ఆటగాడు క్రమంగా దివాళా తీస్తాడు

కాకపోతే 33 33⁄ రిస్కు తాము తీసుకోవల్సి వుంటుంది

ఓడే ఛాన్సు కంటే గెలిచే చాన్సే ఎక్కువ

సింపుల్ మేథమేటిక్స్

సింపుల్ థియరీ

కేవలం అదృష్టం మీద ఆధారప డ్డ ఆటలో నే ఈ రకమైన మోసం సాధ్యం అయితే విడవకుండా ఆడుతూ పోవాలి

తెలివిగలవాడైతే మూడో ఆటగాడు మోసం గ్రహించగలడు కానీ, సేట్ చమన్‌లాల్‌కు అంత తెలివి లేదు

"అయితే నా లైఫ్ పార్ట్‌నర్ వవుతావా?" ఆమె నవ్వులో చల్లదనం గమనించి ఆశగా చూశాడు ప్రభు

పింకీ చటుక్కున నవ్వాపేసి సీరియస్‌గా మొహం పెట్టింది

'ముందు గోల చెయ్యడం మానేసి ఆ డబ్బు తీస్కో" అంది ఆజ్ఞాపిస్తున్నట్టు

"కానీ " ఏదో అనబోయాడు ప్రభు

"నో కానీ బిజినెస్! ముందా డబ్బు తీస్కో!"

బిక్కమొహం పెట్టుకుని డబ్బు తీసుకున్నాడు ప్రభు

పింకీ తన మొహం మీది సీరియస్‌నెస్

పాఠకులకో సవాల్!




వరద లొచ్చాయి కొంపలు మునిగాయ్ కాస్త 'హెల్ప్' గురూ!

ఇది ఒ వాగ్బాణం అనుకొండి దీన్ని మరో వాగ్బాణంతో మీరు ఉపసంహరించాలి- ఈ "రిపార్టీ" గుచ్చుకోవాలేగాని బాధించకూడదు. రసభరితంగా వుండాలేగాని అశ్లీలం కొట్ట వచ్చినట్లుండరాదు... కార్డు మీద మాత్రం రాయాలి. ఈ వాక్యం పైన రాసి మీ ప్రతి వాక్యం దాని క్రింద రాయండి. మీ పూర్తి చిరునామా ముఖ్యం.ప్రచురించిన రెంటికి రు. 25, రు. 15 చొప్పున బహుమతి వుంటుంది!- ఈ విషయంలో సంపాదకునిదే తుది నిర్ణయం.

12-9-'89 లోగా అందేలాగా రిపార్టీలు పంపించాలి!

చాలా మంది వెంటనే"రిపార్టీ"ల వర్షం కురిపించారు. కొన్ని మాత్రం ఎంపిక చేసి వేస్తున్నాం. బహుమతులు పొందిన రెండూకాక- మరికొన్ని యిక్కడ వేశాము. తతిమ్మా వారి "వాగ్బాణాలు" స్థలాభావం చేత వేయలేకపోయాం. లాటరీ తీసి కొందరిపేర్లు మాత్రం వేస్తున్నాం! ఒకసారి బహుమతి రాలేదని నిరుత్సాహ పడక మళ్లీ ప్రయత్నించండి!

-ఎడిటర్

"గుళ్లోకి చొక్కా లేకుండా రావాలితెలుసా?"

* రు. 25 బహుమతి పొందిన రిపార్టీ:

"అయ్యా! యిక్కడ దోమలబాధ భరించలేక చొక్కాతో వచ్చాను!" -కోపూరి రవికుమార్ (తెనాలి)

* రు. 15 బహుమతి పొందిన రిపార్టీ:

"ఏదో ఆడపిల్ల ముచ్చటపడి వేసుకుంది! ఈసారికి ఒగ్గేయాలి!" -తుర్లి రాజగోపాల్ (రాజమండ్రి)

మరి కొన్ని వాగ్బాణాలు.

"అబ్బ ఆశ! చొక్కాలు బయటపెడితే మాయం చేద్దామనా?"
-ఎం. ఎ. అయూబ్ (ఇట్టప్రోలు)

"తెలుసు స్వామీ! అందుకే పంజాబీ డ్రస్‌తో వచ్చాను."
-ఆర్. ప్రసూన (బలిజేపల్లి)

"మరి ఆడవాళ్ళలే...?" అన్న అర్థం వచ్చేలాగా కనీసం 200మంది వ్యాఖ్య రాసి పంపారు. వారందరికీ అభినందనలు! చోటు చాలదు కనుక పంపిన వారి వ్యాఖ్యలు అన్నిటని యివ్వలేక పోతున్నాము. కొందరి పేర్లు మాత్రం యిక్కడ యిస్తున్నాము.

"అయ్య బాబోయ్... నేనాడపిల్లనండీ, ఈ డ్రెస్ మా అన్నయ్యది!"
-కె. విజయభాస్కర్ (కొల్లూరు)

టి. ఎస్. వెంకటరమణ (తిరుపతి), పి. వినోద్‌కుమార్ (హైదరాబాద్), పి. వి. నరసింహదాసు (విజయనగరం), కె. లక్ష్మి (బొంబాయి), బి. విజయా విమల్ (మచిలీపట్నం), ఎల్.పి. చంద్ర (ధర్మవరం), ఎం. సీతన్నాయుడు (మచిలీపట్నం), షేక్ బాషా (మార్కేరు), నివాస్ (కొత్తగూడెం), ఎ. విజయలక్ష్మి (పలాస), కె. అనిల్‌కుమార్ (ఖమ్మం), బి.వి. ప్రసాద్ (మహబూబ్‌నగర్).

లక్కీ పేర్లు

ఎస్. కె. బాషా (శ్రీకాళహస్తి), వి.జె. ప్రసాద్ (విశాఖపట్నం), మహ్మద్‌రఫీ (తాళుగ్గ), ఎస్.వి.జె. మోహనరావు (తామరకొల్లు), బి.వి. ప్రసాద్ (పాలకొల్లు), టి.ఆర్. ప్రసాద్ (ప్రొద్దుటూరు), సిహెచ్. నాగేశ్వరరావు (సికింద్రాబాద్), ఎస్. శ్రీనివాసరావు (పొదిలి), పి. బాలాజీ (శ్రీనగకోట), కె.వి. ఎస్. ప్రసాద్ (కందుకూరు).

## వజ్రసంకల్పం

చెరగనివ్వలేదు

'ఇక బిజినెస్ సంగతి మాట్లాడదాం! ఓకే?'' ప్రభు అయిష్టంగా తలూపేడు

పింకీ సీరియస్‌నెస్ సడలించింది

"పేకాట గాళ్ళని మోసం చేస్తూ డబ్బు సంపాయించాలంటే మొహం , మొత్తుతోంది ఎన్నిరోజులిలా?"

"యస్! ఎన్నిరోజులిలా?' ఆమె నమ్మకరించాడు ప్రభు

"వెరైటీ కావాలి "

"యస్! వెరైటీ కావాలి '

పింకీ అతన్ని ఉరిమి చూసి అంతలో కేనవ్వేసింది

"యూ ఫూల్! సరికొత్త ఐడియా ఒకటి చెబుతాను బ్రహ్మాండమైన ఐడియా! జాగ్రత్తగా విను "

ప్రభు ఆమె వైపు కళ్ళప్పగించి చూశాడు

"కొత్త అయిడియానా?!"

పింకీ చురచురా చూసింది

"వినమంటుంటే!"

"ఆల్‌రైట్! వింటున్నాను!"

పింకీ చెప్పడం ప్రారంభించింది

* * *

పింకీ అపార్ట్‌మెంటుకు ఎదురుగా వున్న బిల్డింగ్ పైకప్పు మీద నుంచి ఇద్దరు వ్యక్తులు బైనాక్యులర్స్‌తో ఫ్రెంచి విండో గుండా ఆమెనే గమనిస్తున్నారు

ఆ ఇద్దర్లో ఎత్తుగా లావుగా వున్న వ్యక్తి నెమ్మదిగా బైనాక్యులర్స్ కిందికి దించాడు

"యస్! మనక్కావల్సిన పిట్ట అదే!" సిగరెట్ పొగ గుప్పున వదుల్తూ అన్నాడతను

అతని పక్కనున్న వ్యక్తి కుతూహలంగా చూశాడు

ఎర్రగా పొట్టిగా గుమ్మటంలా తలకు మంకీకేప్‌తో తమాషాగా కనిపిస్తున్నాడతను

"దేనికి జూ డా?" కుతూహలం పట్టలేనట్టుగా అడిగాడు

ఆ వ్యక్తి అతన్ని చురచురా చూశాడు

''ప్రశ్నలడగడం నీ వంతు కాదు డేవిడ్!''

అతని పెదవుల మీద అంతలోనే సన్నని చిరునవ్వు వెలిగింది ఉల్లాసంగా ఆ పొట్టి వాడి భుజం మీద చెయ్యి వేశాడు

"చూస్తూ వెళ్ళు చిత్ర విచిత్రాలు జరుగుతాయి!"

పొట్టి వ్యక్తి మాట్లాడలేదు

అతని వైపు కళ్ళప్పగించి చూస్తూ వుండిపోయాడు

ఆ వ్యక్తి మరోసారి బైనాక్యులర్స్ కళ్ళ దగ్గర పెట్టుకుని పింకీ అపార్ట్‌మెంటు వైపు చూడ్డం ప్రారంభించాడు

(ఇంకావుంది)

## ఆర్ద్రత

ఒక మెరుపు
మేఘాల దొంతర్లను స్పృశించి పోతే
ఒక మబ్బు తునక
పన్నీటి జల్లులు కురిసి
పిన్నారి పైరును పులకింపజేస్తుంది!
ఒక తలపు
కన్నీటి పొరలను కరిగించి పోతే
ఒక ఆశ
కమ్మని కలలు చూసి
హృదయ కుసుమాన్ని వికసింప జేస్తుంది!

—అవసరాల శంకర నారాయణరావు

## చెలామణి!

ఆ రోజుల్లో
విద్యలేనివాడు
వింతపశువన్నారు!
విజ్ఞాన వీధిలో
చెలామణి కాలేడని!
ఈ రోజుల్లో
విద్యగలవాడు
సంతపశువయ్యాడు!
కట్నాల కొరకు
చెలామణి కావాలని!

— పి ప్రశాంతి

## ఆశయాలు

నాటిపోరాటాలు, ఆశయాలు- స్వాతంత్ర్యం!
నేటి పోరాటాలు, ఆశయాలు- స్వాహాతం-
త్ర్యం!!
మన సోదరులకోసం, తెల్లవాళ్ళతుపాకీకి
గుండెచూపి ఎదురు నిలిచారు నాడు!
మన సోదరులను మనవారే కాల్చి
చంపుకుంటున్నారు నేడు!!
**దేశంకోసం, ప్రజలకోసం పదవులు**
**త్యాగం చేశారు నాడు!**
**పదవులకోసం దేశాన్ని, ప్రజలను**
**దోచుకుంటున్నారు నేడు!!**
**కారణం- నాటి ఆశయాలు స్వాతంత్ర్య ఆరా**
**టం!**
**నేటి ఆశయాలు స్వాహాతంత్ర్య ఆరాటం!!**

-తాడి మధురాధర్

## విముక్తి

పుట్టినప్పుడు మనిషికి
తల్లిగర్భంనుండి విముక్తి!
తప్పటడుగులు వేసిననాడు
తల్లిఒడినుంచి విముక్తి!
యవ్వనం వచ్చిననాడు
బాల్యంనుంచి విముక్తి!
వివాహం జరిగినప్పుడు
కావాలి పరిమిత సంతానానికి విముక్తి!
వార్ధక్యం వచ్చినప్పుడు
జీవనంనుండే విముక్తి విముక్తి విముక్తి!

— కంకటి శంకరరావు




## భ్రమ

అధికారం తామరాకుపై
నిలిచి వున్న నీటిబొట్టు
ఓ ఉద్యోగం!
దానిపై ఇంటర్వ్యూ కాంతిపడి
ముత్యంలా మురిపించింది
ముచ్చటపడి నేనందుకోబోతే —
లంచంగాలి రివ్వున వీచి
అవినీతి తటాకంలో
అది కలిసిపోయింది!

— సాదనాల వేంకటస్వామి నాయుడు

## నిజం!

నాడు
స్వాతంత్ర్యం కోసం
సర్వం త్యాగం చేశారు!
నేడు
ప్రగతి పేరిట
సర్వం స్వాహా చేస్తున్నారు !

-అమిర్నేని హరికృష్ణ

## వసంతం

ఎన్నిరాత్రుళ్ళు కన్నీళ్ళు కార్చితే
ఈరాత్రి నాకు వసంత రాత్రయ్యింది!
ఎన్ని కష్టాలు పడపోస్తే
ఈరోజు నాకు సుఖాలతీరం దొరికింది!
ఆ రాత్రుళ్ళో
కలత నిద్రలో....
నాకళ్ళు కాలవలయ్యాయి!
ఆ కష్టాల్లో..కారు చీకట్లో
నా ఒళ్ళు మల్లెలా నలిగింది!
ఖుషీలో కొందరు
గేలిచేస్తూ మరి కొందరు
నా శరీరాన్ని ఓటి కుండ చేశారు!
నన్ను అమ్మిన భర్తకోసం కాదు నా బాధ
నన్నే నమ్మిన పిల్లలకోసం నా వ్యధ!
వాళ్ళకోసం అంగట్లో బొమ్మనైనాను
అడవిలోగాచిన వెన్నెలైనాను!
మళ్లీ ఎన్నాళ్ళకు యీ ఆనందం
ఎన్నేళ్ళకు యీ వసంతం!
నన్ను కోరేవాడు దొరికాడు
కొండంత అండయినాడు!

-చొక్కర తాతారావు

## విడిది

**అన్నీ వున్నవాడికి**
**ఎండాకాలమని**
**వానాకాలమని**
**చలికాలమని**
**వుంటాయి!**
**ఏమీ లేనివాడికి**
**ఎప్పుడూ**
**ఎండాకాలమే!**
**వాడికి**
**వేసవి విడిది**
**వాడ్నే**
**ఆదుకునేవాడే!**

- యేలె బాలరాజు

**ప్రజాపతి ఫస్టియర్ ఇంజనీరింగ్ పరీక్షలో సంతృప్తికరంగా రాసిన తర్వాత ఇంటికివెళ్ళే ఆలోచన లేకుండా హాస్టల్లోనే వుండిపోయాడు. అతని అందరు మిత్రులూ సామాన్లు సర్దుకుని ఉత్సాహంగా ఇళ్ళకు బయలుదేరారు.**



# కొత్త అమ్మ

పాలకూర సీతాలక్ష్మి

"ఏరా! నువ్వు ఎప్పుడు బయల్దేరుతున్నావు?" అని అడిగిన రూమ్మేటుతో 'తను వెళ్ళదల్చుకోలేదన్న' నిజం చెప్పడం ఇష్టంలేక మాటలు తప్పించేశాడు ప్రజాపతి

విద్యార్థులంతా వెళ్ళిపోతున్న కారణంగా మెస్ మూసేస్తారని సర్క్యులర్ వచ్చింది ఊరికి దూరంగావున్న ఆ కాలేజి కాంపస్‌లో మెస్ మూసేస్తే భోజనంకి యిబ్బంది కలగకతప్పదు.

అతని తండ్రి బాలగంగాధరం మరో ఉత్తరం రాసేడు – పరీక్షలు కాగానే వెంటనే ఇంటికి వచ్చెయ్యమని.

ఇక లాభంలేదు. ఇంటికి వెళ్ళితీరాలి. అక్కడ వున్నన్నిరోజులూ ఇబ్బందిగా గడపాలి.

ఆ ఇబ్బందికి కారణం.... కొత్త అమ్మ!

భార్యపోయిన రెండు సంవత్సరాల తర్వాత బాలగంగాధరం మళ్ళీ పెళ్ళిచేసుకున్నాడు నాలుగు నెలల క్రితం.

ఆ విషయం తెలుపుతూ తండ్రి రాసిన ఉత్తరం అందుకోగానే అతనిలో అగ్ని రేగింది.

'ఛ.... ఆ అవసరం ఏమిటి?నలుగురిలో తలవంపులు తెచ్చేపని చేశాడు నాన్న. అమ్మను అంత త్వరగా ఎలా మర్చిపోగలిగేడు? పైగా పిల్లల కోసమే ఆ పెళ్ళి అంటూ వంక కూడాను' అనుకున్నాడు.

అతనికి పన్నెండు సంవత్సరాల చెల్లెలు, ఎనిమిదేళ్ళ తమ్ముడు వున్నారు. పిల్లలు మరీ అంత చిన్నవాళ్ళు కాదు. మరి నాన్న వంక నిజంగా వంకే కదూ! ఆ కొత్త అమ్మను చూడాలనిలేదు. అందుకే ఇంటికివెళ్ళదల్చుకోలేదు.

అప్పుడే అతనిలో మరో కొత్త ఆలోచన.....

తను వెళ్ళాలి. ఆ కొత్త అమ్మ మనసు గాయపరచాలి. తమ్ముడినీ, చెల్లాయినీ కూడా తనవైపు తిప్పుకుని ఆమెను అన్ని రకాలుగా బాధించాలి ఆమె అలా బాధపడుతుంటే తను లోలోపల ఆనందించాలి.

ఆమె పేరు ఏమిటో కూడా గుర్తులేదు. ఆమె గురించి తండ్రి రాసిన ఉత్తరం చింపేశాడు. అందుకే ఆ ఉత్తరం తీసి ఆమె పేరు ఏమిటో తెలుసుకునే అవకాశం కూడాలేదు.

అయినా పేరుతో తనకు ఏం అవసరం?

ఆ రోజే రైల్లో బయలుదేరాడు ప్రజాపతి.

* * * *

అతను ఇల్లు చేరేసరికి మధ్యాహ్నం రెండు అయ్యింది.

మూసివున్న తలుపు తట్టాడు. ఒకనిముషం తర్వాత తలుపు తెరుచుకుంది.

ఎదురుగా ఆమె!

వయసు ముప్పై సంవత్సరాలు వుండొచ్చు. అంతే... నలభై అయిదేళ్ళ నాన్నను భర్తగా స్వీకరించిన ఆవిడ వయసు నలభైవరకూ వుండొచ్చు అనుకున్నాడు కానీ మరీ యిదేమిటి?

నాన్న మరీ అన్యాయంగా ..

"ఎవరు కావాలి మీకు?" మర్యాదగా అంది ఆమె

ఆమె మాటల్లోని మర్యాదకు చలించిపోయాడు. ఆమె ముఖంలో ఏదో ఇంద్రజాలం వుందనిపించింది

"నేను ప్రజాపతిని. ఇది మా ఇల్లే." అన్నాడు చొరవగా లోపలికు వస్తూ

ఆమె ముఖంలో కన్పించిన కొండంత ఆనందం అతను చూడకపోలేదు.

"రా బాబూ.... రా.... నిన్ను చూడ్డం ఇదే మొదలు కదా. అందుకే గుర్తించలేదు. ఏం అనుకోకు" అంది మన్నింపు కోరుతున్నట్టుగా.

ఆమె మాటల్లోని మృదుత్వం అతన్ని ఆకర్షించినా ఏం పట్టించుకోనట్టు లోపలకు నడిచి బట్టలు మార్చుకోసాగేడు.

ఆమె లోపలికి వెళ్ళి రెండు నిముషాల్లో పొగలుకక్కుతున్న కాఫీ తీసుకొచ్చింది.

"ఇది తీసుకో బాబూ.... స్నానం చేసి భోజనం చెయ్యడానికి మరో అరగంటపడుతుంది కదా" అంటూ అతనికి అందించింది.

బింకంగా "అక్కర్లేదు" అనబోయాడు కానీ ప్రయాణంలో అలిసిపోయిన అతని ప్రాణం కాఫీ తాగమని ప్రోత్సహించడంతో మారు మాట్లాడకుండా గ్లాసు అందుకున్నాడు

అతను స్నానం చేసి వచ్చేసరికి కంచంలో వేడి వేడి అన్నం సిద్ధంగా వుంది.

"నీకు కొబ్బరి పచ్చడి ఇష్టం అటకదూ.... అనుకోకుండా అదే చేశాను" అంటూ పచ్చడి కంచంలో వడ్డించింది కూర పక్కగా.

"ఎవరు చెప్పారు?" అడిగేడు చిన్నగా

"ఇంకెవరు .. మీ నాన్నగారు..." అంది ఆమె.

మాట్లాడకుండా భోజనం చెయ్యసాగేడు.

"మీ నాన్నగారు రోజూ నీ గురించే అనుకుంటున్నారు ఈ పాటికి పరీక్షలు అయిపోయి వుండాలి ఇంకా ఎందుకు రాలేదా అని ఆలోచిస్తున్నారు సాయంత్రం ఆయన నిన్ను చూడగానే చాలా సంతోషిస్తారు. పరీక్షలు బాగా రాశావా బాబూ?" అడిగింది ఆమె.

జవాబు చెప్పకూడదని అనుకున్నాడు కానీ అప్రయత్నంగా తల ఊపేడు బాగా రాశానని అర్థం వచ్చేలా.

"నువ్వు చాలా తెలివైన వాడివని సీత తరుచు చెప్తూ వుంటుంది. నువ్వు కాకపోతే ఇంకెవరు బాగా రాస్తారు పరీక్షలు ." అంది ఆమె

తల ఎత్తి ఆమె ముఖంలోకి చూశాడు. ఆమె కన్నుల్లో ఏదో ఆనందం.

అతనికి అర్థం చేసుకునే శక్తి లేదు. ఆ ఆనందం తన కొడుకుని కళ్ళారా చూసుకునే ఒక తల్లిలో కలిగే ఆనందమని అతను గ్రహించ లేదు.

"మీ . మీ పేరు .. మర్చిపోయాను...." అన్నాడు చిన్నగా.

ఆమె నవ్వింది ఎందుకలా నవ్విందో



తెలియక తెల్లబోయాడు.

"నా పేరు మృదుల ఒక సంగతి చెప్పు అమ్మను 'మీరు' అంటూ మర్యాదగా పలకరించడం కంటే. 'నువ్వు' అంటూ మాట్లాడితేనే ఒక రకమైన ఆప్యాయత గోచరిస్తుంది నాకు ఏమంటావ్?" అంది మృదుల

మౌనం వహించాడు ప్రజాపతి

"ఇక ముందు మాత్రం నన్ను 'నువ్వు' అనే మాట్లాడు సరేనా?" అంది

"అదీ . అదీ " అంటూ ఏదో మాట్లాడబోతుంటే ముద్ద గొంతుక్కు అడ్డుకుని పుల మారింది అతని కళ్లలో నీళ్లు తిరిగాయి

"మంచినీళ్లు తాగు " అంటూ గ్లాసు అందించి చనువుగా అతని నెత్తిమీద చిన్నగా తట్టింది

ముక్కు ఎగపీల్చుకుంటూ ఆమె వైపు చూశాడు

"నీ గురించి ఆయన తల్చుకుంటున్నారు కాబోలు అందుకే పుల మారింది " అంది ఆమె చిన్నగా నవ్వుతూ

"కావచ్చు " అన్నాడు

"కావచ్చు కాదు ఖచ్చితంగా ఆయనే తల్చుకున్నారు ఉదయం ఆఫీసుకు వెళ్తూ అన్నారు కూడా ఈ రోజైనా నువ్వు రావాలని .." అంది మృదుల

భోజనం చేసి చెయ్యి కడుక్కున్నాడు

"లోపల గదిలో పక్క వేస్తాను కాస్సేపు నిద్రపోతే ప్రయాణపు బడలిక తగ్గుతుంది ." అంది మృదుల

అతనికూడా పడుకోవాలనే వుంది అందుకే టీచర్ చెప్పిన మాటలు బుద్ధిగా విని తల ఊపే విద్యార్థిలా తల ఊపేడు

ఆ తర్వాత వెళ్లి పడుకున్నాడు. వెంటనే నిద్ర పట్టింది

అయిదు గంటలకు మెళకువ వచ్చింది అయినా అలాగే కళ్లు మూసుకుని పడుకున్నాడు

అప్పుడే స్కూలు నుంచి సీత, గోపి వచ్చినట్లున్నారు

"మీ అన్నయ్య వచ్చాడు నిద్ర పోతున్నాడు " అంది మృదుల

సీత సంతోషంతో

"అలాగా మాట్లాడి వస్తాను " అంది

"లేపకండి ప్రయాణంలో అలిసిపోయి పడుకున్నాడు కాస్సేపట్లో లేస్తాడు అప్పుడు మాట్లాడవచ్చులే అంది మృదుల

ఈ మాటలన్నీ అతనికి వినపడుతున్నాయి.

తనమీద ఎంత శ్రద్ధ చూపిస్తోంది! లోలోపల మురిసిపోయాడు

కానీ అంతలోనే అతని మెదడు చెరిసపురుగు రొద చేసింది

"అదంతా నాటకం కావచ్చు స... తల్లికి ప్రేమ ఏమిటి ' అన్పించింది

చెల్లెల్ని, తమ్ముడినీ పలకరించా... అన్పించి మంచం దిగి వెళ్లాడు వాళ్ల... ఆప్యాయంగా దగ్గరకు తీసుకుని కబు... చెప్పాడు

పట్నంలో తను చెల్లెలు కోసం కొ... పరికిణీ గుడ్డ, తమ్ముడి కోసం కొన్న క్రి... బ్యాట్ తీసి ఇచ్చాడు

అవి చూసి ఎంతో సంబరపడ్డా... వాళ్లు

"అమ్మా అన్నయ్య చా... మంచివాడు ' అంది సీత

అక్క మాటలను మద్దతు పలికా... గోపి

"ఆ విషయం నాకూ తెలుసు అం... మృదుల నవ్వుతూ

మనసులోనే మండిపడ్డాడు ప్రజాప... ఆ విషయం తనకూ తెల్సు అని ఆ... అనడం అతనికి నచ్చలేదు తను ఆమ... చూసి కొన్ని గంటలే అయినా అప్పు... అంతా తెల్సిపోయినట్లు ఆమె ఎ... మాట్లాడుతోందో ఇదంతా ఆ... తనను మంచి చేసుకుందుకు ఆడుతు... నాటకం కాక మరేమిటి"

అప్పుడే ఆఫీసు నుంచి వచ్చి... బాలగంగాధరం కొడుకును చూస్తూ... ఆప్యాయంగా—

"వచ్చావా ప్రజా బాగుంది రో... నీ గురించి అనుకుంటున్నాన... రావడంలో ఆలస్యం చేసినట్లున్నావే అడిగేడు ఆయన

కొంచెం తడబడ్డాడు ప్రజాపతి

"లేదండీ థియరీ పరీక్షలు అయ్యా... ప్రాక్టికల్స్ కొంచెం ఆలస్యం అయ్యాయి... అందుకే రాలేదు అవి పూర్తి కాగా... వచ్చాను అన్నాడు ప్రజాపతి

'అలాగా ' అన్నట్లు తల ఊపేడ... ఆయన

అప్పుడే గురు్తు వచ్చినట్లుగా -



"మృదులా వీడే . వీడే నీ పెద్ద కొడుకు " అన్నాడు ఆయన భార్యతో

ఆమె నవ్వింది

"బాగుందండీ ఆ విషయం నాకు రెండు గంటలకే తెలుసు. ." అంది.

"ఓ అవును కదూ.. " అంటూ ఆయన కూడా నవ్వేడు.

ప్రజాపతి మాత్రం కొంచెం ఇబ్బందిగా చూశాడు అతనికి అక్కడ వుండాలని అన్పించ లేదు అందుకె ముఖం కడుక్కుందుకని లోపలకు వెళ్ళి పోయాడు.

మరో అర గంటలో బట్టలు మార్చుకుని తయారు అయ్యాడు

"అలా బయటకు వెళ్ళి వస్తానండి నా స్నేహితుల్ని కలియాలి " అన్నాడు తండ్రితో

అది విన్న మృదుల—

"అయిదు నిముషాలు ఆగుబాబు... కాఫీ కలుపుతున్నాను తాగి వెళ్ళువు గాని " అంది

ఆ తర్వాత కాఫీ తాగి బయటకు వెళ్ళి పోయాడు

అతను తిరిగి ఎనిమిది గంటలకు వచ్చాడు. అతను వస్తూనే గోపీని చూసి ఆశ్చర్యపోయాడు

పుస్తకం ముందు కూర్చుని మధ్య మధ్యలో కళ్ళు తుడుచుకుంటూ గట్టిగా పాఠం చదువుతున్నాడు.

"ఏమైంది రా అలావున్నావేం?" అడిగేడు

"అమ్మ కొట్టింది. ఈ పాఠం అప్పచెప్పేదాకా అన్నం పెట్టనంది" అన్నాడు ఒకసారి గట్టిగా రాగంతీసి

ప్రజాపతిలో ఆవేశం పొంగింది. ఎంత ధైర్యం ఆమెకి తమ్ముడ్ని కొడుతుందా? ఏమంత పెద్ద తప్పు చేశాడని?

గబగబా వంటగది వైపు దారితీశాడు మృదుల వంట పనిలో వుంది.

ఆమెను ఎలా సంభోదించాలో తోచలేదు 'అమ్మా' అనాలా, 'పిన్నీ' అనాలా, లేక పేరుపెట్టి పిలవాలా?

ఏం తోచక గోడ మీద పిల్లిలా. ..

## చుంకీ ఇంటిపై దాడి




చిలిపి చుంకీ పాండే యింటిమీద ఆదాయపు పన్ను శాఖాధికారులు దాడి చేశారట ఎవరింటిమీదన్నా ఆ శాఖ దాడి చేస్తే ఆలోచించాలి గాని సినిమా పరిశ్రమలోని వాళ్ల యింటిమీద ఆ అధికారులు దాడి చేస్తే గొప్ప విషయమేమీ కాదు ఇటువంటివాటికి వాళ్ళు అలవాటుపడిపోయి వుంటారు

ఈ దాడిలో వెల్లడైన సమాచారం ఆధారంగా చుంకీ ఆ శాఖకు చాలా కట్టాల్సి వుందట బయట ఎలా చిలిపి వేషా లేస్తున్నాడు ఆ శాఖతో కూడా చిలిపి చేష్ట లేమిటో ?

"గోపిని ఎందుకు కొట్టావు?" అన్నాడు కోపంగా

అతని గొంతు కొత్తగా ధ్వనించడంతో ఆమె ఆశ్చర్యంగా అతని వైపు చూసింది ఆ తర్వాత మామూలుగా తన పని చేసుకుంటూ —

"వాడి మంచి కోసం. వాడి బాగుకోసం" అంది

"నాన్నగారు ఎక్కడ?" అడిగేడు. ఆయనకు ఫిర్యాదు చెయ్యాలని అతని ఉద్దేశ్యం

"బయటకు వెళ్ళారు. పదిగంటల దాకా రారు ఏదో మీటింగు వుందట" అంది.

అక్కడనుంచి విసురుగా వచ్చేశాడు గోపి దగ్గరకు వచ్చి —

"ఏం చేశావు నువ్వు?" అన్నాడు.

"ఏం చెయ్యలేదు. ఈ ప్రశ్నలకు జవాబులు మొన్ననే అడుగుతానంది అమ్మ ఈ రోజు అడుగుతుంటే చెప్పలేకపోయాను. అంతే . " అన్నాడు.

"సరే చదువుకో" అంటూ సోఫాలో కూర్చుండిపోయేడు చిన్నగా పళ్ళు నూరుకున్నాడు చిన్నపిల్లలకు ఆమాత్రం అశ్రద్ధ వుండదా? అంతమాత్రానికి వాడిని ఆమె కొట్టాలా? అందుకు అధికారం వుందని ఆమె అనుకుంటోందా?

ఛ.. అసలు ఒక రకంగా తప్పంతా ఆయనదే ఎల్లల కోసం పెళ్ళిచేసుకున్నానని అన్నారుగానీ, అదే నిజమైతే ఈరోజు గోపికి ఏడుస్తూ వుండాల్సిన అవసరం ఏమిటి?

"సీతా పద వంటయ్యింది. భోజనంచేద్దువుగాని" అంది మృదుల

"మరి గోపి?" చిన్నగా అంది సీత.

"వాడు చదువు పూర్తిచేస్తేగానీ అన్నం పెట్టను నువ్వురా" అంది అధికారగళంతో మృదుల.

అంతా వింటూనేవున్నాడు ప్రజాపతి.

'సర్లే నాన్నగారు రానీ — అప్పుడు చెప్తాను' అనుకున్నాడు

సీత భోజనం చేసింది గోపీమాత్రం అక్కడే కూర్చుని చదువుకుంటున్నాడు

సోఫాలో బోర్లపడి ఏదో పుస్తకం చదువుకుంటూ ఒక కన్ను మృదులపై వుంచాడు ప్రజాపతి

"ఆయన ఎప్పుడు వస్తారో. నువ్వు భోజనం చెయ్యి" అంది మృదుల వచ్చి ప్రజాపతితో.

"తొందరలేదు ఆయన్ని రానియ్యి" అన్నాడు ప్రజాపతి

తండ్రి రాగానే ఆయనతో విషయం చెప్పి, ఆయినచేత చివాట్లు పెట్టించి ఆయన, తను, గోపి కలిసి భోజనం చెయ్యాలని అతని ప్లాన్

మరో అరగంటకు గోడకు జార్లపడి

# పెద్దల చమత్కారాలు

ప్రయాగ

## పునర్జన్మ

మేనేజర్ : చచ్చి బ్రతకటం పై నీకు నమ్మకం వుందా గుర్నాథం

గుమాస్తా : చచ్చేటంత నమ్మకం సార్

మేనేజర్ : అయితే సరే, మొన్న నువ్వు మీ మామగారు పోయారని సెలవు పెట్టి వెళ్ళాక నిన్ను చూద్దామని పాపం ఆయన మన ఆఫీసుకు వచ్చారు తెలుసా అన్నాడు మేనేజర్. గుమాస్తా బల్లకింద దూరాడు!

## పాపం! మొగుడు

భార్య : ఏమండీ! జుట్టు రాలి పోకుండా వుండేందుకు మీ కోసం మంచి మందొకటి పట్టుకొచ్చా.

భర్త : నా జుట్టేం రాలిపోవడం లేదే



భార్య : మీ జుట్టుని నేను చెప్పానా మీ ఆఫీసులో మీ టైపిస్టు కివ్వండి రోజూ అంతంత జుట్టు రాలిపోతుంటే నా ప్రాణం వుసూరుమంటోంది.

మొగుడు అక్కడ కనిపిస్తే ఒట్టు.

## సుఖవ్యాధులు ఎన్ని రకాలు?

'సమరంగారి సుఖవ్యాధుల మీద ప్రసంగం బాగుంది. మాకు నచ్చింది' అని శ్రోతలు వ్రాసిన వెర్రి మొర్రి ఉత్తరాలన్నీ గుండెలు బాదుకుంటూ రేడియో వాళ్ళు చదువుకుంటుంటే ఒళ్ళు మండి ఒక పెద్ద మనిషి ఫోన్ చేసి చెప్పాడు. సమరంగారి సుఖవ్యాధులు, సంతానంగారి సుఖవ్యాధులు, శిగోమగారి సుఖవ్యాధులంటూ రకరకాలుండవు.

సుఖవ్యాధులు ఎవరికొచ్చినా ఒకటే. సుఖవ్యాధుల మీద సమరంగారి ప్రసంగం బాగుంది- అని చెప్పడమే మీ ఉద్దేశ్యమైతే మాకు అర్థమైంది. ఇంక ఆ ఉత్తరాలు ఆపెయ్యండి.

అవతల క్రెడిల్ మీద ఫోన్ టక్కున పెట్టిన శబ్దం. ఇవతల మొహంలో నెత్తురు చుక్క లేని మైనం. ●

నిద్రపోయాడు గోపీ.

అది చూసిన మృదుల వాడిని ఎత్తుకుని తీసుకెళ్ళి మంచం మీద నిద్రపుచ్చింది

ఇదంతా ఓరకంట గమనించిన ప్రజాపతి –

"వాడు మరి భోజనం చెయ్యడా?" అన్నాడు

"ఇప్పుడు వాడిని లేపి ముఖం కడిగించి కంచం ముందు కూర్చోబెడితే నిద్రపోతుంది. సాయంత్రం సీత తినలేదు కానీ, వాడు టిఫిన్ తిన్నాడు నువ్వూ తాతయ్య భోజనం చేశాక కంచంలో అన్నం కలిపి మంచంమీదే వాడికి ముద్దలుచేసి తినిపిస్తాను" అంది ఆమె.

నమ్మలేనట్లు చూశాడు. ఆమె అలా చేస్తుందా?

మరో పదినిముషాల్లో తండ్రి వచ్చాడు ఆయనతో ప్రస్తుతం ఆమె గురించి మాట్లాడ కూడదనుకున్నాడు ప్రజాపతి

తండ్రితో కల్సి భోజనం చేశాడు.

"నువ్వు కూడా తినెయ్యి" అన్నాడు ఖాలగంగాధరం తన భార్యతో

"వద్దు మీరు తినండి. గోపీకి అన్నం కలిపి తినిపించేక తింటాను" అంటూ ఒక కంచంలో కూరతో కొంచెం అన్నం, పెరుగుతో కొంచెం అన్నం కలిపి మంచం దగ్గరకు తీసుకు వెళ్ళింది

ఆసక్తిగా తనూ అటేవెళ్ళాడు ప్రజాపతి

గోపీని లేపి కూర్చోబెట్టి అతని నోటికి ఒక్కొక్క ముద్దా అందిస్తూ కబుర్లు చెప్తోంది మృదుల

"నేను నిన్ను కొట్టానని నీకు కోపంగావుందా చదువుకోలేదని కొట్టాను. నువ్వు చదువుకుంటే నీకే మంచిది కదా మంచి మార్కులు రాకపోతే అన్నయ్యలా ఇంజనీరింగ్‌లో ఎలా చేరగలవ్? తిను. ఇంకో ముద్దతిను కొంచెం మంచి నీళ్ళు తాగు అన్నం తిననంటూ తల అడ్డంగా తిప్పుతున్నావుకానీ నువ్వు తినకుండా నేను మాత్రం ఎలా తినగలను? కనీసం నాకోసమైనా తినాలి తిను. ఈ పెరుగు అన్నం తింటే కడుపులో చల్లగా వుంటుంది. అప్పుడే కమ్మగా నిద్రవస్తుంది నామీద నీకు బాగా కోపంవచ్చింది కదూ? పోన్లే నేను మాత్రం బాధపడను మొక్కలు బాగాపెరగాలనే కొమ్మలు కత్తిరిస్తాం కానీ, దానిమీద కోపంతో కాదు. అలాగే పిల్లల్ని మందలించడం వాళ్ళ మంచికే."

ఈ మాటలన్నీ ప్రజాపతి విన్నాడు.

ఆమె ఆ రకంగా గోపితో కబుర్లు చెప్పడం వల్ల ప్రజాపతి మనసులో అలముకున్న అపార్థపు మేఘాలు నెమ్మది నెమ్మదిగా తొలిగిపోయాయి.

నిజమే. ఆమె చెప్పింది నూటికి నూరుపాళ్ళు నిజం. తను చిన్నగా వున్నప్పుడు తన తల్లి మాత్రం తనను కొప్పడలేదూ?

అలా పిల్లల్ని మందలించే హక్కు ప్రతి తల్లికీ వుంటుంది.

ఇంత చిన్న వయసులో ఆమె రెండో పెళ్ళివాడిని కట్టుకున్నా అందుకు ఎంతమాత్రం బాధపడకుండా ఆ ఇల్లు స్వర్గంగా చెయ్యాలనీ, ఆ పిల్లల్ని తన స్వంతపిల్లలుగా చూసుకోవాలనీ ఆరాటుపడుతున్న ఆమెకు గోపిని మందలించే హక్కు లేదని తను అనుకోవడం చాలా తప్పు

ఇక అక్కడ వుండ లేనట్లుగా లేచి హాల్లోకి వచ్చేశాడు

వంట గదిలోకి వెళ్ళిన మృదుల అయిదు నిముషాల్లో బయటకు వచ్చి తలుపు ముయ్యడం చూసిన ప్రజాపతి

"అప్పుడే భోజనం అయిపోయిందా?" అని ప్రశ్నించాడు కొత్త తల్లిని

ఆమె గొంతు తగ్గించి–

"గట్టిగా అనకు నేను భోజనం చెయ్యలేదంటే ఆయన రాద్ధాంతం చేస్తారు. అన్నం మిగల్లేదు. అందుకే కొంచెం మజ్జిగ తాగి వచ్చేశాను. రేపు ఉదయం ఎలాగూ టిఫిన్ చేస్తాను కదా.. అది తింటాను .." అక్కడ నుంచి

వెళ్ళిపోయింది.

ఒక్కసారి శరీరం రోమాంచితం అయ్యింది ప్రజాపతికి. తామందరికీ కొసరి కొసరి వడ్డించి తన కోసం మిగుల్చుకోలేదు. ఎంత త్యాగం!

ఆమె భోజనం చెయ్యకుండా వుండి పోయిందని బాధపడ్డాడు ప్రజాపతి.

ఆమె మళ్ళీ వండుకుని తింటే బాగుండేది....

అందరికీ పక్కలు వేసింది. ప్రజాపతి హాల్లోనే మడత మంచం మీద పడుకున్నాడు. నిద్రరాక ఏదో పుస్తకం తీసి చదువుకోసాగేడు... మిగతా అందరూ నిద్రపోతున్నా- టేబుల్ మీద ఒక ఇన్‌లాండ్ లెటర్ కన్పించింది. దాన్ని తీసుకుని చూశాడు.

అది మృదుల తన తండ్రికి రాసిన ఉత్తరం. ఆ మర్నాడు పోస్టులో వెయ్యడానికి సిద్ధం చేసింది ఆమె.

ఆ ఉత్తరం చదవాలని అన్పించింది. చదవకూడదని తెలిసినా ఏదో బలహీనత అతన్ని ఆవహించడంతో దాన్ని చదవసాగేడు.

"నాన్నగారికి- నమస్కారములు. ఇక్కడ నేను కులాసాగా వున్నాను. నా గురించి మీరు ఎలాంటి బెంగ పెట్టుకోవద్దు. ఆయన చాలా మంచివారు. పిల్లలు కూడా నాకు బాగా మాలిమి అయ్యారు. 'అమ్మా' అని పిలుస్తూ చనువుగా వుంటున్నారు. రెండో పెళ్ళివాడికి కట్టబెట్టినందుకు మీరు బాధపడుతూ మీ అసమర్థతను మన్నించమని రాశారు. అలా బాధ పడవద్దు. నేను చాలా సంతోషంగా వున్నాను. మన ఆర్థిక పరిస్థితులు నాకు తెలియనివి కావు. అర్హత లేకుండా స్వర్గం చేరుకోవాలని అనుకోవడం దురాశ అని నాకు తెల్సు. అందుకే ఉన్న చోటులో స్వర్గం వెతుక్కుంటున్నాను.

ఆయన పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేయించుకున్నారని ఈ మధ్యే తెలిసి చాలా సంతోషించాను. ఇక నా కడుపు పండదు కనుక వీళ్ళనే నా బిడ్డలుగా మనస్ఫూర్తిగా భావించే అవకాశం వుంది. నాకంటూ పిల్లలు పుడితే వీళ్ళను తేలికగా చూస్తా నేమోనన్న భయం తొలగిపోయింది.

అమ్మ వంట్లో కులాసాగా వుందని తలుస్తాను. తమ్ముళ్ళను, చెల్లాయిలను అడిగినట్లు చెప్పండి.

తరచూ ఉత్తరాలు రాయండి.

మీ కూతురు
మృదుల....

ప్రజాపతి మనసులో ముల్లు గుచ్చుకున్నట్లు అయ్యింది. అతని శరీరాన్ని ఎవరో యంత్రాల మధ్య పడేసి నుగ్గు నుగ్గు చేస్తున్నట్లు విలవిలలాడిపోయేడు. అతని కనుకొలనుల్లో నీరు ఉబికింది. తనువు చిన్నగా కంపించింది.

హుఁ ఏ స్త్రీ అయినా మాతృత్వం కోరుకుంటుందట. అలాంటిది ఈమె తమందరికోసం దాన్ని త్యాగం చేసుకుంది. ఈ "కొత్త అమ్మ" మనిషికాదు. దేవత... ఆమెను అపార్థం చేసుకున్నందుకు తను ఎంతటి శిక్షకయినా అర్హుడే. సవతి తల్లి అనగానే ఆమె పిల్లల్ని రాచి రంపాన పెడుతుందన్న ఊహ తప్పు అని ఈమె నిరూపించింది. తల్లిగా ఆమె కోరుకుంటున్న మమతానుబంధాల్ని తను ఆమెకు అందించాలి కానీ ఆమెపై ద్వేషం పెంచుకుని ఆమె గుండెల్లో చిచ్చు రగల్చకూడదు.... అనుకున్నాడు.

వణుకుతున్న చేతుల్తో ఆ ఉత్తరం మడిచి టేబుల్ మీద పెట్టాడు.

నెమ్మదిగా లేచి లైటు ఆర్పి పడుకున్నాడు.

కళ్ళు మూసినా అతనికి మృదుల రూపం ప్రత్యక్షమవుతోంది.

'అమ్మ...' 'అమ్మ....' అని అస్పష్టంగా అతని పెదవులు పలికాయి.

ఇంతలో ఏదో అలికిడి కావడంతో అటు చూశాడు.

ఆమె... అటు నడిచి వెళ్తోంది.... బాత్‌రూంకి కాబోలు.

వెంటనే లేచి లైటు వేశాడు. మంచం మీద కూర్చున్నాడు. ఆమె ఇటు తిరిగి వస్తూ ఆశ్చర్యంగా చూసి-

"ఏం బాబు నిద్రపట్టలేదా??" అంది.

'హు... అశాంతి మనసులో గూడుకట్టుకుంటే నిద్ర ఎలా వస్తుందమ్మా...' అనుకున్నాడు.

గబగబా లేచి ఆమెను సమీపించి రెండు చేతులూ పట్టుకుని-

"అమ్మా!" నన్ను క్షమించు" అన్నాడు వణుకుతున్న గొంతుతో.

ఆమెకు ఏం అర్థం కాలేదు. అర్థరాత్రి పూట ఇలా అర్థం కాని ధోరణిలో అతను...

"ఎందుకు" నువ్వేం తప్పు చేశావని?" అడిగింది మృదుల.

జవాబు చెప్పలేక తలవంచుకున్నాడు ప్రజాపతి.

ఆప్యాయంగా అతని తలనిమిరి, చిన్నగా నవ్వి అక్కడ నుంచి కదిలింది మృదుల. అప్పటికి మనసు శాంతించింది ప్రజాపతికి......

## ఆకల్ని మోస్తున్న వాడ్ని

అడుక్కోడానికి అన్నీ
అర్హతలూ వున్నవాడ్ని
ఆర్థిక శాస్త్రంలో
అసమాన ప్రతిభ కలిగి
యూనివర్సిటీ డిగ్రీ పొందినవాడ్ని!
ఉద్యోగాన్వేషణలో
ఊళ్ళు తిరుగుతూ
ప్రమాదవశాత్తు పడి
కాలు విరిగిన కుంటివాడ్ని!
ఉద్యోగ ప్రకటనలు చూసి చూసి
దరఖాస్తులు రాసి రాసి
వాటికై ఎదురు చూసి చూసి
కళ్ళు కాయలు కాసి కాసి
కనుచూపు మందగించినవాడ్ని!
అడుక్కోటానికి అన్నీ
అర్హతలూ వున్నవాడ్ని
ఆకల్ని
ఆకాశాన్ని
నెత్తిపైనిత్యం మోస్తున్నవాడ్ని!

అడిగోపుల వెంకటరత్నమ్

# సినిమా... సినిమా...

ఎస్.వి.ఎస్.

## యువశక్తి క్రియేషన్స్ మూడుచిత్రాలు

'యమపాశం' చిత్రంతో యువశక్తి క్రియేషన్స్ అధినేత బత్తిన సత్యనారాయణ సక్సెస్‌ఫుల్ నిర్మాతల జాబితాలో చేరిపోయారు. ఈయన మూడుచిత్రాలకు సన్నాహాలు చేస్తున్నారు. సెప్టెంబర్ 1న ప్రారంభోత్సవం జరిగే "రక్తజ్వాల" తమిళ, మళయాళ భాషల్లోనూ తయారవుతుంది. వినోద్ అల్వా, యమున, శరత్‌బాబు, రాజ్యలక్ష్మి, కిన్నెర, వై. విజయ, డిస్కో-శాంతి, దగ్గుబాటి రాజా, అల్లు రామలింగయ్య, బ్రహ్మానందం, శ్రీలక్ష్మి, మాస్టర్ గణేష్, అరుణ్‌కుమార్, ప్రదీప్‌శక్తి, నవనటుడు నరేంద్ర పాత్రధారులు. కొంపెల్ల విశ్వం మాటలు, రాజ్-కోటి సంగీతం, కబీర్‌లాల్ ఛాయ, ఆంథోని నృత్యాలు, సాహుల్ సాహసాలు, ఎం. సుబ్రహ్మణ్యం సంయుక్త దర్శకత్వం, బాబ్జీ శిల్పం, రవికిషన్ - శివాజీ ప్రొడక్షన్, రవి కూర్పుతో ఎం. వెంకటేశ్వర్లు, ఎం. కృష్ణ సహనిర్మాతలు. ఈ హారర్ ఫాంటసీ చిత్రానికి 'కాళరాత్రి' ఖ్యాతి బేబి దర్శకుడు.

ఎం. వి. రఘు ఛాయ, దర్శకత్వంలో నవంబర్‌లో రికార్డింగ్, డిసెంబర్ నుంచి ఫిబ్రవరి వరకు షూటింగ్ జరుపుకునే "సి.బి.ఐ. ఆఫీసర్" చిత్రంలో 'ఊర్వశి' శారద, శరత్‌బాబు, నాగేంద్రబాబు, రాంకీ, యమున, కిన్నెరతోపాటు ఇద్దరు ప్రముఖ తారలుంటారు.

డాక్టర్ రాజశేఖర్ హీరోగా పినిశెట్టి రవిరాజా కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో తయారయ్యే "సెక్షన్ 144" చిత్రానికి దివాకర్‌బాబు సంభాషణలు రాస్తున్నారు.

## కె.హేమాంబరధరరావుదర్శకత్వంలో "ప్రతిరాత్రీ ఒక చరిత్ర"

"సస్పెన్స్ థ్రిల్లర్. సెప్టెంబర్ నుండి ఒకే షెడ్యూల్‌లో శ్రీశైలం, అహోబిలం, మహానంది, కడప, పులివెందుల ప్రాంతాలలో షూటింగ్. నవకళాకారులతోపాటు ఓ కీలకమైనపాత్రను రంగనాథ్ నిర్వహిస్తారు. అమర సంగీతదర్శకుడు సత్యం సారధ్యంలో విమల విందుగా మూడు పాటలను రికార్డుచేయడం జరిగింది" అన్నారు కె. హేమాంబరధర రావు. ఈయన స్క్రీన్‌ప్లే - దర్శకత్వంలో పి. వెంకటేశ్వర్లు నిర్మించే విశ్వజ్యోతి ప్రొడక్షన్స్ "ప్రతిరాత్రీ ఒక చరిత్ర" చిత్రానికి వి. ఎన్. శివశంకర్ కథ - మాటలు రాశారు. సుధాకర్ ఛాయ, ఎం. పార్థసారధి సంయుక్త దర్శకత్వం, తాతా సురేష్ కూర్పు తెరవెనుక హంగులు.

## ప్రత్యగాత్మ దర్శకత్వంలో మాదాల రంగారావు

"సెప్టెంబర్‌లో పకడ్బందీగా స్క్రిప్టు తయారైన వెంటనే షూటింగ్ ప్రారంభం. 'నాయకుడు-వినాయకుడు' అనంతరం పదేళ్ల తర్వాత నేను రూపొందిస్తున్న చిత్రమిది. 1974లో నా డైరెక్షన్‌లో "ముగ్గురమ్మాయిలు" చిత్రంలో ప్రతిభావంతంగా నటించిన రెడ్‌స్టార్ మాదాల రంగారావుది డైనమిక్ పాత్ర" అన్నారు 30 చిత్రాలకు ప్రతిభావంతంగా దర్శకత్వం నెఱపి,అఖిలభారత ఖ్యాతి నార్జించిన కె. ప్రత్యగాత్మ. ఆత్మా క్రియేషన్స్ పతాకంలో తయారయ్యే ఈ విశిష్టమైన చిత్రానికి కె. సత్యవతి నిర్మాత.



"బ్రహ్మర్షి విశ్వామిత్ర" సెట్‌లో కొండపనేని ఉమామహేశ్వరరావు (సినిమారంజని), కుమలేశన్ (శ్రీరాముడు), విశ్వామిత్ర ఎన్.టి.ఆర్.



# మీ బిడ్డ ఆరోగ్యం : మీ చేతుల్లోనే ఉంది

భారత దేశంలో ప్రతీ గంటకి 260 మంది పిల్లలు అంటే ప్రతీ సంవత్సరం సుమారు 23 00 000 మంది పిల్లలు తమ మొదటి జన్మ దినాన్ని చూడక ముందే తల్లిదండ్రుల అజాగ్రత్త లేక అజ్ఞానం కారణంగా దుర్మరణం చెందుతున్నారన్న విషయం మీకు తెలుసా? అంతేకాదు అనేక మంది పిల్లలు శాశ్వతంగా వికలాంగులవుతున్నారు కాని తల్లిదండ్రులు కాస్త జాగ్రత్తపడి ఉంటే వారు ఈమారణాంతకమైన రోగాల పాలయేవారు కారు ఈ రోగాలు ధనుర్వాతం కోరింత దగ్గు అంగుడు వాపు పోలియో క్షయ మరియు పొంగు (మీజిల్స్) విరోచనాలు మరియు అతిసారం మున్నగునవి

ఇందులో మొదటి ఆరు రోగాల నుంచి రక్షణ కల్పించడానికి తేలికైనా మార్గము టీకాలు వేయించడం మీ బిడ్డకు మూడు నెలల వయస్సు వచ్చినప్పుడు ప్రాధమిక ఆరోగ్య కేంద్రం లేక డిస్పెన్సరీ లేక ప్రభుత్వ ఆసుపత్రికి తీసుకువెళ్ళండి ఇక్కడ ఇంజెక్షన్లను ఉచితంగా ఇవ్వటం జరుగుతుంది

వేయవలసిన టీకాల సంఖ్య వాటిని ఎప్పుడు వేయించాలి అన్నవి ఈదిగువ పట్టీలో ఈయబడినది ఆలస్యం చేయడం మరణానికే కారణమవవచ్చు

మీ బిడ్డ ఆరోగ్యం మీ చేతుల్లోనే ఉంది మీ అజాగ్రత్త లేక అజ్ఞానం కారణంగా మీ బిడ్డ బాధ పడేటట్లు చేయవద్దు

## ఏవి టీకాలు ఎప్పుడు వేయించాలి

| ఎప్పుడు | ఏమిటి | ఎందుకు |
|---|---|---|
| 16 నుంచి 36 వారాలు లోపు గర్భిణీ స్త్రీ | * రెండు టి టి ఇంజెక్షన్లు | ఈఇంజెక్షన్లు గర్భిణీ స్త్రీకి ఇస్తారు ఇది తల్లిని క్రొత్తగా పుట్టిన శిశువుమ ధనుర్వాతం నుంచి రక్షిస్తుంది |
| 6 వారాల నుంచి 9 నెలల మధ్య | నెలకి ఒకటి చొప్పున డిపిటి మూడు ఇంజెక్షన్లు మరియు మూడు పోలియో మోతాదు లను ఇప్పించాలి | బిడ్డను అంగుడు వాపు కోరింత దగ్గు ధనుర్వాతం పోలియో నుంచి రక్షిస్తుంది |
| 6 వారాల నుంచి 9 నెలల మధ్య | ఒక బిసిజి ఇంజెక్షను | బిడ్డను క్షయ రోగం నుంచి రక్షిస్తుంది |
| 9 నుంచి 12 నెలల మధ్య | మీజిల్స్ (పొంగు) ఇంజెక్షను | బిడ్డకు పొంగు రాకుండా చేస్తుంది |
| 16 నుంచి 24 నెలల మధ్య | డిపిటి మరియు పోలియో ఒక్కొక్కటి చొప్పున బూస్టరు మోతాదు | అంగుడు వాపు కోరింత దగ్గు పోలియో ధనుర్వాత ముల నుంచి బిడ్డను రక్షిస్తుంది |

ఏ రెండు వాక్సిను మోతాదుల మధ్యనైనా ఒక నెల తేడా తప్పకుండా ఉండాలి
మీ బిడ్డకు 5 సంవత్సరాల వయస్సు వచ్చినప్పుడు టైఫాయిడు తక్కిన రోగాలు రాకుండా టీకాలు వేయించటం కొరకు డాక్టరును సంప్రదించండి
* టి టి మరియు టైఫాయిడు వాక్సినేషన్లను అంతకు ముందే వేయిస్తే ఒక ఇంజెక్షను సరిపోతుంది

## విరోచనాలు మరియు అతిసారం (డయోరియా)

విరోచనాలు అతిసారం కారణంగా ప్రతి సంవత్సరం వేలాది మంది పిల్లలు మరణిస్తున్నారు శరీరంలో నీటి కొరత దీనికి కారణం రోగం ముదిరినప్పుడు దాని చికిత్స చాలా కష్టమైన పని కాని ప్రారంభ దశలో అయితే మీ అంతట మీరే ఇంటిలోనే చికిత్స చేయవచ్చును బిడ్డకు మూడు నాలుగు నీళ్ళ విరోచనాలయినప్పుడు ఇంటిలో తయారు చేసిన దిగువ ద్రవణాన్ని (సొల్యూషన్) ఈయండి దీన్ని ఎంత ఎక్కువగా తీసుకుంటే అంత త్వరగా నయమవుతుంది బిడ్డ మామూలుగా తీసుకునే ఆహారాన్నియటం పూర్తిగా మానివేయకూడదు చిన్న పిల్ల అయితే తల్లి పాలను త్రాగుతూ ఉండవచ్చును ఈ ద్రావణ సూత్రం అనేక దేశాలలో విజయవంతంగా పాటించబడుతూన్నది

స్వచ్ఛమైన నీరు - ఒక లీటరు
చక్కెర - ఎనిమిది చిన్న చెంచాలు లేక 40 గ్రాములు
ఉప్పు ఒక చిన్న చెంచా లేక 5 గ్రాములు

నీళ్ళు మరీ శుభ్రంగా లేనప్పుడు మరగబెట్టి చల్లపరచండి అప్పుడు దానిలో ఉప్పు చక్కెర కలపండి ఉపయోగించటానికి ద్రావణం సిద్ధంగా ఉంటుంది ఈ ద్రావణాన్ని మరీ చిన్న పిల్ల అయితే చెంచాతోను కొంచెం పెద్దవారయితే గ్లాసుతోను తరచుగా పడుతూ ఉండండి మూడు నాలుగు రోజులలో బిడ్డ నయమవుతుంది

రోగం ఎక్కువగా ఉంటే ఆరోగ్య కేంద్రంలోని డాక్టరుని వెంటనే సంప్రదించండి



గుర్తుంచుకోండి! దీన్ని గురించి కొద్దిగా తెలుసుకొని ఉండడం మీ బిడ్డ ప్రాణాన్నే కాపాడవచ్చు

davp 89/109 Tel

# సీరియల్
# ద్రౌపది
## ప్రయాగ రామకృష్ణ



**ఇంతవరకూ సాగిన కథ-16:** పాంచాల దేశాధీశుడు ద్రుపదుడి కుమార్తె ద్రౌపదిని పాండవులు పెళ్లాడతారు. పట్టాభిషేకానంతరం ధర్మరాజు - ద్రౌపదిని, మిగిలిన సోదరులను తీసుకొని ఖాండవప్రస్థం చేరుకుంటారు. నారదుడి సలహాపై రాజసూయయాగం నిర్విఘ్నంగా జరిపి కృష్ణుడికి అర్ఘ్యమిస్తాడు ధర్మరాజు. మయసభలో తనకు జరిగిన అవమానానికి ప్రతీకారంగా దుర్యోధనుడు పాండవుల సంపదనంతటినీ జూదంలో గెలుచుకోవడమే కాకుండా పాండవులను, ఆఖరికి ద్రౌపదిని కూడా గెలుచుకుంటాడు తన దాసి అయిన ద్రౌపదిని నిండు కొలువులో వస్త్రాపహరణం చేయించి అవమానిస్తాడు. ధృతరాష్ట్రుడు పాండవులకు దాస్యవిముక్తి కల్గిస్తాడు. తిరిగి అనుద్యూతానికి ఆహ్వానిస్తారు ధర్మరాజుని. అనుద్యూతంలో ఓడిపోతాడు ధర్మరాజు. పాండవులు హస్తినాపురం వదిలి వెళ్లేముందు భీమార్జునులు యుద్ధంలో దుర్యోధన, దుశ్శాసనాదుల అంతం చూస్తామని ప్రతిజ్ఞ చేస్తారు

(గత సంచిక తరువాయి)

**పాం**డవులు అరణ్యవాసానికి బయలుదేరారు

దుర్యోధనుడు చేసిన అన్యాయానికి దర్మరాజు గుండె మండుతోంది ఎర్రటి కోపం కళ్ళల్లో ఎక్కగా అల్లుకుంటోంది

తన చూపులు తాకి ప్రజలంతా మాడి మసై పోతారేమోనన్న భయంతో దర్మనందనుడు ముఖాన్ని వస్త్రంతో కప్పుకున్నాడు

ఇనుపదండాల్లా భయంకరంగా వున్న బాహువులను పెద్దవిగా చాచి ఊపుతూ నడుస్తున్నాడు రాబోయే కురు పాండవ సంగ్రామంలో నా చేతులు కసితీర ధృతరాష్ట్ర కుమారులను చిత్రహింస పెట్టి వాళ్ళను హతమార్చకపోతే చూడండన్నట్టు అతి భయంకరంగా అడుగులు వేసుకుంటూ వెళ్తున్నాడు

రాలుతున్న ఇసుక రేణువుల కంటె దట్టంగా, బాణాలు కురిపించి శత్రుసంహారం చేస్తానని సూచిస్తూ అర్జునుడు త్రోవ పొడవునా ఇసుక చల్లుకుంటూ వెళ్ళాడు

ఎప్పుడూ కంట తడిపెట్టని తన సుకుమార సుందర రూపం చూసి ప్రజలు దుఃఖించడం మేలు కాదని నకులుడు ఒంటినిండా దుమ్ము ధూళీ పూసుకుని అంద వికారంగా తయారయ్యాడు

దీనంగా వున్న తన మొహం ప్రజలకు చూపడం శుభం కాదని సహదేవుడు తల వంచుకుని అన్నల్ని అనుసరించాడు

విడిపడిన కేశ భారంతో, ఏక వస్త్రంతో, సుడులు తిరిగే కన్నీళ్ళతో ద్రౌపది వెళ్ళింది రాబోయే యుద్ధంలో భర్తల్ని, బిడ్డల్ని బంధుమిత్రుల్ని కోల్పోయి మరణ వేదనతో గగ్గోలెత్తుతూ కౌరవ స్త్రీలందరూ నాలాగే ఏడుస్తారని పాంచాలి శపించినట్టుందది భారత యుద్ధంలో హతులయ్యే కురుకుమారుల పరలోక క్రియాకలాపాన్ని సూచిస్తూ ధౌమ్యుడు రౌద్ర యామ్య సామోద్గీతులు చదివాడు ఆయనా వాళ్ళను అనుసరించాడు

పాప ద్యూతంతో పరాజితులై అరణ్యాల పాలైన పాండవులను చూసి హస్తినాపుర ప్రజలు కంట తడి పెట్టారు

"ఈ దుర్యోధన దుశ్శాసన రాజ్యంలో మనం వుండలేం అసలు వాళ్ళు దుర్మార్గులు పైగా వాళ్ళకు జరా, వ్యాధిమృత్యువుల్లాగా కర్ణుడూ, సైంధవుడూ, శకునీ తోడు! ఇటువంటి సత్పురుషులు ఏలే రాజ్యంలో సుఖంగా బ్రతుకుతాం! పదండి మనం కూడా పాండవులతో వెళ్దాం వాళ్ళెక్కడ వుంటే మనమూ అక్కడే వుందాం అనిఒకరి కొకరు చెప్పుకుంటూ, ఆర్తనాదాలు చేస్తూ పాండవుల వెంట పరుగెత్తారు

ధర్మరాజు వెనక్కి తిరిగి చూశాడు

తన వెనక గంగి గోవుల్లా జనం!

కళ్ళల్లో నీళ్ళు కదిలాయి

అలాగే అక్కడే నిలబడి చేతులు జోడించాడు

'వెళ్ళిరండి ఎంత దూరమని మీరు మాతో' వస్తారు అన్నాడు తడారిన గొంతుతో

'ధర్మరాజా' నీ కరుణ తప్ప మాకు వేరే శరణేముంది? మా ప్రభువు ఎంత దయగల తండ్రో తెలిశాక కూడా ఈ సామ్రాజ్యంలో ఎలా వుండమంటావు? చెడు సహవాసం వదిలిపెట్టక పోతే పాపం వస్తుందంటారు మా కెందు కొచ్చిన కష్టం మేమూ మీతో పాటే వస్తాం అన్నారు హస్తినాపుర వాసులు వాళ్ళ మాటలు వినేసరికి దర్మరాజుకి దుఃఖం ఎల్లుబికింది

మీరు నన్ను క్షమిస్తానంటే, ఒక మాట చెప్తాను మీరు మాతో రావడానికి మాకు ఎలాంటి అభ్యంతరం లేదు కాని ఎల్లాపాపలతో సుఖంగా వుండే మీరు మాతో పాటు వనవాస క్లేశాన్ని అనుభవించేందుకు నా మనసు ఒప్పుకోదు దయచేసి వెనక్కి వెళ్ళిపోండి మమ్మల్ని సురక్షితంగా తిరిగి రమ్మని మాత్రం ఆశీర్వదించండి అని వాళ్ళను వారించాడు

చేసేదిలేక ఏడుపాపుకుంటూ ఆగిపోయారు వాళ్ళంతా

పాండు కుమారులు అడవులకు వెళ్తుంటే హస్తినంతా నిస్సహాయంగా చూస్తూ నిలబడింది

ఈ సీరియల్ శాంతి వెట్ గ్రైండర్స్ డిస్ట్రిబ్యూటర్స్_మల్టీకమర్షియల్ ఎంటర్‌ప్రైజ్ వారు సమర్పిస్తున్నారు.

కొంచెరు ఆకాశంలో వున్న దేవుళ్ళకి మొక్కారు

* * * * * *

పాండవులు గంగాతీరం చేరారు

ఆ రాత్రికి అక్కడే చెట్టు కింద పడుకున్నారు

తెల్లవారే సరికల్లా బ్రహ్మజ్ఞాన తేజో విరాజితులైన బ్రాహ్మణులందరూ ధర్మరాజును చూచేందుకు వచ్చారు

ధర్మరాజు ఎదురెళ్ళి వాళ్ళను పూజించాడు

వాళ్ళు ధర్మరాజును ఆశీర్వదించి "నాయనా! మేమూ మీతో పాటే వస్తున్నాం అన్నారు

ధర్మరాజు ఉలిక్కిపడ్డాడు

" సవతి సోదరులు చేసిన మోసానికి గురై వున్నదంతా పోగొట్టుకున్నాం ఓటమి వైపు వున్నాం ఈ వేళ్టినుంచి కందమూలాలు తింటూ చెట్ల చాటున తల దాచుకోవాలి మాతో పాటు మీరు కూడా కష్టపడడ మెందుకు? సింహాలూ, పులులూ సంచరించే ఈ అడవుల్లో మీ వంటి మహనీయులు మసలేరు మీ రాజ్యానికి మీరు వెళ్ళిపొండి అన్నాడు

ఆ మాటలకు వృద్ధ బ్రాహ్మణు డొకరు కళ్ళనీళ్ళ పర్యంతమయ్యాడు

"ధర్మరాజా! నువ్వే దిక్కన్న వాళ్ళను నిరాదరించకు నువ్వే వెళ్ళిపోయాక హస్తినకూ, అరణ్యానికీ తేడా ఏమిటి మాకు మమ్మల్ని ఎలా పోషించడమా అనే చింత కూడా నీ కొద్దు మాకు కావల్సిన కందమూలాలు మేమే ఏరి తెచ్చుకుంటాం జప హోమాలు చేస్తూ నీ మనస్సుకు హాయి కలిగిస్తాం అయినా తెలీక అడుగుతాను- పెద్ద పులికీ, దుర్యోధనుడికి తేడా ఏమిటి?

పెద్దపులి కనబడ్డ ప్రాణినల్లా చంపుతుంది ఆకలి తీరినా అవసరం లేకపోయినా చంపుతుంది చంపాక దాన్ని ఏ పొదలోనో కుళ్ళ బెడుతుంది కుళ్ళబెట్టడం దానికి సరదా అలాగే దుర్యోధనుడు కూడా మనుషుల మంచితనాన్నీ, బలహీనతల్నీ ఆసరా చేసుకుని వాళ్ళను నాశనం చేస్తాడు తనకంటె ఎవరూ అధికులుగా వుండకూడదనే నేలబారు మనస్తత్వం అతనిది మీకన్నా ఎక్కువ సంపదే వున్నా తనకు లేని కీర్తి కిరీటాలు మీకు వున్నందుకు మీ మీద అనవసరంగా పగబట్టాడు ఆశాపాతకత్వానికీ, అంతులేని క్రూరత్వానికీ పెద్దపులికీ మీ తమ్ముడికీ తేడా ఏముంది? అన్నాడు

భీముడు పకపకా నవ్వాడు

అజాతశత్రుడేం మాట్లాడ లేదు

ఇంతలో అక్కడికి శౌనక మహాముని వచ్చాడు

పాండు కుమారులు ఆయనకు సాష్టాంగ ప్రణామం చేశారు

"దీర్ఘాయుష్మాన్ భవ అని వాళ్ళను దీవించి "విప్రులందర్నీ సమావేశపరిచారు వీళ్ళవల్ల కాగల కార్యమేముంది మీకు? అని ప్రశ్నించాడు శౌనకుడు

'మహా మునీ! ఇష్ట దేవతా ప్రార్థనలు చేస్తూ, పురహితాన్ని కాంక్షిస్తూ, క్రమబద్ధమైన సాత్త్విక



జీవితాన్ని గడపాల్సిన విప్రులు మాతో పాటు కానలపాలై కందమూలాలు తింటామని చెబుతున్నారు. వద్దని వారిస్తున్నాను. అరణ్యవాసం దుఃఖ భాజనమైందని ఎంత చెప్పినా వినడంలేదు. మీరైనా చెప్పండి...'' అన్నాడు ధర్మరాజు గద్గద స్వరంతో.

దుఃఖంతో ఆయన గొంతు పూడుకుపోయింది. కన్నీళ్ళు జలజలరాలి కింద పడ్డాయి.

ధర్మరాజును ఆ స్థితిలో చూసేవారికి శౌనక మహా మునికి కూడా మనసు వ్యాకులమైంది.

''భద్రా! జీవితమన్నాక సుఖ దుఃఖాలు తప్పవు. శారీరక దుఃఖాలూ, మానసిక దుఃఖాలూ మనుషుల్ని పుట్టుకతోనే వరిస్తాయి. వివేకవంతులు తన బుద్ధి బలంతో ఆ రెండింటినీ నిగ్రహించుకోవాలి. శారీరక దుఃఖాలకైతే ఔషధాలుంటాయి. మానసిక దుఃఖాలకు మందుల్లేవు. నీళ్ళవల్ల నిప్పు ఆరిపోయినట్టు జ్ఞానంవల్ల మాత్రమే మానసిక దుఃఖం ఉపశమిస్తుంది. అన్నీ తెలిసిన నువ్వు కూడా...''

ధర్మరాజు తలెత్తి మహర్షి మాటలకు మధ్యలోనే అడ్డొస్తూ 'మహాత్మా! భయపడిన వాడికి అభయ మివ్వడం ఆకలిగొన్నవాడికి అన్నం పెట్టడం, దాహార్తులకు నీళ్ళివ్వడం, అలిసిపోయిన వాడికి ఆశ్రయ మివ్వడం ఉత్తమ గృహస్థ ధర్మాలనికదా పెద్దలు చెబుతారు. ఆశ్రయించి వచ్చిన ఈ బ్రాహ్మణులందర్నీ ఈ ఘోరారణ్యాలలో ఎలా పోషించడమా అనే చింత తప్ప నా కిప్పుడు ఎవరిమీదా మమకారం లేదు' అన్నాడు.

శౌనకుడు చిన్నగా నవ్వి 'నాయనా! వసువులూ రుద్రులూ, ఆదిత్యులూ మొదలైన వాళ్ళందరూ తపస్సు చేసి ఐశ్వర్యవంతులయ్యారు. తపస్సువల్ల లభించనిది లేదు. నువ్వు కూడా నియమవంతుడవై తపస్సు చేసి నీ మనోరథం సఫలం చేసుకో అప్పుడు ఈ బ్రాహ్మణులను పోషించడం కూడా నీకేం కష్టంగాదు' అని చెప్పి వెళ్ళిపోయాడు.

ధర్మరాజు తలో చనలో పడ్డాడు.

–తపస్సు చెయ్యాలి ఈ బ్రాహ్మణులందర్నీ సంతృప్తి పరచాలి. కాని... ఎవరి నుద్దేశించి తపస్సు చెయ్యాలి'?

మళ్ళీ ధర్మరాజు సందేహం.

కళ్ళు మూసుకుని చెట్టుకు చేరగిలబడ్డాడు. మనస్సులో ధౌమ్యుడు తళుక్కున మెరిశాడు. వెళ్ళి ఆయనతో తన కష్టం చెప్పుకున్నాడు.

ధౌమ్యుడు ఆలోచించాడు. చివరికి ఒక నిర్ణయానికి వచ్చి 'ధర్మరాజా! పూర్వం భూతజాలమంతా పుట్టి ఆహారం కోసం పరితపించింది. ఆ ఆర్తనాదాలు విని సూర్యుడు కరుణతో కరిగిపోయాడు. ఉత్తరాయణంలో ప్రవేశించి ఉర్వీరసాన్ని గ్రహించాడు. దక్షిణాయనంలో ప్రవేశించి పర్జన్యుడై ఓషధులు సంగ్రహించాడు. రాత్రి వేళల్లో చంద్ర కిరణాల్లోవున్న అమృతంతో ఆ ఓషధులను తడుపుతూ వాటిని వృద్ధి చేశాడు. వాటిల్లోంచి అన్నం పుట్టింది. అందుకే అన్నం ఆదిత్యమయ మంటారు. పూర్వం రాజర్షులందరూ సూర్యుడ్ని ప్రార్థించి అన్నం సంపాదించి ప్రజల ఆకలి తీర్చారు. ఆదిత్యుడు లోకానికి ఆధారమైనవాడు. చీకటిని మింగి వెలుగును ప్రసాదించే ప్రత్యక్ష దైవం ఆయన. నువ్వు కూడా ఆయనను ప్రార్థించు అని అష్టోత్తర సూర్యనామాలతో వున్న మంత్రాన్ని ఉపదేశించాడు. ధర్మరాజు ఆ మంత్రాన్ని పఠిస్తూ భాగీరథీ తీరానికి చేరుకున్నాడు. అక్కడ గంగా జలంలో నిలబడి సూర్యుడ్ని గూర్చి తీవ్రంగా తపస్సు చేసాడు.

సూర్యుడు, ధర్మరాజు తపస్సుకు మెచ్చి 'పాండునందనా! ఈ తామ్ర పాత్ర తీసుకో నువ్వు అరణ్యవాసం చేసే పన్నెండు సంవత్సరాలూ ద్రుపద కుమారి వండే కందమూలాలన్నీ ఈ పాత్రలో అక్షయములైన నాలుగు రకాల ఆహార పదార్థాలవుతాయి' అని ఒక దివ్య పాత్రని ఇచ్చాడు.


నేషనల్ అవార్డు & క్వాలిటీ కంట్రోల్ సర్టిఫికేట్ పొందిన ఏకైక వెట్‌గ్రైండర్.







శాంతా వెట్ గ్రైండర్స్.

డిస్ట్రిబ్యూటర్స్: మల్టీకమర్షియల్ ఎంటర్‌ప్రైజ్.

5/467, అశోక్ నగర్
విజయవాడ-7 Ph: 52521

138, రాష్ట్రపతి రోడ్
సికిందరాబాదు Ph: 834207

షాపు నెం: 9
లీలామహల్ కాంప్లెక్స్
డాబాగార్డెన్స్, విశాఖపట్టణం
Ph: 60415

రాష్ట్ర మరియు కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులకు A.P.S.T.C. ద్వారా సులభ వాయిదాలపై లభించును.



ధర్మరాజు విభ్రాంతుడైపోయాడు.

నెమ్మదిగా కళ్ళు తెరిచాడు.

ఎదురుగా సూర్యభగవానుడు– వేయి వెలుగుల వెల్లువయి, సహస్ర పాదుడై ప్రభవిస్తున్నాడు....

చూస్తుండగానే ఒక వెలుగు కిరణం ఆయన నుంచి ఇవతలికి రావడం, పచ్చి నులి వెచ్చగా తనను తాకడం గమనించాడు ధర్మరాజు.

కృతజ్ఞతగా చేతులు జోడించాడు.

ఆదిత్యుడు అంతర్హితుడయ్యాడు.

★ ★ ★ ★ ★ ★

కామ్యక వనంతర్భాగంలో –

పాంచాల. యాదవ. వృష్ణి భోజ. అంధక వీరులంతా పరివేష్టించి వుండగా నీలమేఘ శ్యాముడైన కృష్ణుడు పాండవుల మధ్యలో కూర్చుని వున్నాడు.

గాలి విసురుకి మొహాన పడుతున్న జుట్టుని వెనక్కి తోసుకుంటూనే, మధ్యమధ్య కన్నీరు తుడుచుకుంటూ ద్రౌపది చెబుతున్న అమానుష కథ వింటున్నాడు

విన్నకొద్దీ కృష్ణుడి నల్లని ముఖం కోపంతో ఎర్రబడుతోంది

నీళ్ళు నిండిన ద్రౌపది కళ్ళు మండుతున్నాయి

ఏడుస్తూనే 'అన్నయ్యా! నేను పార్థివేంద్రుడైన పాండు మహీపతి కోడల్ని అతి భయంకరులైన పాండు కుమారుల భార్యను ప్రజాపతి వైన నీకూ, అప్రతిహత శక్తిమంతుడైన ధృష్టద్యుమ్నుడికీ చెల్లెలిని అటువంటి నన్నే ఆ దుశ్శాసనుడు జుట్టు పట్టుకు ఈడ్చి, నిండు సభలో వలువలు ఒలిచి పరాభవించాడు అధికార దర్పం, అహంకారం మదం మత్సరం, స్త్రీలోలత ఆవేశించిన దుర్యోధన దుశ్శాసనులు నా పట్ల రాక్షసుల్లా ప్రవర్తించారు భీష్మాది పెద్దలంతా ఆ ఘోరం చూసి కూడా వారించలేక పోయారు శరణన్న వాళ్ళందర్నీ కరుణతో రక్షిస్తారని బిరుదులు సంపాదించుకున్న నా భర్త లయిదుగురూ తాళి కట్టించుకున్న ఆలి శరణు శరణని ఏడ్చినా చేతగాని వాళ్ళలా చూస్తూ నిలబడ్డారు ఇంక ఈ భీమార్జునుల బాహు బల మెందుకో చెప్పు! అందరూ వుండీ కూడా దిక్కులేని దాన్నయ్యాను దుశ్శాసనుడు చేసిన పరాభవం కన్నా కర్ణుడు నన్నా నిస్సహాయ స్థితిలో చూసి నవ్విన నవ్వే నా గుండెల్లో మంట పెడ్తోంది భీముడ్ని గంగ మడుగులో తోయించినప్పుడూ, పాండవులందర్నీ లక్క ఇంట్లో పెట్టి తగల బెట్టాలని ప్రయత్నించినప్పుడే ఆ దుర్యోధనుడ్ని ఏం చెయ్యలేక పోయారు వీళ్ళు ఇప్పుడు కావాలని రెండుసార్లు వాళ్ళతో జూదమాడి రాజ్యమంతా పోగొట్టుకున్నాక ఏం చెయ్య గలరు? ' అని నిష్ఠూరంగా అంది

'నాకెవరూ లేరు నేను ఒంటరిని నా పరాభవం నాతోనే మాసి పోవాలి 'అని పెద్దగా ఏడ్చింది

## సిప్పీ చిత్రానికి బ్రేక్?



రమేష్‌సిప్పీ తీస్తున్న 'అకేలా' చిత్రానికి బ్రేక్ పడిందట భారీయెత్తున నిర్మిస్తున్న ఈ చిత్రంలో అమితాబ్ బచ్చన్ హీరోగా నటిస్తున్నాడు. ఈ భారీ ప్రాజెక్టు చిత్రం ఎప్పటికి పూర్తవుతుందో ...ఏమో అనుకున్నాడు కాబోలు ప్రక్కకు తప్పుకుందామని అనుకుంటున్నాడట. తీరా ఈ చిత్రం అప్పుడే 14 రీళ్లు పూర్తయిపోయింది సిప్పీ ఏంచేస్తాడో చూడాలిమరి ! ఈ చిత్రం మాదిరిగానే 'జమీన్' చిత్రంకూడా బడ్జెట్ మించిపోయి 'అకేలా' మాదిరిగా ఆగిపోయింది సగంపైగా చిత్రం యింకా షూటింగ్‌కు నోచుకోలేదట

ద్రౌపది

అర్జునుడికి ద్రౌపదిని దగ్గరకు తీసుకుని అనునయించా లనిపించింది

'ద్రుపద రాజపుత్రీ! నీ పరాభవానికి తప్పకుండా ప్రతీకారం చేస్తాను త్రిలోకాలూ జయించే శక్తి సామర్థ్యాలున్నా కాలానికి తల ఒగ్గాల్సొచ్చింది సుఖాలప్పుడు పొంగి, కష్టాలప్పుడు కుంగని స్థిత ప్రజ్ఞత పాండవులకు వుంది ధర్మం తప్పి ఏ పనీ చెయ్యడు యుధిష్ఠిరుడు వంచనకు ప్రతి వంచన చెయ్యడం చేతగాదు అతనికి. అది అతని అసమర్థతనుకుంటె నేను చెప్పగలిగిందేం లేదు అన్నాడు అర్జునుడు కావాలనే

అప్పటి వరకూ ఊట బుగ్గల్లాగా వున్న చెల్లెలి కళ్ళల్లో కొత్త వెలుగును చూశాడు ధృష్టద్యుమ్నుడు

ద్రౌపదిని దగ్గరకు తీసుకుని మూర్ధం ఆఘ్రాణించాడు

'చెల్లీ! దుర్నీతి పరులైన ఆ కౌరవులు ఏనాటికైనా మన చేతుల్లో చచ్చే వాళ్ళే! దుర్యోధన దుశ్శాసను లిద్దర్నీ భీముడు చీల్చి చెండాడుతాడు కర్ణుణ్ణి అర్జునుడూ, ద్రోణుణ్ణి నేనూ చంపి నీ పరాభవానికి తగిన ప్రతీకారం చేస్తాం అయినా లీలా మానుష విగ్రహుడు కృష్ణుడుండగా కౌరవులను సంహరించడం ఎంత పని!' అన్నాడు

అందరూ కృష్ణుడి వంక చూశారు

కృష్ణుడు అభయ మిస్తున్నట్టు భువనైక మోహనంగా మందహాసం చేశాడు

'ధన్యులం' అన్నారు కుంతీ కుమారులు

కాసేపయ్యాక

చేసిన తప్పుకు పశ్చాత్తాప పడుతున్నట్టు 'బావా! ఆ సమయంలో నువ్వు దగ్గర వుంటే ఇంత జరిగి వుండేది కాదు' అన్నాడు ధర్మరాజు కృష్ణుడితో

కృష్ణుడు వెంటనే ఏం మాట్లాడలేదు చుట్టూ చూశాడు తరువాత ధర్మరాజు వైపు తిరిగి నెమ్మదిగా అన్నాడు

'బావా! స్త్రీ, జూదం వేట మద్యపానం అనే వ్యసనాలు సామాన్యమైనవి కావు అందులోనూ జూదం చాలా అనర్థాలను కలిగిస్తుంది ఆ సమయంలో నేనక్కడ వుంటే మీ ఆటలు సాగనిచ్చే వాణ్ని కాదు నేను కొంతకాలంగా ద్వారావతిలో లేను అందుకని నాకీ సంగతి తెలీదు అయినా ఒకటి చెబుతున్నాను విను కుట్రలూ, కుతంత్రాలూ పన్నుతూ పరాయి వాడి సొమ్మును అగ్గలంగా అనుభవిద్దామనుకునే వాళ్ళ దగ్గర న్యాయం, ధర్మం అంటూ చేతులు కట్టుకుని నిలబడక్కర్లేదు'

ధర్మరాజు తల దించుకున్నాడు

కృష్ణుడికి జాలేసింది 'బావా! నాకూ కొన్ని బలహీనతలున్నాయి పలుక దలచిన మాటను పలుక కుండా వుండలేను మంచి వాళ్ళ మీద చెడ్డ వాళ్ళు పెలరేగి బాధలు పెడ్తుంటే చూస్తూ వూరుకోలేను

మానవులే దానవులై రాక్షసుల కన్నా హీనంగా ప్రవర్తిస్తే సహించలేను అందుకని ఆవేశంలో ఏదో అన్నాను నన్ను మన్నించు .'

'బావా! ఎంత మాటన్నావు' ధర్మరాజు శ్రీకృష్ణ చరణారవిందాలు పట్టుకున్నాడు ఆయన కంట తెరిగిన నీరు వసుదేవ సుతుడి పాదాలను అభిషేకించింది

గోపాల దేవుడు ధర్మరాజును చుట్టేసుకుని 'బావా! తప్పకుండా భరత రాజ్యలక్ష్మి నిన్ను వరిస్తుంది దుష్టులైన ధార్తరాష్ట్రులంతా నశిస్తారు ధైర్యంగా వుండండి మీరు వనవాసం పూర్తి చేసుకుని తిరిగి వచ్చే దాకా నేను సుభద్ర, అభిమన్యులను ద్వారకకు తీసుకు వెడతాను ' అంటూ కృష్ణుడు తన కాంచన రథం దగ్గరకు కదిలాడు

కృష్ణుడు వెళ్ళి పోవడంతోనే ధృష్టద్యుమ్నుడు ద్రౌపదీ సుతులైదుగుర్నీ తీసుకుని పాంచాల పురానికి బయలు దేరాడు

**(ఇంకా వుంది)**

# అసంప్రేక్ష్యకారిత్వము... పంచతంత్రము

...అయిదవ భాగము

(గత సంచిక తరువాయి)

రాజుగారి కొడుకులాడుకొనుటకు
రాజశాల లందు గలవు కోతులు

శాలలందు కోతులుండు దాపున
బొతెడన్న గొర్రె యుండెనని





రోజు రోజు దొంగ గొర్రె యొక్కటి
రాజుగారి వంట ఇంట దూరును

వంట వాడు కోపగించి గొర్రెను
గంటెతోనో, చెంబుతోనో కొట్టును





కోతి యొకటి దీని నెల్ల చూచుచు
భీతి నొంది తలచె నిట్లు మనసున

రేపో మాపో వంటవాడు గొర్రెను
కోపగించి కొరివి తోటి కొట్టును





## గేయరచన నండూరి రామమోహనరావు — బొమ్మలు బాపు

చిచ్చుముట్టి బొచ్చుకాలి గొర్రెయు
వచ్చిపడును శాల కొక్క గంతున



నిప్పు తగుల తగులబడును శాలలు
అప్పుడశ్వశాల కూడ మండును



మంట తగిలి గుర్రములకు తప్పక
ఒంటి నిండ పుండులగుట తప్పదు



గాయములకు కోతి కొవ్వు పూసిన
మాయునంచు రాజవైద్యులందురు



కరుణ లేక రాజభటులు కోతుల
నరకి వేసి కొవ్వు తీసి కొందురు



కోట వదలి పోదమనుచు వెంటనె
తోటివారి తోటి కోతి చెప్పెను




(ఇంకావుంది)




## హాస్య నవలికల పోటీలో ద్వితీయ బహుమతి నవల!

చిట్టిబాబుకి నీరసం వచ్చింది 'అయిపోయింది, ఈ ఒక్క ఛాన్స్ కూడా పోయింది. ఇంత రాత్రివేళ ఎవరొస్తారు? అయినా చూదాం. సెకండ్‌షో జనం రావచ్చుగా' అంటూ ఆశ చిగురిస్తూంటే, బాధను మరచిపోయే ప్రయత్నం చేయసాగాడు.

ఈసారి టెక్నిక్ మార్చాలి. సడెన్‌గా పిలిస్తే, చీకట్లో తనెక్కడ వున్నదీ తెలియక, బేజారెత్తి పారిపోతున్నారు. కాబట్టి, భయపడకుండా వారి దృష్టి నాకర్షించే మార్గం చూడాలి.

ఎవరో ఇద్దరు నడిచివస్తున్నారు. ఒక స్త్రీ -పురుషుడు. గుడ్ ! తన ప్రయత్నం ప్రారంభించాడు చిట్టిబాబు. ఈసారి వారిని పిలవకుండా సినిమా పాట అందుకున్నాడు - కష్టంగానేవున్నా !

"రాశాను ప్రేమలేఖలెన్నో -దాచాను ఆశలెన్నో నాలో..." అంటూ.

వారిద్దరూ క్రింద నిలబడిపోయారు.

"ఏమిటిది! మన లెటర్స్ విషయం ఎలా తెలిసింది? పాట పాడుతూ మనల్ని వెక్కిరిస్తున్నట్లుందే...మీ అన్నయ్య ఊళ్ళోనే ఉన్నాడా!" అని అనుమానంగా అడిగాడా యువకుడు.

"నీ ఉత్తరాలు అతి రహస్యంగా దాస్తాను ఎవరికీ తెలీదు. అన్నయ్య ఊరు వెళ్లడం చూసేగా సినిమాకి వచ్చాను. అయినా, ప్రతి విషయానికీ ఖంగారెందుకూ, ఏ పోకిరీ వాడో పాట పాడి వుంటాడు." అంది అమ్మాయి.

యువకుడు అనుమానంగా చుట్టూ చూశాడు. నిర్జనంగావున్న ఆ సమయంలో కంటి కెవరూ కన్పించలేదు.

"దాచాలంటే దాగవులే - దాగుడుమూతలు సాగవులే..." అంటూ మరో పాట

(గత సంచిక తరువాయి)

అందుకున్నాడు చిట్టిబాబు.

వారిద్దరూ బెదిరిపోయారు

"డార్లింగ్, మన గుట్టు ఎవరో పట్టేశారు. ఇక్కడుంటే ప్రమాదం. కమాన్, క్విక్ " అంటూ ఆమె చేయి అందుకొని ముందుకు దారి తీశాడు కారణం, వారిద్దరూ రహస్య ప్రేమ జంట

చిట్టిబాబు కోపంతో జుట్టు పీక్కున్నాడు.

గుప్పెడు వెంట్రుకలు చేతిలోకొచ్చాయి. కన్నీళ్ల పర్యంతమైంది నిజానికి అతనిక బావురుమని మనసారా ఏడవాలనుంది.

అతి సున్నితంగా పెరిగిన చిట్టిబాబు, తన జీవితంలో యిటువంటి సంఘటన నెదుర్కోవలసి వస్తుందని కలలో కూడా ఊహించలేదు.

ఈసారి ఒక వ్యక్తి తూలుకొంటూ, ఏదో కూనిరాగం తీస్తూ, నెమ్మదిగా రావడం కనిపించింది. చిట్టిబాబు కళ్లు తుడుచుకున్నాడు. అతనికెందుకో ఒక ఐడియా వచ్చి, అతి కష్టం మీద చెయ్యి షర్ట్ జేబులో పెట్టి చూశాడు. డబ్బు తగిలింది. ఒక వంద కాగితం తీసి, చేత్తో పట్టుకున్నాడు. దానిని రెండో చేత్తో మడిచి, 'ఏరో'లా తయారుచేశాడు

కాలేజీలో ఆడపిల్లల్ని ఏడిపించే సమయంలో యిటువంటి బాణాలే వేసేవారు రెండు చేతులతో 'ఏరో'ను గురిపెట్టి వుంచాడు.

క్రిందకు ఆ వ్యక్తి రాగానే బాణం సంధించి, వదిలాడు. అది గురి తప్పలేదు. ఆ వ్యక్తిని విసురుగా తాకింది. ఉలిక్కిపడి దానివంక చూసి, ఆశ్చర్యపోయాడు. వంద రూపాయల కాగితాన్ని ఆప్యాయంగా అందుకొన్నాడు.

"ఈరోజు నా పంట పండింది - పొట్ట పగిలేలా త్రాగొచ్చు" అనుకున్నాడు. చుట్టూ చూశాడు. అదెక్కడ నుండి పడిందో అర్థం కాలేదు. నవ్వుకొంటూ జేబులో పెట్టుకున్నాడు. ముందుకుపోబోయాడు.

"ఇదిగో, మిత్రమా, మరో వంద కావాలా!" అరిచాడు చిట్టిబాబు.

ఆ వ్యక్తి నాలుగు ప్రక్కలా చూశాడు.

"అటు కాదు - యిటూ, పైకి తలెత్తి చూడు." అన్నాడు మళ్లీ.

ఈసారి తలెత్తి చూశాడు. మసక చీకట్లో చిట్టిబాబు ఆకారం కిటికీలో నుండి కన్పించింది. "ఎవరది?" అంటూ అరిచాడు.

చిట్టిబాబు ఆనందించాడు. ఇప్పటికి తననో వ్యక్తి చూశాడు. "మిత్రమా! నాకో సాయం చెయ్యి. 'శ్రీముఖ' హోటల్‌కు పోయి, '203' రూమ్‌లో ఒక వ్యక్తి ఆపదలో ఉన్నాడని చెప్పు. ఇదిగో వంద రూపాయలు." అంటూ మరో నోటు విసిరాడు.

ఆ వ్యక్తి త్రాగివున్నా, పరిస్థితి ఏదో ప్రమాదకరమైనదే అని గుర్తించాడు. ఆ నోటు ఆనందంగా జేబులో పెట్టుకొని "ఇదిగో, ఇప్పుడే వెళ్తున్నాను. మీకేం భయంలేదు." అంటూ ముందుకు నడిచాడు.

"భగవంతుడా, నువ్వున్నావు." అనుకొన్నాడు చిట్టిబాబు.

కాని, మరుక్షణంలోనే అతనిని ఎన్నో ఆలోచనలు చుట్టిముట్టి ఆందోళనపరిచాయి. ఏం జరగబోతూందోనని ఊహించేసరికి, శరీరమంతా చమటలు పట్టసాగాయి.

వెళ్లిన వ్యక్తి ఒక బేరర్‌ని వెంటబెట్టుకొచ్చి, పైకి చూపించాడు. బేరర్ ఆ దృశ్యాన్ని వింతగా తిలకించాడు.

"ఏమైంది? ఎందుకలా వున్నారూ?" అంటూ బిగ్గరగా అరిచాడు.

"ప్రాణం పోతూంది. ముందు తలుపులు తెరిపించి, లోపలకు రావయ్యా. విషయం తర్వాత చెబుతాను," శక్తికొద్దీ అరిచి, సమాధానం చెప్పాడు చిట్టిబాబు. బేరర్ హడావుడిగా పరుగుతీశాడు.

కాసేపట్లో రిసెప్షనిస్ట్ హడావుడిగా ఫోన్‌లో అరుస్తున్నాడు. హోటల్ సిబ్బంది అంతా హడావుడిగా సెకండ్ ఫ్లోర్‌కి పరుగు తీశారు.

* * * *

'కళ్యాణమండపం'లో వచ్చిన అతిథులు, చాలావరకూ వెళ్లిపోయారు. బాగాదగ్గర బంధువులు మాత్రమే వున్నారు. పెళ్లికొడుకు కన్పించడంలేదనే సత్యం అందరికీ తెలిసిపోయింది.

అయితే, శ్రీరామ్ చక్కటి కథ అల్లి సాంబయ్యకు చెప్పాడు. "నాకూ అర్థంకాని విషయం అదేసార్. బ్రౌన్ కలర్ ఎంబా

సిడర్ కారు వచ్చిందనీ, 'సాంబయ్యగారు' పంపించారనీ చెప్పి, మా చిట్టిబాబుని తీసుకు వెళ్లారట. తీరాచూస్తే చిట్టిబాబు యిక్కడకు రాలేదు. ముహూర్తంవేళకు కొడుకు కని పించకపోయే సరికి, ఆ తండ్రికి గుండెపోటు వచ్చింది" అన్నాడు.



"ఈ విషయం మీతో ఎవరు చెప్పారు ?" అడిగాడు సాంబయ్య.

"హోటల్ దగ్గర కిళ్లీకొట్లో సిగరెట్లు కొంటున్న ఒక పెద్ద మనిషి చెప్పాడు. వారి మాటలు తను విన్నట్లుగా కూడా చెప్పాడు." అన్నాడు శ్రీరామ్.

"ఇంతకీ ఎవరా పెద్దమనిషి ?" అడిగాడు సాంబయ్య.

"వల్లకాట్లో రామనాథం-ఎవడో మాకేం తెలుస్తుంది." అన్నాడు సాయి.

"సార్, బ్రౌన్ కలర్ కారు అంటే గుర్తొచ్చింది. అది మన ఎగస్పార్టీ వెంకటసామి గారిదేమోనని అనుమానం" అని సాంబయ్య అనుచరుడొకడు రహస్యంగా చెవిలో ఊదేడు.

సాంబయ్య ముఖం జేవురించింది. సారా పాటల్లో ఎప్పుడూ తనకు అడ్డుతగిలే 'ఎంకటసామి' గుర్తుకురాగానే శరీరమంతా కుత కుత ఉడికిపోయింది. "దొంగముండాకొడుకు, నన్ను అల్లరిపాలు చెయ్యాలని యీ పన్నాగం పన్నివుంటాడు." అనుకొన్నాడు. వెంటనే, ఫోన్ ఎత్తి ఒక నెంబర్ డయల్ చేశాడు. అటు నుండి ఎవరో పలికారు.

"ఎంకటసామి వున్నాడా?" అడిగాడు.

"నేనే మాట్లాడతన్నా -ఏంది కథ ?" సాంబయ్య గొంతు అతనికి గుర్తే.

"చెబుతా, చెబుతా, బ్రౌన్ కలర్ కార్లో ఎత్తుకొచ్చిన కుర్రాడ్ని మర్యాదగా అప్పగించు. లేదా, ఏంచేస్తానో తెలియదు."

"ఏందయ్యా అర్ధరాత్రి నీ సొద - మందెక్కువయ్యిందా ?" ఎంకటసామి అన్నాడు.

"ముయ్యరా ముదనష్టపోడా-అతిగా వాగితే దవడ వాచుద్ది."

"ఏంది- దవడ వాచుద్దా -పిచ్చిపిచ్చిగా మాట్లాడ్తే నీ బుర్ర వాచుద్ది."

"ముయ్‌నోరు-నీ పుచ్చిపగుల్ది."

"నీ టెంకి మాడుద్ది !"

"నీ ఒంట్లో కొవ్వుతీస్తా -రకతం తాగతా !"

"ఎముకలు విరుస్తా-పేగులు లాగుతా !"

వారి భాషను అర్థంచేసుకొనే రసజ్ఞులు లేక, చుట్టూ చేరిన జనం దిగాలుగా చూస్తున్నారు. ఆడాళ్లు ఏడ్పులు లంకించుకొన్నారు.

ఇంతలో అక్కడొక ఆటోవచ్చి ఆగింది. 'శ్రీముఖ' హోటల్ బేరర్ హడావిడిగా దిగి, లోపలకు పరుగుతీస్తూ వచ్చాడు. అంతా అటు చూసారు. సాంబయ్య మాత్రం ఫోన్‌లో 'సంస్కృత కార్యక్రమం' కొనసాగిస్తూనే వున్నాడు.

"సార్. అర్జెంట్‌గా రావాలి. రూం నెంబర్ '203'లో మీ మనిషి ఒకాయన ప్రమాదస్థితిలో వున్నాడు. బయట తాళాలు



## రచయిత్రి
## పద్మినీప్రసాద్

హాస్య నవలికల పోటీలో ద్వితీయ బహుమతి పొందిన "భలేపెళ్ళి" రచయిత్రి శ్రీమతి జి.పద్మినీప్రసాద్‌కి బాల్యం నుండీ కూడా తెలుగు కథ, నవలా సాహిత్యం అంటే మక్కువ.

నిత్యం తన చుట్టూ వుండే వ్యక్తుల మనస్తత్వ పరిశీలనలో తను గుర్తించి, గ్రహించిన అంశాలు తనలో రచనాశక్తిని ప్రేరేపించి, కలంపట్టే అవకాశం కల్పించాయంటున్నారు శ్రీమతి పద్మినీప్రసాద్

దాదాపు ఏభై కథానవలు, పాతిక వరకూ కథలు వ్రాశారు. కలువబాల, ఆంధ్రజ్యోతి, స్వాతి మొదలైన పత్రికలు ఆమె రచనలకు మంచి స్థానం కల్పించాయి

శ్రీమతి పద్మినీప్రసాద్ మొదటి నవల 'అరుణోదయం' ప్రముఖ పత్రికలో సీరియల్‌గా ప్రచురింపబడింది ప్రళయతాండవం అనే నవల వేరొక ప్రముఖ పత్రికలో సీరియల్‌గా ప్రచురింపబడ్డది. అంతేగాక దాదాపు ఆరు నవలలు వివిధ పత్రికల ద్వారా త్వరలో సీరియల్స్‌గా ప్రచురణకు రానున్నాయి.

ద్వితీయ బహుమతి పొందిన ఈ హాస్య 'నవలిక' ప్రచురణ సందర్భంగా ఆమెను మరోకసారి అభినందిస్తున్నాము -ఎడిటర్

---

చేశారు. అందుకే నేను రావలసి వచ్చింది" అన్నాడు వగరుస్తూ

అంతవరకూ ప్రశ్నార్థకంగావున్న సమయంలో ధైర్యం వచ్చింది శ్రీరామ్ అతన్ని అడిగి మరికొన్ని వివరాలు సేకరించాడు చిట్టిబాబే అక్కడ వుండిపోయాడని ఖాయం చేసుకొన్నాడు

వెంటనే సాంబయ్య దగ్గరకు పోయాడు

"సార్, చిట్టిబాబు దొరికాడు ఫోన్ పెట్టేయ్యండి" అన్నాడు. సాంబయ్య బాగా ఆవేశంమీద వున్నాడు ఆ మాటలు వినిపించలేదు.

"ఏమ్మకల్లే -యిక తిట్లు ఆపండి" కాస్త స్వరం పెంచి అరిచాడు శ్రీరామ్. అప్పటికి గాని, సాంబయ్య మామూలు స్థితికి రాలేదు ఫోన్ పెట్టేశాడు

"చిట్టిబాబు హోటల్లోనే వున్నాడని కబురొచ్చింది గదికి తాళం పెట్టేసి వచ్చారట పైగా ప్రమాదంలో వున్నాడని అంటున్నారు." అన్నాడు

"పదండి. వెళ్దాం" అంటూ ముందు కురికాడు సాంబయ్య

అక్కడున్న కార్లు ఎక్కి, హడావుడిగా ఎరుగుతీశారు కొందరు "ఇంతకీ గది తాళాలు ఎక్కడున్నాయ్ ?" అన్నాడు శ్రీరామ్.

ఆ ప్రశ్న అంచెలంచెలుగా మగ పెళ్లివారిలో వ్యాపించింది. వీరమ్మకు గుర్తొచ్చింది. తాళాలు తన దగ్గరేగా వున్నది !

శోకాలుతీస్తూ గది ముందు కూర్చున్న ఆమె, కళ్లు తుడుచుకొని తాళం కోసం బొడ్లో చెయ్యిపెట్టింది కాని- అవి అక్కడ లేవు ! "ఇకలేవండి. అబ్బాయి దొరికాడు" రహస్యంగా లింగోజీ చెవిలో చెప్పి, తట్టి లేపాడు శ్రీరామ్. ఈ వంకతో హాయిగా నిద్రపోదామనుకొన్న లింగోజీ సడెన్‌గా లేచి కూర్చున్నాడు.

"తాళాలు కన్పించడంలేదు దేవుడోయ్" అంటూ అరిచింది వీరమ్మ.

అంతే ! బంధువర్గమంతా చెకచెకా పనిలో దూకారు. 'కళ్యాణ మండపం' మొత్తం, ప్రతి అంగుళం గాలించి వదిలారు. కాని, అవి ఏమయ్యాయో అర్థంకాలేదు.

శ్రీరామ్ బృందానికి తాళాలకు బదులుగా, చెట్ల చాటున పడివున్న ఆచారి కన్పించాడు అతన్ని మోసుకొచ్చి గదిలో పడేశారు.

దాదాపు ఒక అరగంటవరకూ అందరూ శక్తివంచనలేకుండా తాళాల కోసం గాలించి, అలసిపోయారు.

"ఇక చాలు బయల్దేరండి. అక్కడ చిట్టిబాబు పరిస్థితి ఎలావుందో ?" అన్నాడు శ్రీరామ్. అంతా తిరిగి కార్లెక్కి, ప్రయాణమయ్యారు.

కొద్దిక్షణాలలో హోటల్ ముందు దిగారు.

కౌంటర్ దగ్గర ఒక పోలీస్ యినస్పెక్టర్, కొందరు కానిస్టేబుల్స్ వున్నారు. లింగోజీ, సాంబయ్య-జంటగా అడిగారు. "పెళ్ళికొడుకు ఏడీ?" అని. రిసెప్షనిస్ట్ చిన్నగా నవ్వి అన్నాడు.

"మరేం ప్రమాదంలేదు. తాళాలు వున్నాయా?" అని అడిగాడు.

"పోయాయి. తలుపులు పగలగొట్టించండి." అన్నాడు లింగోజీ.

"సారీసర్! మా ప్రొప్రైటర్ పర్మిషన్ లేనిదే ఎటువంటి డామేజీకీ అంగీకరించే అధికారం నాకు లేదు. రూమ్‌లో ఏదైనా హత్య జరిగితే తప్పనిసరి అనుకోండి. అప్పుడైనా ఆ పని పోలీసులే చేస్తారు. తలుపులు పగలగొట్టించే అధికారం నాకు లేదు" అన్నాడు.

"ఎలాగయ్యామరి? మా వాణ్ణి చూసేదెలా?" అన్నాడు లింగోజీ.

"నిరభ్యంతరంగా చూడండి. హోటల్ వెనుక భాగంలోకి పోతే, మీరు స్పష్టంగా చూడగలరు" అని చెప్పి ఏదో ఫోన్ కాల్ ఎటెండ్ కావడంలో నిమగ్నమయ్యాడు

ఇనస్పెక్టర్ సాంబయ్యతో అన్నాడు.

"మరేం ఫర్వాలేదు నాతో రండి. చూపిస్తా" అంటూ ముందుకు నడిచిపోయాడు శ్రీరామ్ తన బృందంతో అనుసరించాడు. వియ్యంకులు, వియ్యపురాళ్ళు, ఇతర బంధువర్గం అంతా ప్రక్కనున్న రోడ్డులో నడిచి, హోటల్ వెనుకభాగం చేరారు.

ఆశ్చర్యం! అక్కడ వందలాది జనం నిలబడి పైకి చూస్తున్నారు "ఓరి, చిట్టిగా నీకేం ఖర్మ పట్టిందిరా?" అంటూ గుండెలు బాదుకొని ఏడవసాగింది వీరమ్మ.

అప్పటికే పోలీసులు కొన్ని ఏర్పాట్లు చేశారు. జీప్‌లోనుండి 'సెర్చి లైట్' తో పనిచేసే శక్తివంతమైన 'ఆర్క్ లైట్' సూటిగా చిట్టిబాబు పైకి 'ఫోకస్' చేయబడి వుంది. చీకట్లో ఎవరికీ కన్పించని చిట్టిబాబుని అందరూ స్పష్టంగా చూడగలుగుతున్నారు

"నైన్‌టీన్ సిక్స్‌టీ ఫోర్‌లో అనుకొంటా- జెమినీ సర్కస్ వచ్చింది. అప్పుడు చూశాను యిటువంటి ఫీట్." అన్నాడు ఎస్సై.

"నిజంగా కుర్రాడు చాలా ధైర్యవంతుడేసుమండీ- అంతఎత్తున గాలిలో తేలుతూ ఎలా వుండగలిగాడో?" అంది సాంబయ్యతో భార్య.

"ముయ్ నోరు-ఇదేం సర్కస్ కాదు. ఆ కంతలో యిరుక్కుపోయాడు. ఎలా రావాలో తెలియక ఛస్తూంటే-నీ గోలేంటి?" అంటూ భార్యమీద విసుక్కొన్నాడు.

"సార్, ఇదికూడా ఎంకటసామిగాడి పనేమో-" రహస్యంగా అడిగాడు సాంబయ్య అనుచరుడు. ఈ సారి సాంబయ్య జుత్తు పీక్కున్నాడు.

"అబ్బాయి నలిగిపోతున్నాడు-శోషవచ్చి ప్రాణాలు పోయేలా వున్నాయి. రక్షించండి బాబోయ్" అంటూ అరుస్తోంది వీరమ్మ.

శ్రీ రామ్ నెమ్మదిగా యినస్పెక్టర్‌తో అన్నాడు.

"సార్ మా వాడు యీ పరిస్థితిలో వుంటే వినోదంగా చూడటం మీకు భావ్యంగా వుందా? వెంటనే తలుపులు పగల గొట్టిం చండి. ప్లీజ్" అని. ఎస్సై గుర్రుగా చూశాడు.

"ఏమిటి మిస్టర్ మీరు అనేది? ప్రొప్రై టర్‌గార్కి కబురు చేశాం. ఆయన వచ్చేవ రకూ తాళాలు పగలగొట్టే అధికారం ఎవరికీ లేదు. రూమ్‌లో ఏదైనా హత్య జరిగితే తప్ప" అన్నాడు.

"ఇలాగే వుంటే కాసేపట్లో వాడి ప్రాణాలు పోతాయి." కోపంగా అన్నాడు శ్రీరామ్. ఎస్సై చిద్విలాసంగా నవ్వేడు.

"అప్పుడు రంగంలో దిగిపోవడానికి మేం సిద్ధంగానే వుంటాము. ఊరికే గొడవ చేస్తా వెందుకయ్యా? అందరూ చూడాలనేగా- 'ఆర్క్ లైట్' పెట్టించాను. కాసేపు ఆగు. ప్రెస్ వాళ్లు రావాలి. ఫొటోలు తీయాలి. ఆ దృశ్యం జనమంతా చూడాలి" అన్నాడు.

"పిల్లికి చెలగాటం-ఎలక్కి ప్రాణసం కటం" అంటారు యిదే కాబోలు, అను కొన్నాడు శ్రీరామ్.

"బ్రదర్ ఏది ఏమైనా మనవాడు సెన్సే షనల్ న్యూస్ క్రియేట్ చేసి, పత్రికలకెక్క బోతున్నాడు" అంటూ నవ్వేడు సారధి.

"వాడిబొంద-అసలా వెంటిలేటర్లో ఎందుకు దూరాడో కనుక్కోవాలి. నాలుగు చీవాట్లు వెయ్యాలి" అన్నాడు సాయి.

"నాకు ఒకటే తోస్తోంది. బైట తాళం పెట్టి అంతా వెళ్లిపోయారు. ఎలా బైటప డాలో అర్థంకాక, ఈ మార్గాన్ని ఎన్నుకొని వుంటాడు. పూర్ ఫెల్లో!" అనుకొన్నాడు శ్రీరామ్.

అంత రాత్రి సమయంలో కూడా, యీ వార్త తెలుసుకున్న జనం తండోపతండాలుగా విచ్చేసి, వినోదం చూడసాగేరు.

వీణ ముఖం అవమానంతో జేవురిం చింది.

"మీ అన్నయ్య యిలాంటి పని ఎందుకు చేశాడే వీణా" అన్నారు వాహిని, వారుణి. నిజానికి వారికి చిట్టిబాబును చూస్తే ఎంతో జాలి కలిగింది. అటువంటి సన్నివేశం చూడాల్సి వస్తుందని వారు అనుకోలేదు.

ఒక తల్లి తన బిడ్డను చంకనెత్తుకొని "అదిగదిగదిగో- చూడు బాగా కన్పిస్తోందా?" అంటూ ఆ దృశ్యాన్ని చూపిస్తోంది.

హోటల్ సిబ్బంది మొత్తం అక్కడే వున్నారు.

ఇంతలో వరుసగా కొన్ని కార్లు, స్కూటర్లు వచ్చి ఆగాయి. పత్రికా విలే ఖరులు, కొందరు కార్పొరేటర్లు దిగి యీ దృశ్యం చూశారు.

కెమెరాలు 'క్లిక్' మన్నాయి.

పత్రికల వారు ముఖ్యులైన వ్యక్తులను కలుసుకొని యింటర్వ్యూ చేస్తూ, ఏవేవో రాసుకొని పోతున్నారు. కొందరు పెద్దలు యీ దృశ్యం చూస్తూ, నవ్వుకొంటూ ఏవేవో మాట్లాడుతున్నారు.

శ్రీరామ్ తన స్నేహితులను తీసుకుని తిరిగి హోటల్లోకి వెళ్లాడు.

"ఏం సార్, చూసివస్తున్నారా? ఎలా వుంది పొజిషన్?" అంటూ నవ్వి, అడిగాడు రిసెప్షనిస్ట్. శ్రీరామ్ కోపంగా చూశాడు.

"మిస్టర్, మీ హోటల్ కొచ్చే కస్టమర్స్ మీద మీకుండే గౌరవం ఏమిటో యిప్పుడు అర్థ మవుతోంది గదికి తాళం మేమే వేశాం.ఆ తాళం పగలకొట్టించండి. ఏదైనా 'డామేజి' జరిగినా దానికి తగ్గ మూల్యం మేం చెల్లిం చడానికి సిద్ధంగా వున్నాము. ఇక ఆలస్యం దేనికి? ప్లీజ్. అవతలవ్యక్తి చాలా యిబ్బం దికరమైన స్థితిలో వున్నాడు. అర్థం చేసు కొని, తలుపులు తెరిచే ఏర్పాటు చెయ్యండి" అన్నాడు తీవ్రంగా.

"ఒక్కక్షణం ఓపిక పట్టండి. మా ఓనర్ గారు బయల్దేరారు నేను కేవలం ఒక ఉద్యోగిని మాత్రమే- తొందరపడి ఏ పని చేసినా, దాని వల్ల నేను బాధ పడాల్సి వస్తుంది. అంతే గాని, కస్టమర్స్‌ని అవమానించే ఉద్దేశ్యం ఏ మాత్రం లేదు" అన్నాడు.

దేవుడే పిలిచినట్లుగా, అదే సమయంలో ప్రొప్రైటర్ కార్లో వచ్చాడు. విషయం తెలు సుకొని, ఆందోళనతో తలుపులు పగల గొట్టిం చమని అనుమతి యిచ్చాడు.

ఈ విషయం తెలిసిన జనమంతా హోటల్ మీద పడ్డారు వారిని కంట్రోల్ చేస్తూ పోలీసులు రంగంలోకి దిగారు.

లింగోజీ, వీరమ్మ, సాంబయ్యల సమ క్షంలో తలుపులు బలవంతాన తెరిచారు. ఇన్ స్పెక్టర్‌తో సహా విలేఖరులు కూడా ముందుగా లోపలకు దూరిపోయారు మళ్లీ కెమెరాలు 'క్లిక్' మని శబ్దం చేశాయి. బాత్‌రూమ్‌లో కాళ్లు తేలేసి, గోడమధ్యలో వేలాడే కొడుకుని చూసి వీరమ్మ గుండెలు బాదుకొంది

అతికష్టం మీద నలుగురు కలసి, కాళ్లు పట్టుకొని వెనక్కి లాగేరు. చిట్టిబాబుకి స్వేచ్ఛ లభించింది.

అందరివదనాల్లో సంతోషం తాండవిం చింది.

అలసటగా కుర్చీలో కూలబడ్డ చిట్టిబా బుకి, బేరర్ చల్లటి కూల్‌డ్రింక్ తెచ్చి యిచ్చాడు. అతనితో ముందుగా మాట్లా డిన వారు విలేఖరులే-"ఈ సంఘటనకు కారణం?" అడిగారు

చిట్టిబాబు సమాధానం ఎప్పుడో సిద్ధం చేసుకొన్నాడు. "వెంటిలేటర్ గుండా ఒక దుర్మార్గుడు లోపలకు ప్రవేశించాడు కత్తి చూపి, బెదిరించాడు. నేను తిరగపడ్డాను మా మధ్య తీవ్రమైన పోరాటం జరిగింది. ఓడిపోయిన ఆ వ్యక్తి వెంటిలేటర్ ద్వారా పారిపోయాడు. వాడ్ని పట్టుకోవాలనే ఉద్దే శ్యంతో నేనూ అదే మార్గంలో వెళ్లదలచాను. కాని, నా శరీరం సహకరించలేదు. మేం పోరాడుకొన్నప్పుడు అయిన గాయాలు యివి-

అంటూ చేతుల మీద ఏర్పడిన గాయాలు చూపించాడు.

అతని స్టేట్ మెంట్ రికార్డ్ అయ్యింది.

*　　*　　*　　*　　*

కొద్ది క్షణాలలో తెల్లవారబోతూంధనగా, తిరగి, 'కళ్యాణ · మంటపం' లోమంగళవాయిద్యాలు మ్రోగనారంభించాయి. దంతధావనాలు ముగించుకొని, గుక్కెడు కాఫీతో నిద్ర మత్తు వదిలించుకొని అంతా సిద్ధమయ్యారు.

"వర్జ్యం వచ్చేసింది. పైగా దుర్ముహూర్తం కూడానూ-ఇప్పుడు శుభకార్యం ఏమిటి నీ పిండాకూడు!" అంటూ ఒక ముసలాయాన లింగోజీని గదమాయిస్తున్నాడు బంధు వర్గంలో పెద్ద తలకాయ కావడంతో అతని మాటలనెదరించలేక బాధతో సతమతమవుతున్నాడు లింగోజీ.

"అయ్యా, మీరు శాంతించాలి, శాస్త్ర ధర్మాలను క్షుణ్ణంగా తెలిసిన వాడ్ని కనుక, నా మాటగా చెబుతున్నాను. అర్ధరాత్రి ముహూర్తం దాటిపోయిన మాట వాస్తవమే. అయితే, అదే సమయంలో వరుడు పెద్ద గిండం నుండి బయటపడ్డాడు. పెళ్లికి పెట్టిన ముహూర్తబలమే అతనిని రక్షించింది. అటువంటి ఆపదనే గట్టెక్కిన వ్యక్తికి, యీ వర్జ్యాలూ, దుర్ముహూర్తాలూ ఏం చేస్తాయ్? శుభకార్యం నిర్విఘ్నంగా జరిపించేయడమే శ్రేయస్కరం" అన్నాడు పురోహితుడు.

అతని మనసులో ఆందోళనవేరు. ఈ పెళ్లికి సాంబయ్య ద్వారా ఘనమైన దక్షిణ అందుకోబోయే సమయంలో యిటువంటి విఘ్నాలు రావడం సహించలేక పోతున్నాడు.

ఇంతలో సాంబయ్య రానే వచ్చాదు.

"బావగారూ! ఏమిటింకా ఆలశ్యం? ఆ సుభ కార్యం పూర్తిగా జరిపించేస్తే మనందరికీ మనశ్శాంతి" అన్నాడు.

"అదే, అదే-నేనూ అదే అనుకొంటున్నాను" అన్నాడు నసుగుతూ. కట్నంగా తీసుకున్న డబ్బు తిరిగి యివ్వాల్సి రాకుండా వుంటే చాలుననే భావం అతనిది. ముసలాయనకు కోపం వచ్చింది.

"ఒరే దౌర్భగ్యుడా! నేను చూస్తూ చూస్తూ యిటువంటి అన్యాయం సహించలేను. దుర్ముహూర్తం జరిగే పెళ్లికి నేను వుండలేను. ఇప్పుడే పోతాను" అంటూ విసురుగా వెళ్లి పోయాడు.

సాంబయ్య, లింగోజీ ముఖముఖాలు చూసుకున్నారు.

పురోహితుడు నిశ్చింతగా ఊపిరి వదిలి "అయ్యా! శుష్క వాదాలతో పెళ్లి ఆపు చెయ్యకండి. తిరిగి బోలెడంత ఖర్చు-" అన్నాడు. ఈ మాట వియ్యంకులిద్దరి మీద బాగా పనిచేసింది.

చిట్టిబాబు చూట్టూ స్నేహితులు చేరి ముచ్చట్లాడుతున్నారు. "బ్రదర్, నిత్యజీవితంలో కూడా హీరోవయి పోయావు. నిజంగా నీపెళ్లి వేడుకను మేం యీ జన్మలో మరిచిపోలేం" అన్నాడు శ్రీరాం.

చిట్టిబాబు పొట్టనిమురుకొని, నవ్వేడు.

"రేపు ఉదయాన్నే ఫతాక శీర్షికలతో అన్ని పత్రికలూ నీ వీరోచిత గాధను ఫొటోలతో సహా ప్రకటిస్తాయి. ఏం ఛాన్స్!" అంటూ సారధి మురిసిపోయాడు.

"ఇంతకీ నీతో పోరాడిన ఆ దొంగ ఎవరో గుర్తుపట్టగలవా? వాడు నీ మీదక్షసాధింపుగా తిరిగి ఏదైనా అత్యాచారం చేస్తే-" సందేహంగా అన్నాడు సుబ్బారావు.

చిట్టిబాబు కిచకిచా నవ్వేడు.

"నా చేతిలో చిక్కిన వాడ్ని అంత తేలికగా వదిలేస్తానా! వాడి ఎముకలు విరిచేసాను. ఏదో కాస్తబక్కప్రాణం కాబట్టి, అతి తేలిగ్గా వెంటిలేటర్లో దూరిపారిపోయాడు. తప్పించుకొన్నాడు కనుక బ్రతికిపోయాడు." అన్నాడు గర్వంగా.

బయట ఎవరిదో కారు ఆగింది. అందులోనుండి దిగిన వ్యక్తి ఒక పెద్ద ప్యాకెట్ తీసుకొని సరాసరి మిత్ర బృందం దగ్గరకు వచ్చాడు. ఆ వ్యక్తి మరెవరో కాదు- హోటల్ యజమాని.

"ఈ శుభ సమయంలో నా కానుక తీసుకోండి. అంతే గాదు. మీ వల్ల నాకూ, నా హోటల్ కూ మాంచి ప్రచారం వచ్చింది. వ్యాపారం కూడా బ్రహ్మాడంగా పెరిగిపోతుంది. అటువంటి అవకాశం కల్పించిన మీకు నా కృతజ్ఞతలు." అంటూ ఆప్యాయంగా ప్యాకెట్ అందించి, చిట్టిబాబుతో కరచాలనం చేశాడు.

అందరూ చప్పట్లు కొట్టి, ఆనందం వ్యక్తపరిచారు.

కాసేపట్లో చిట్టిబాబుని 'కళ్యాణ మండపం' లోకి తీసుకుపోయారు. ఆహూతులంతా ఆనందంగా వివాహ వేడుకలు చూస్తూ సంబరపడుతున్నారు. క్షణంలో అక్కడి వాతావరణమే మారిపోయింది. రాత్రి అనుభవించిన 'టెన్షన్' మరిచిపోయి, ఎంతో హుషారుగా గడుపుతూ కార్యక్రమం తిలకించసాగేరు.

'మంగళసూత్ర ధారణ' జరిగింది.

"చిట్టిబాబు-జిందాబాద్." అంటూ అరిచారెవరో. అందరూ తమ చేతిలోని అక్షింతలు వధూవరులపై జల్లి, ఆశీర్వదించారు.

(అయిపోయింది)




ఒకప్పుడు వినోద్‌ఖన్నా- అమృతాసింగ్‌ల మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమనేదట ఇప్పుడు వాళ్ళిద్దరూ ఒకటైపోయారట మళ్ళీ ఒకటై పోవడమేమిటి. చెట్టా పట్టాలేసుకొని చెట్లు, పుట్టలూ యిష్టం వచ్చినట్లు తిరిగేస్తున్నారట

ఈ మధ్య రెండు సినిమా షూటింగ్‌లకని మద్రాసు, ఊటీ వచ్చారట షూటింగ్ లేని సమయంలో వెతికితే అమృతా అజాపజా దొరకటం లేదట ఎంచక్కా వినోద్‌తో జల్సా చేస్తోందట నిర్మాతలు వారి ఖర్మకు వారిని వదిలేసారట పట్టుకున్నా అగట్టేదని తెలిసింది

మళ్ళీ మంచి రోజులొచ్చాయని చెప్పి వినోద్ హాయిగా 'అమృతా'నందాన్ని చవిచూస్తున్నాడట

# రాజా-లక్ష్మీ 'సత్కారాలు' అందుకున్న గోపాలరెడ్డి, తిరుమల రామచంద్ర



డా. బెజవాడ గోపాలరెడ్డి

ఈఏడాది రాజా-లక్ష్మీ (రు. 25 వేలు) అవార్డు సుప్రసిద్ధులు డా. బెజవాడ గోపాలరెడ్డిగారికి, సాహితీ పురస్కారం (రు. 10 వేలు) బహు భాషావేత్త, పత్రికా రచయిత డా. తిరుమల రామచంద్ర గారికి లభించాయి. ఈ అవార్డుల ప్రధాన మహోత్సవం నవంబర్ 19న మద్రాసులో జరుగుతుంది అని ఈ సంస్థ మేనేజింగ్ ట్రస్టీ శ్రీ పి. వి. రమణయ్య రాజా ప్రకటించారు. శ్రీయుతులు గోపాలరెడ్డి, తిరుమల రామచంద్రగార్లకు ఆంధ్ర సచిత్ర వార పత్రిక అభినందనలు.



డా॥ తిరుమల రామచంద్ర

## శ్రీ తులసి

విశాఖపట్నంలోని హిరావత్ ఇండస్ట్రీస్ వారు ఉత్పాదన చేసిన "శ్రీ తులసి" ఆయుర్వేదిక్ క్రీము తులసి ఆకుల రసంతో తయారుచేయబడినది





చర్మం లోపలిభాగాలకు చొచ్చుకుపోయే గుణం గల "శ్రీ తులసి" క్రీము మొటిమలు, గాయాలు, కోతలు, ఇతర చర్మవ్యాధులను నయం చేయడమే కాకుండా చర్మాన్ని సురక్షితంగా వుంచుతుంది అంతేగాక ఈ క్రీమును క్రమంతప్పకుండా ఒక నిర్ణీతకాలపరిమితి వాడినట్లయితే మొటిమలు, కోతలు, గాయాల వల్ల ఏర్పడిన మచ్చలను చర్మంతో కలిసిపోయేటట్లు చేస్తుంది.

## కళాకారుల 'డైరెక్టరీ'

కళాకారులకు- ప్రవాసాంధ్రులకు మధ్య వారధిగా తోడ్పడగలదన్న ఉద్దేశ్యంతో బెంగుళూరులోని "మేలుకలయిక ఫౌండేషన్" రంగస్థల కళాకారుల, రచయితల వివరాలతో ఒక 'డైరెక్టరీ'ని రూపొందించాలనుకున్నారు

వివిధ రాష్ట్రాలలోని తెలుగు కళాకారులను, సాహితీపరులను గత ఐదేళ్ళుగా ఈ ఫౌండేషన్ సన్మానిస్తూ సాంస్కృతిక రంగానికి సేవ చేస్తోంది

ఈ డైరెక్టరీకి వివిధ రాష్ట్రాల కళాకారులు, రచయితలు తమ పూర్తి వివరాలు, ప్రదర్శన విశేషాలు (ఫోటోలతో) డి ఆర్ శ్రీనివాసమూర్తి, మేలు కలయిక ఫౌండేషన్, నవీన్ ఇండస్ట్రీస్ బిల్డింగ్, 18 'ఏ' క్రాస్, చిన్మయ మిషన్ హాస్పిటల్ రోడ్, లక్ష్మీపురం, అలుసూరు, బెంగుళూరు-560008 అన్న చిరునామాకు పంపాలని కార్యకర్తలు ప్రకటిస్తున్నారు.

## విశ్వ విజ్ఞాన దర్శిని

ఖగోళశాస్త్రం భూగోళశాస్త్రం మొదలు వివిధ శాస్త్రాలకు వివిధ రంగాలకు సంబంధించిన ఎన్నో వాస్తవాలను, వివరాలను రచయిత శ్రీ జి. నరేంద్రదేవ్ ఈ పుస్తకంలో సంక్షిప్తంగా పొందుపరిచారు. మహా శాస్త్రాలనుండి, మహా రచయితల నుంచి ఎన్నో కొటేషన్లు ఈ గ్రంథంలో ఉన్నాయి. సుమారు 400 పేజీలుగల ఈ విజ్ఞాన గ్రంథంలో ... మీదుగా రచయిత సేకరించిన అంశాలను చక్కగా అమర్చారు. వెల : రు. 25/- ప్రతులకు : రచయిత పేర సూర్యారావుపేట, విజయవాడ -2కు పంపాలి.



ఇటీవల టిక్కలి సాహిత్య సాంస్కృతిక సమాజం ఆధ్వర్యంలో టిక్కలిలో ప్రముఖ రచయిత శ్రీ కొండవలస శ్రీనివాసరావు "సంస్కృతి" కవితా సంపుటి ఆవిష్కరణోత్సవం జరిగిన సందర్భంగా తీసిన చిత్రంలో రచయిత శ్రీ కొండవలస శ్రీనివాసరావు, సమాజం అధ్యక్షులు శ్రీ ఆర్. పద్మనాభరావు, పుస్తక ఆవిష్కర్త, డా. మేజర్ టి. జోగారావు, ముఖ్య వక్త శ్రీ ఖజానా కోదండరావుగార్లను చూడవచ్చును.

# పెళ్లికొడుకు

**గౌరీపతికి బోలెడన్ని పెళ్లి సంబంధాలు వస్తున్నాయి. తనకి వచ్చే వాళ్ల స్థోమతలు నచ్చకో, తనకి ఉద్యోగం లేదన్న కారణంగానో అన్ని సంబంధాలు నెట్టేసుకొచ్చాడు.**

తన తల్లిదండ్రులు వచ్చే పోయే వాళ్లకి మర్యాదలు చేసి, మా అబ్బాయి ఇప్పట్లో చేసుకోనంటున్నాడని చెప్పి పంపడానికి ఇంక ఓపిక తగ్గి పోయింది. ఆఖరికి గౌరీపతి తండ్రికి మా అబ్బాయి ఇప్పట్లో పెళ్లి చేసుకోడు అని వీధిలో తాటికాయలంత అక్షరాలతో బోర్డు పెట్టేద్దామని అనిపించింది.

ఇంతలో గౌరీపతికి హఠాత్తుగా బ్యాంక్ జాబ్ వచ్చింది. దాంతో వచ్చిన వాళ్లే రావడం మొదలయ్యింది.

చటుక్కున సమయం చూసి అప్పటి దాకా కాసుకుని కూర్చున్న ఆ ఊర్లో కాస్త పలుకుబడి మోతుబరి జగన్నాథం గారు గౌరీపతి తండ్రిని పలకరించి సంబంధ బాంధవ్యాలు దగ్గరికి చేసేటప్పటికి అప్పటి వరకు వచ్చిన పెళ్లివారు



# భాగవతుల లక్ష్మీనరసింహమూర్తి

కాన్తా తగ్గుముఖం పట్టారు

జగన్నాథం గారు తమ కూతుర్ని కనుక గౌరీపతికి అడగడం జరిగితే మిగతా సంబంధాలేవీ చేసుకోరని వాళ్లకి నిశ్చయం అయిపోయింది

సమయం చూసి స్నేహం పెంచిన జగన్నాథం గారు ఓ రోజున ఆఖరుకు చెల్లెమ్మా! ఇల్లారామ్మా! అని భార్యా భర్త లిద్దర్ని పెట్టుకుని ఓ రోజు వాళ్లిద్దరి చెవుల్లో ఊదేసాడు

నా కూతుర్ని నీ కడుపులో వేసుకో వాలమ్మా చెల్లాయ్ అన్నాడు అంతటివాడు అల్లా అడగ డంతో ఆవిడ ఏమి చెప్పాలో తెలియక అల్లాగే అన్నయ్యా గారు అనేసింది

ప్రక్కనే గదిలో కూర్చుని శ్రద్ధగా వింటున్నాడు గౌరీపతి తల్లి దండ్రు లిద్దరు జగన్నాథం గారి మాటలు వింటూ మెలికలు తిరిగి పోతున్నారు

తన ఆలోచనలో తాను పడ్డాడు అమ్మాయి లావుగా ఉంటుంది ప్రక్కనే వెలుతుంటే సిగ్గేసి పోతుంది ఆ అయినా అడ్జస్ట్ అయిపోతే పోలా! తన స్నేహితు డెవరో చెప్పినట్లు అమ్మాయి లావుగా ఉంటే పరువు అఖ్ఖర్లేదురా! చేసుకుంటే మంచి వళ్లున్న అమ్మాయిని చేసుకోవాలి బక్క ప్రాణాల్ని చేసుకుంటే సుఖముండదురా అన్నాడు

అదీ నిజమేనేమో?

అమ్మో! ఆ ఇంట్లో మొగుడొ దిలేసిన ఆ పిల్ల పిన్ని ఒకత్తి ఉంది తల్చుకుంటేనే భయం

ఓ సారి వాళ్లింటి దగ్గర చిన్నప్పుడు మామిడి చెట్టెక్కి కోతి కొమ్మచ్చి లాడుతుంటే కొమ్మ జారి వాళ్లు ఎండ బెట్టుకున్న వడియాల మీద పడ్డానని ఎంత గోల చేసింది పరిగెట్టు కొచ్చేసాడు గాని వల్లు హూనం చేసేసేదే ఆ రోజు

ఆ తరువాత నాల్లు రోజుల వరకు ఆ వూళ్లో వాళ్లందర్ని పిలిచి ఇదే విషయం చెప్పింది వాళ్లకి తమకు మాటల్లేవు గానీ ఆ రోజు తన తండ్రితో చెపితే చంపేసేవాడతన్ని!

అటువంటి దానింటికి అల్లుడుగా వెళ్లడమా!

ఆ ఇవన్ని ఉంటాయేమిటి?

తను ఇప్పుడు ఆ ఇంటికి అల్లుడుగా వెడతాడు అందరూ నెత్తికెక్కించుకోరూ అయినా ఆ అమ్మాయిని చిన్నప్పుడెప్పుడో చూసాడు! ఇప్పుడు ఎలా ఉందో

మీరోసారి అమ్మాయిని చూడ్డానికి వస్తే బాగుంటుంది- జగన్నాథంగారు అంటున్నారు

మేము అమ్మాయినిచూడక్కరలేదండి! అమ్మాయి లక్ష్మీదేవి గదండి

పోనీ అబ్బాయిని ఒకసారి చూడడానికి రమ్మని చెప్పండి మా అమ్మాయిని చూసి మీ అబ్బాయి చాలా కాలం అయ్యింది కాలేజీ చదువు కోసం వైజాగ్‌లో ఉండి పోయాడు కదా!

పెళ్లికొడుకుతో సహా అప్పగారు, మరొక ఇద్దరు పెళ్లిచూపుల కెళ్లారు ఎంత హడావుడి చేసారనీ ఆడపెళ్లివారు

పెళ్లికూతురు పిన తల్లి ఎంత మర్యాద చేసింది! తన్ను చూసి ఎంత ఆనందపడి పోయిందో?



అప్పటికి ఇప్పటికి ఎంత మారిపోయాడో అబ్బాయి ఏదైన టౌను టౌనే అంటూ మెలికలు తిరిగి పోయింది

ఆశ్చర్య పోయాడు తను అప్పటికి ఇప్పటికి ఎంత మార్పొచ్చింది ఆవిడలో

గున్న ఏనుగులా ఉన్న ఓ ఆకారాన్ని తీసుకొచ్చి తన ముందు కూర్చో బెట్టారు! ఫార్మాలిటీస్ అన్నీ జౌతున్నాయి

తను ఆలోచనలో పడ్డాడు ఒక్కగా నొక్క కూతురు ఏభై ఎకరాల భూమి అన్నీ తనకో కళ్లు మూసుకుని తాళికట్టేస్తే ఇంట్లో ఇదుం టుంది బయట ప్రపంచంలో డబ్బుతో దొరికేవి ఎన్నో ఉంటాయి

కళ్లు మూసుకుని ఓ కే అన్నాడు

తాంబూలాలు అన్ని అయిపోయాయి రెండు రోజుల్లో పెళ్లి ఊళ్లో పెళ్లి గురించి విడిది కూడా ఇవ్వలేదు

తాంబూలాలు పుచ్చుకున్నప్పటి నుంచి తను ఆలోచనల్లో పడ్డాడు తను ఏవో ఊహించు కున్నాడు అందమైన అమ్మాయిని చేసుకోవాలను కున్నాడు ఎన్నోకలలు కన్నాడు తను పెద్దగానే చదువుకున్నాడు తన పేరంటే మోటుగా ఉంటుంది గానీ పర్సనాలిటీకి ఏమీలోటు లేదు స్నేహితులతో చెప్పాడు వాళ్లు పెదవి విరిచారు తనొక నిర్ణయానికి వచ్చాడు

అంతే! "ఆస్తికోసం ఆ అమ్మాయిని చేసుకోలేను" చెప్పేశాడు బాంబు పడినట్టుగా అదిరి పడ్డారు తల్లిదండ్రులు

ఈ పెళ్లే కనుక జరిగితే ఆ అమ్మాయికి నేను వేసేవి మూడు ముళ్లు కాదు నాకు నేనే వేసుకుంటాను ఉరితాడు ముళ్ళు గట్టిగా చెప్పాడు

ఇంత వరకు వచ్చింతరువాత ఈ పెళ్లి జరగక పోతే జగన్నాథం గారు ఏం చేస్తాడో వాళ్లందరికి బాగా తెలుసు

పెళ్లికి వంటవాళ్లు, కళ్యాణ మండపం, భజంత్రీలు అన్నీ సిద్ధమై పోతున్నాయి నిముషాల మీద

ఆ ఊర్లో జగన్నాథం మాటకు ఎదురులేదు కోపం వస్తే వివేకాన్ని కూడా మరిచి పోతాడు

కానీ తనకి ఇప్పుడు ఈ పెళ్లి జరిగితే శాశ్వతంగా బంధింప బడ్డాడు జీవితమే నరకం

తను పారిపోతే

అమ్మో! తన తల్లి దండ్రుల్ని చంపెయ్య గలడు!

ప్రస్తుతానికి ఈ పెళ్లి రోజు దాటియ్యాలి ఆ తర్వాత ఏదో ఆలోచించొచ్చు ఇంక పెళ్లి 12 గంటలు మాత్రమే ఉంది

గుండె చాలా స్పీడుగా కొట్టుకుంటోంది ఇంతలో తన స్నేహితుడు సుధాకర్ వచ్చాడు తన బాధంతా చెప్పాడు వెంటనే తనకి ఉపాయం చెప్పాడు సుధాకర్!

ముఖం వికసించింది ఇద్దరు బయటికి పరుగెత్తారు తల్లి దండ్రులకు, ఇంట్లో వాళ్లకు ఆందోళన ఎక్కువయ్యింది

కమిన్ అన్న పిలుపుతో స్నేహితు లిద్దరూ లోపలికెళ్లారు "హల్లో సుధాకర్ ఏమిటి ఇల్లా

వచ్చావు డా గోఖలే ఎం ఎస్ ప్రశ్నించాడు "సార్' ఇతను నా స్నేహితుడు గౌరీపతి అని' అంతకు ముందు జరిగినదంతా పూసగ్రుచ్చినట్టు, తన ప్లాను అంతా చెప్పాడు

సుధాకర్ ఏదో డాక్టరుతో నెమ్మదిగా మాట్లాడాడు సరేభగవంతుడిపైన బారం వేస్తాను డాక్టర్ మాటిచ్చాడు

గౌరీపతి తండ్రి, తల్లి, అప్ప చెల్లెళ్ళు గూడు పురాణి పన్నారు పెండ్లి ఇంకొక నాల్గు గంటలు ఉందనగా మనవాడు కడుపులో నొప్పి అని గిలగిలా కొట్టుకుంటాడు వెంటనే మనం గోఖలే గారి హాస్పిటల్‌కు తీసుకు వెళతాము ఆయన బయటకు వచ్చి ఇది అపెండి సైటిస్ అని ఇరవై నాల్గు గంటల్లోపు ఆపరేషన్ చెయ్యకపోతే ప్రమాదమని చెప్తారు వెంటనే మనం ఆపరేషన్ చేసెయ్యమంటాం

డాక్టరు గారు మనవాడ్ని ఆపరేషన్ థియేటర్ లోకి తీసుకెళ్ళి అరగంటసేపు నాటక మాడేస్తాడు మనవాడు వారం రోజుల దాకా బెడ్డు దిగఖ్ఖరలేదు తర్వాత సంగతి ఆలోచించొచ్చు ప్రస్తుతానికి ఇంతకంటే పెళ్లి తప్పించ టాన్కి ఇంకో మార్గం లేదు అంతా వప్పుకున్నారు గౌరీపతికి కూడా అదో రకంగా ఉంది వెంటనే ఒప్పేసు కున్నాడు

అనుకున్న సమయం రాగానే అమ్మో- బాబో చచ్చిపోతున్నాను కడుపులో నొప్పి అంటూ మెలికలు తిరిగి పోతున్నాడు గౌరీపతి ఇంతలో ఎవరో ముసలాయన అన్నాడు

ఉప్పునీళ్లివ్వండి తగ్గుతుందన్నాడు

ఉండండి ఉప్పునీళ్ళు మీరూను ఉప్పునీళ్ళకి తగ్గే రోజులు కావివి కసురుకున్నాడు సుధాకర్

మా ఊర్లో ఇదివరకు ఒకసారి ఇల్లాగే మా ఇంటి ప్రక్కతనికి అవీ ఇవీ అంటూ నాటు వైద్యం చేస్తూ కూర్చున్నారు

అంతే ఓ అరగంట తరువాత ఇంక ఊపిరి ఆడలేదతనికి

అమ్మో నాకు భయంగా ఉంది గౌరీపతి అరిచాడు వెంటనే టాక్సీలో హాస్పిటల్‌కు చేర్చారు

హాస్పిటల్లో సుధాకర్ ప్రక్కనే గౌరీపతి ఉన్నాడు కాంపౌండర్స్ గౌరీపతికి ఏవో చెప్తున్నారు అవన్నీ ఆపరేషన్ చేసేముందు పేషంట్‌కి సూచనలు

గౌరీపతి లోలోన నవ్వుకుంటున్నాడు డాక్టరు గారు కాంపౌండర్స్‌కు కూడా నిజం చెప్పలేదన్న మాట.

కాంపౌడర్‌లో ఒకడు గౌరీపతిని ఏదోలా చూసాడు

గౌరీపతిని ఆపరేషన్ థియేటర్‌లోకి తీసుకెళ్ళారు డాక్టరు చిరునవ్వుతో పలకరించాడు

హల్లో గౌరీపతి! నాటకం బాగా రక్తి కట్టించినట్టున్నావే!

"ఔనుసార్' గౌరీపతి చెప్పాడు

ఈ బల్లమీద కూర్చోండి చూపించాడు డాక్టర్ గౌరీపతికి ఒక్క విషయం బయట అందరూ కూడా మీ వాళ్ళు ఆతృతతోను కంగారుతోను ఉన్నారు ఇప్పటి దాకా నాటకం బాగానే ఉంది ఒక్క గంటలో బయటికెళ్ళి ఆపరేషన్ అయినట్టు నేను చెప్తాను ఏ మాత్రం అనుమానం రాకుండా మీరు ప్రవర్తించాలి జస్ట్ కొంచెం అలసినటువంటి ఫీలింగ్ రావాలి అంతే

"ఒకేసర్" అన్నాడు గౌరీపతి

ఇంజక్షన్ ఒకటి ఇస్తాను మన నాటకానికి మీ ముఖంలో మార్పు రావడానికి ఇది ఉపయోగిస్తుంది.

అల్లాగేసర్ అన్నాడు ఇంజక్షన్ అంటేనే భయపడే గౌరీపతి ఆ సమయంలో

అంతే తను మత్తులోకి జారుకున్నాడు

మరల తనకి మెలకువ వచ్చేటప్పటికి చాలా సేపయ్యింది

తనని చూడడానికి ఒక్కరొక్కరే లోపలికి వస్తున్నారు

ఆశ్చర్యం! తన శరీరం కదలలేని పరిస్థితిలో ఉంది తనకే ఆశ్చర్యం కలిగింది తను ఏమిటి ఇల్లా ఉన్నాడు అందరూ తననే పలకరిస్తున్నారు

ఆపరేషన్ సక్సెస్ అంటూ డా గోఖలే వెనకాలే సుధాకర్ వచ్చారు సారీ గౌరీ నీకు నిజంగానే ఆపరేషన్ జరిగింది

నీకు తెలియకుండగా, నీకు చెప్పకుండగానే ఈ నాటకం ఆడాల్సి వచ్చింది

కొద్ది రోజుల క్రితం మీ ఫామిలీ డాక్టర్ నీ గురించి చెప్పినప్పుడు మేము చాలా బాధపడ్డాము సెలవులో ఒకసారి ఆయన దగ్గరకు ట్రీట్‌మెంట్‌కు వెళ్ళినప్పుడు నీ మూత్రపిండము ఒకటి చెడిపోయిందని ఆపరేషన్ చేసి తీసెయ్యకపోతే ప్రమాదమని చెప్పారు.

ఇంజక్షన్ అంటేనే భయపడే నీవు ఆపరేషన్ అంటే ముందే చనిపోతావని మేమంతా ఆలోచించి ఈ ప్లాన్ వేసాము

ఆ అమ్మాయికి ఇంతకు ముందే వాళ్ళింట్లో ఉండే మేనమామతో పెళ్ళి నిశ్చయమయింది ఈ ముహూర్తానికే ఆమెకు పెళ్ళి

నీ గురించి మీ ఫామిలీ డాక్టరు చెప్పినప్పటి నుంచి నిన్ను దక్కించుకోవాలని ఈ ప్లానంతా నేను ఆలోచించాను మీ కుటుంబ సభ్యులు జగన్నాధంగారి కుటుంబ సభ్యులు కూడా ఎంతో సహకరించారు వాళ్ళందరికి కూడా మనం నిజంగా కృతజ్ఞులం అన్నాడు సుధాకర్!

ఒక్కసారి గౌరీపతి కళ్ళల్లో నీళ్ళునిండాయి. ఇటువంటి విషయాన్ని ఎంతో తెలివిగా ప్లానువేసి తన కోసం ఇంత రిస్కు తీసుకున్న సుధాకర్‌ని ఆర్ద్రంగా తడిసిన కళ్ళతో చూసాడు

లేవండోయ్ మరి పెళ్ళికి టైమయ్యింది అంటూ జగన్నాధంగారు తెగహడావిడి చేసాడు-

విజయ షోరూమ్
జె డి హాస్పటల్‌రోడ్, గవర్నరు పేట,
విజయవాడ-2, ఫోన్ 77142
వివాహాది శుభకార్యములకు వలయు
అన్నిరకముల ఫాన్సీ వస్త్రములకు
వెంకటగిరి వగైరా అసలు వెండిజరి
చీరెలకు దయచేయండి.

తెల్ల మచ్చలు
మా మందు వాడుట వల్ల తెలుపల, లోపల గల మచ్చల రంగు 36 గంటల్లో మారును త్వరగా వాటిని నివారించును చికిత్స కొరకు పూర్తి వివరాలతో రాయండి ఒక సీసా ఉచితంగా పొందండి ఎడ్రస్సు ఇంగ్లీషులో వ్రాయండి
JUGAL KISHORVAID (NO 55)
P O. KATRISARAI (GAYA)

తెల్ల జుట్టు
మా చికిత్స వల్ల తెల్ల జుట్టు నల్ల రంగులో మారును ఇక ముందు తెల్లజుట్టు రాకుండా నివారించును మీ యొక్క చిరునామాను ఇంగ్లీషులో వ్రాయండి పోస్టేజి ఛార్జీలతో సహా మాచికిత్సకు రూ 100 లు
NASHIM DAWAKHANA (NO 55)
P O KATRISARAI (GAYA)

'ఉత్తరాలు' శీర్షికకి
రాసేవారు
తమపేరు, పూర్తి చిరునామా
తెలుగు లిపిలో రాయాలని
మనవి చేస్తున్నాము.
—సంపాదకుడు.

Editorial Adviser. S. RADHAKRISHNA, Editor: VEERAJI,
Printed and Published by S NAGESWARARAO for Nageswara Rao Estates Ltd.,
at the Andhra Patrika Press, Gandhi Nagar, Vijayawada-520003
Phones. Editorial 75667, Business· 61247, 61248

# గళ్లనుడికట్టు-16

## ఫలితాలు : బహుమతులు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ■ | 1 శ | ■ | 2 క | 3 పి | ల | ■ | 4 సిం | ■ |
| 5 పా | కు | డు | ■ | నా | ■ | 6 వా | హి | ని |
| ■ | రి | ■ | 7 పా | క | ము | ■ | క | ■ |
| 8 ఖా | ■ | 9 వా | ■ | ము | ■ | 10 పౌ | ■ | 11 క |
| 12 మం | దా | కి | ని | ■ | 13 సు | లో | చ | న |
| డు | ■ | లి | ■ | 14 చే | ■ | మి | ■ | రు |
| ■ | 15 సూ | ■ | 16 ఆ | మ | ని | ■ | 17 మ | ■ |
| 18 మా | ర | న | ■ | కూ | ■ | 19 సు | ఖ | ము |
| ■ | న | ■ | 20 ము | ర | ళి | ■ | ము | ■ |

పాఠకులు అత్యంత ఉత్సాహంతో వందల సంఖ్యలో ఈ పోటీలో పాల్గొన్నారు. వారందరికి మా అభినందనలు! సరైన సమాధానం ఈసారి ఏడుగురు పంపగలి గారు. ఏడుగురికి బహుమతి మొత్తం రు. 200/-లను పంచడం జరిగింది. ఒక్కొక్కరికి రు. 28.55 పైసలు వంతున త్వరలో ఈ బహుమతులు నగదు రూపంలో వారికి పంపే ఏర్పాట్లు జరుగుతున్నాయి. మీరు పంపిన జవాబులు మా వద్దగల సీలుచేసిన జవాబుకు సరిపోవాలి. ఒకరు ఎన్నికూపన్‌లైనా పంపవచ్చును. కాని ఒక్క బహుమతికే అర్హులు. తెల్లకాగితం మీద వ్రాసిన కూపన్‌లు చెల్లవు. పత్రికలో కూపన్‌నే నింపి పంపాలి. ఒక పజిల్‌లో ఒకరికి ఒక బహుమతి కంటే ఎక్కువరాదు అని ప్రకటించినా ఒకే అన్సరు 2, 3 కూపన్‌లు పంపుతున్నవారు వున్నారు.

\- ఎడిటర్

### సరైన జవాబులు పంపిన వారి పేర్లు

టి. శ్రీనివాస్ (కాజీపేట), టి. మనోహర్‌స్వామి (దేవపూర్), టి. వాణి, (వరంగల్), పిల్లుట్ల మీనాక్షి (విజయవాడ), టి. సునీత (కాజీపేట), టి.వి. కృష్ణయ్య (వరంగల్), వి.వి. పార్వతీశం (వరంగల్).

# సాహితీ పజిల్

గెల్చుకోండి రు.200/-

## గళ్ల నుడి కట్టు -18

### ఆధారాలు

**నిలువు**

1 అకారం వచ్చినా కాంక్ష మారలేదు
2 నీతులు వల్లిస్తాడు– కాని లోపల ఉన్నాడు దుర్మార్గుడు
3 కళ్ళు బుళ్ళు కలిస్తే ఇదవుతుంది
4 ముఖ్యంగా దీన్ని పూర్తిచేసే సాహిత్యాన్ని పెంచుకోండి
5 ఇది మీ చేతిలో నే వున్నది
7 గుట్టను మారిస్తే కొండ
9 విజ్ఞానం వినోదం అందించే దీన్ని స్థాపించిన దేశోద్ధారకుడు
12 నీరు దీనివెంట పోతుంది
14 మ్రొక్కిన ఈయని వేల్పు
15 ఈ వారం పత్రిక వచ్చిందనగానే మీరిది తీస్తారు
16 తులుకులాడిలో ఇది కనిపిస్తుంది
17 పేలాలను ఇలా అంటారు

**అడ్డం**

1 అచ్చేం వదలిన పోతు
3 పండుగనే ఇలా అంటారు
5 బహిష్కరించటం
6 పగలును మొదలు మారిస్తే విలాసాలు
8 ఈనాములో అటు నుండి జొన్న చేను కోస్తే చిగురించింది
10 జనమేజయుడి తండ్రి
11 అటు నుండి మామగారు
13 కలవరపడకండి జతవుంది
15 బంగారమాయరా కోదండపాణి
17 పలావులో బలమున్నది
18 కుళ్లటం కాదు ఆభరణం
19 కవులు వీటిని తుమ్మెదల వరుసతో పోలుస్తారు

**అధారాలున్నాయి నుడికట్టు గళ్లు నింపండి!** ఈ కూపన్ కత్తిరించి మీ చిరునామా రాసి పంపండి! **అల్ కరెక్ట్** సొల్యూషన్ పంపినవారికి రు 200/– లు బహుమతి లభిస్తుంది– ఒకరికన్నా ఎక్కువమంది కరెక్టు అన్సర్‌లు పంపితే వారికి బహుమతి మొత్తం పంచటం జరుగుతుంది తుది నిర్ణయం సంపాదకునిదే!

–ఎడిటర్

### గడువు తేదీ 11-9-89

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ■ | 1 | | 2 | ■ | 3 | | 4 | ■ |
| ■ | | ■ | | ■ | | ■ | | ■ |
| 5 | | ■ | 6 | 7 | | ■ | 8 | 9 |
| | ■ | ■ | ■ | | ■ | ■ | ■ | |
| 10 | | | | ■ | 11 | | | |
| | ■ | ■ | ■ | 12 | ■ | ■ | ■ | |
| 13 | 14 | ■ | 15 | | 16 | ■ | 17 | |
| ■ | | ■ | | ■ | | ■ | | ■ |
| ■ | 18 | | | ■ | 19 | | | ■ |

కూర్పు. పింగళి వి కృష్ణారావు

ఆంధ్రసచిత్రవారపత్రిక

పంపినవారి పేరు :......................................................

పూర్తి చిరునామా:......................................................

........................................................ పిన్‌కోడ్..................

## ఇష్టం

"ఏ పత్రిక చూసినా ఏమున్నది గర్వకారణం, ప్రతి శీర్షిక సమస్తం సెక్స్ సాహిత్యపు పారాయణత్వం" అనుకునే ఈ రోజుల్లో సాహితీ విలువలను రక్షణకవచంలా కాపాడుతూ సామాజిక ధోరణు లకు అద్దంపట్టే సాహిత్యంతో వెలువడుతున్న "ఆంధ్రసచిత్ర వారపత్రిక" అంటే మాకెంతో ఇష్టం.

-బి. కృష్ణప్రసాద్, హైదరాబాద్.

## డొనేషన్లు

ఆంధ్రసచిత్రవారపత్రిక (28-7-89) సంచికలో 'తాజాకాలమ్'లో డొనేషనాలిటీ చాలా బాగుంది. నేటి విద్యారంగ పరిస్థితిని వీరాజీ కళ్లకు కట్టినట్లు వర్ణించారు. సీరియల్స్ బాగుంటున్నాయి. 'వర్క్‌షాప్' కథలలో కూడా లక్కీ పేర్లు వేస్తే బాగుంటుంది. దొంగ కథ చాలాబాగుంది.

-డి. జ్వాలా నరసింహారావు, డి. యోగానంద్-యమ్. సాయిగౌతమ్, నూజివీడు.

## టి.వి. సుభద్ర

సి.హెచ్. రాఘవయ్యగారు సుభద్రగా రమ్యకృష్ణ అని వ్రాయటం లోపమని పేర్కొన్నారు. అయితే సుభద్ర పాత్ర ఎంపికకు టి.వి. భారతం దర్శకుడు బి.ఆర్. చోప్రా ఐదుగురిని దృష్టిలో వుంచుకొన్నారు. సుభద్ర పాత్ర కోసం ఆ ఐదుగురు పోటీపడ్డారు. ఆ ఐదుగురిలో రమ్యకృష్ణ ఒకరు. అయితే ఫైనల్‌లో మరొకటి సుభద్ర పాత్రకు ఎంపిక కావడం జరిగింది. మన తెలుగు చిత్రసీమ జగత్తులో వర్ధమాన తారగా వెలుగొందుతున్న రమ్యకృష్ణ సుభద్ర పాత్రకోసం బి.ఆర్. చోప్రాగారి దృష్టిలో పట్టిందన్న విషయం పాఠకులకు తెలియజేయటం కోసమే రమ్యకృష్ణని సుభద్రగా చెప్పారని అనుకుంటున్నాను. దురదృష్టవశాత్తు ఆ పాత్ర మరొకటికి వెళ్ళినంత మాత్రాన రమ్యకృష్ణని సుభద్రగా పరిచయం చేయడం బాలేదనడం- లోపమనడం నచ్చలేదు.

బాణాల రమేష్‌బాబు, ఖమ్మం-4.

**ఈవారం సలహా**
**పత్రిక అద్దెకు తెస్తే కూపన్ కత్తిరించడం మరిచిపోకండి!...**

# వీక్లీ పోస్ట్

( 5 వ పేజీ తరువాయి)

**బహుమతి పొందిన లేఖ**

## కథలు

శివాలయంలో నివసించే పాముకు పాలు పోస్తే గుడిని, మంటపాన్ని కాపలికాస్తుంది. అదే ఈ అభినవ భారతంలో రామబ్రహ్మం లాటి విషనాగుకు పాలుపోస్తే గుడిని, మంటపాన్ని హరించివేస్తుంది. కెవియస్ ఎన్. మూర్తిగారి "కర్మణ్యేవాధి కారస్తే" కథ సృజనాత్మకంగా మలచబడి, గుండె కవాటాల్ని పదునైన భాషా సరళి తంత్రులు మీటినట్టుగా ఫీలయ్యాము. కులవైషమ్యాలను దృష్టీకరించుకుని కళామతల్లికి రక్తనీరాజనం అర్పించిన పరుశురామ భాగవతార్ పాత్ర ఎంతో భావుకతతో కూడుకుంది. కర్మఫల చదరంగంలో కదంత్రొక్కిన ఈ మూడు పావుల చిత్రీకరణ రచయితగారి అపూర్వ జిజ్ఞాసకు నిదర్శనం. ఆంధ్రసచిత్రవారపత్రికకే కథ ఆణిముత్యం.

- సింహగిరి వెంకటప్రతాప్, అయిజ.

## టి.వి. సుభద్ర

4-8-89 సంచికలో మన పత్రికది చిన్న లోపమని వ్రాసారు సి.హెచ్. రాఘవయ్యగారు. ఆయన ఏ ఉద్దేశంతో ఇలా అన్నారో మాకర్థంకాలేదు. మాకు చాలా కోపం వచ్చినది కారణంలేకుండా మన పత్రికను తప్పపట్టినందుకు. ఏ పత్రిక, పేపర్‌లోనూ టి.వి. సుభద్రగా రమ్యకృష్ణ ఎంపిక అయినట్లు వ్రాయలేదు అని అన్నారు. ఇది చాలా తప్పు. అసలు వారు ఏ పత్రిక చూడకుండా టి.వి.లో ప్రసారమయిన భారతం చూసి ఇలా అంటున్నట్టున్నారు. ముందు ఈమెను అనుకుని లాస్ట్ టైంలో వేరే తారని ఎన్నికచేసినట్టున్నారు. అన్ని సినీపత్రికల్లోనూ రమ్యకృష్ణ సుభద్రగా యాక్ట్ చేస్తుందని వ్రాసారు. మన సినిమారంజనిలో కూడా కావలిస్తే ఆ వార్త పడిన బుక్ నా దగ్గర వుంది పంపిస్తాను. సుభద్ర ఎంటర్ అయిన రోజుటి.వి. భారతం తెలుగు అనువాదం రాసే ఆదివారం ప్రతి డైలీ పేపర్‌లో (ఈనాడు) సుభద్రగా రమ్యకృష్ణ అనిరాసారు. మన పత్రిక ఎప్పుడూ పొరపడదు అనడానికి ఇంతకంటే నిదర్శనం ఇంకేం కావాలి?

వేగి సుశీల, కొవ్వూరు.

## చిన్న కోరిక

చాలా చాలా పత్రికలు ఆలస్యానికి కారణం న్యూస్ ప్రింట్ కొరత అని చెప్తారు మన పత్రికకు కూడ అదే కారణమున్నా కూడా పత్రికను సకాలానికి తీర్చిదిద్ది అందించడం నిజంగా గర్వకారణం కాని ఒ చిన్న రిక్వెస్ట్ ప్రతి పోటీ శీర్షిక వీక్లీ విడుదవారంలోగా పంపమని గడువు నిస్తున్నారు మారుమూల పల్లెలకి, దూరపు ఊళ్లకి ఒక్కో పత్రిక ఆలస్యంగా చేరుతుంది దాంతో పోటీ గడు తీరిపోయి పోటీల్లో పాల్గొనే అవకాశం చాలా మ... పాఠకులు పోగొట్టుకునే ప్రమాదం ఉ... సంపాదకులు అది గ్రహించి తేదీలు ప్రకటిం... వలసిందిగా ప్రార్థన

–ఎన్ పద్మప్రియ, (బేతపూడి)

## శాతవాహన

మా అభిమాన ఆంధ్ర సచిత్ర వారపత్రికలో వస్తున్న 'వజ్ర సంకల్పం' సీరియల్ శాతవాహన గారు ఎంతో చక్కగా వ్రాస్తున్నారు శైలి ఎంతగానో బాగుంది ఈ సీరియల్ ఈ పత్రికకో మరింత కొత్తదనాన్ని తీసుకవస్తుంది

–జి ఆనంద్ (వెల్లుల్ల)

## ద్రౌపది

"ద్రౌపది" సీరియల్ ఒకసారి చదివినా మరల మరలా చదవాలనిపిస్తోంది ప్రచురిస్తున్న ఎడిటర్‌గారికి, రచయిత ప్రయాగ రామకృష్ణ గారికి మా ధన్యవాదాలు –టి భారతి అప్పారావు (తుని)

## సెక్సు

'సెక్స్' గురించి తెలుసుకోవాలని ప్రయత్నించే వారిని "కామపిపాసి" అని పిలుస్తున్న ఈ తరుణంలో డా జి సమరంతో టి ఎస్. రావు ఇంటర్వ్యూ 'సెక్స్ విజ్ఞానం' (28-7-89 సంచిక) ప్రచురించడం చాల హర్షించదగిన విషయమే మాలో ఉన్న అపోహలను తొలగించి విజ్ఞానం అనే జ్యోతిని వెలిగించారు మన యూనివర్శిటీలలో సెక్స్ సంబంధిత ప్రత్యేక కోర్సును ప్రవేశపెడితే బాగుంటుంది కదా!

–ఎ. రామమూర్తి (పెద్దకల్వల) ●

## మీ జి. కె. ఎంత? జవాబులు

(1) ముగ్గురు. శ్రీ నీలం సంజీవరెడ్డి (1961, 62), దామోదరం సంజీవయ్య (1971), కాసు బ్రహ్మానందరెడ్డి (1976). (2) అమెరికా, రష్యా, చైనా, ఫ్రాన్స్ మరియు ఇజ్రాయిల్. (3) శ్రీ బి. ఎన్. చతుర్వేది. రు. 10000/-. (4) కె. శే. కిషోర్‌కుమార్. (5) కాంబోడియన్ (72) మరియు రోటఖస్ (11) అనే బోగన్ విల్లా ద్వీపవు భాష. (6) మదర్ థెరిసా (1979లో) (1948 నుండి భారతీయురాలు). (7) 1961లో జెర్సలేమ్‌లో. (8) హరీష్‌భిమానీ. (9) రష్యాకి చెందిన స్వెత్లానా సవిత్సకాయా, అమెరికాకి చెందిన శాల్లీ రైడ్. (10) ఆంద్రీ సఖరోవ్.